# సారస్వత సౌరభము

( సారస్వత వ్యాస సంపుటి )

గ్రంథకర్త:
డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం, ఎం. ఏ., పిహెచ్. డి.,
ఆంధ్రోపన్యాసకుడు,
నిజాం కళాశాల, హైదరాబాదు.



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సహాయముతో
ప్రకటితము.

ప్రథమ ముద్రణము - మార్చి. 1970

ప్రతులు : 1000



# SARASWATHA SAURABHAMU

(Telugu literary essays)

By

**Dr. G. V. Subrahmanyam, M. A. Ph. D.,**
Lecturer in Telugu, Nizam College, HYDERABAD A.P.



మూల్యము :
రూ. 4. 50

ప్రాప్తిస్థానములు :

1. డా. జి. వి. సుబ్రహ్మణ్యం, ఎం. ఎ. పిహెచ్, డి.,
"శ్రీవాణి"—1-8-702/105; శంకరమఠము వెనుక
నల్లకుంట, హైదరాబాదు.

2. ఆంధ్ర సారస్వత పరిషత్తు,
తిలక్ రోడ్, హైదరాబాదు-1

3. శ్రీ పరమేశ్వర పబ్లికేషన్సు,
చిక్కడపల్లి, హైదరాబాదు-20

ముద్రణ :
శివాజీ ప్రెస్
సికింద్రాబాదు.

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ రథసారథులు

సారస్వత నవనీత శేవధులు —

# శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి

అంకితము

శా. పారావారగభీరభావుఁడవు, విస్ఫారాచ్ఛసత్కీర్తిసం
భారోదారగుణాఢ్యశీలుఁడవు, శోభావీచిరోచిర్మనీ
షారోమాంచితకావ్యగోష్ఠికలనాసాహిత్యసంవేదివౌ
శ్రీరామానుజరాయ! అందుకొనుమా స్వీకర్తవై నాకృతిన్.

శా. సారమ్మైన మహాంధ్రకావ్యసరసిన్ సంపుల్లరాజీవముల్
నీరంధ్రప్రభ లీనుచున్నఁ గని వానిన్ డాసి హర్షించి మే
ధారమ్యప్రతిభాంగుళుల్ వరపి సంధానించి సాధించితిన్
సౌరభ్యప్రకరమ్ము; దీనిఁ గొనుమా సౌజన్యభవ్యాకృతీ!

మ. తెలఁగాణమ్మున మాతృభాషనిగళాల్ ద్రెంపంగ నుత్సాహులై
ఫలముం బొంద మహోద్యమంబు నలుపన్ పాగాల్ బిగంజుట్టి లోఁ
గలఁగంబాఱు నిరంకుశప్రభుతకుం గాలాంతపర్జన్యులై
వెలుఁగం గల్గిన వీరపార్థులకు గోవిందుండ! రామానుజా!

మ. తెలుఁగుల్ గూడి సమగ్రరాష్ట్రవిభవోత్తేజంబు లక్షించి లో
వెలుఁగుల్ నింపి సమైక్యసంస్కృతిసమావేశంబు సాధించుచో
కళలం బూర్ణశశిప్రభల్ నిగుడ రాకాసిద్ధి సాహిత్యవీ
ధులకు న్నిత్యము గూర్చు నిర్మలయశశ్శ్రీధుర్య! రామానుజా!

మ. బహుధా భిన్నము లైన లక్ష్యములతో బంధాల నిర్జించి లో
నహముల్ వెంచి యపూర్వకావ్యరచనావ్యాసంగసంగాత్ములౌ
బహిరంతర్వ్విధబోధ్యమానధిషణాప్రాగల్భ్యసారోద్ధతుల్
మహితుల్ కూడిన సంఘముల్ వెలయు నీమంత్రంబునన్ శాంతిమై.

శా. సాహిత్యంబును నీతివర్తనము సంస్కారపోషణప్రౌఢియున్
మోహాపేతవివేకసౌరభము సమ్మోదాత్మమిత్రాదృతుల్
నీహారాద్రిసమాత్మగౌరవము మన్నిల్ మెచ్చు ప్రాగల్భ్యమున్
సౌహిత్యంబుగ మేళవించిన గుణోత్సాహుండ! రామానుజా!

ఉ. మబ్బులు లేని వానవలె మాన్యమనీషిమిళిందపంక్తికిన్
అబ్బురపాటు కల్గ భవదాదరసారమరందధార తా
నబ్బును మైత్రిరూపమున నట్టిది నా కనుభూత మయ్యె; ఈ
కబ్బము నాఁడె నించినది కమ్మనితెమ్మెర సౌరభమ్ములన్.

ఉ. ఛాందసవృత్తి లేదు; గతి సాగుటకై చరణమ్ము లీడ్చుచున్
కుందిన జాడ లేదు; యతికోటుల యాగ్రహనిగ్రహాదులన్
నిందలు గొంట లేదు; గణనీయపదార్థవివేకసంగతిన్
పొందిక వీడ లేదు; నిను పొందెడు ఈకృతికిన్ సుధీమణీ!

శా. వ్యాసోల్లాసవిభావ మై, జలధరప్రాశస్త్యసంపాది యై
వాసిన్ కర్ణసుపర్వ మై, బహువిధోపాఖ్యానసంవేది యై
దేశీయాంధ్రపురాణవైభవము, వాగ్దేవీకళాపూర్ణిమల్
నీసమ్మోదము మీఱఁ దాల్చె కృతి; దీనిన్ నీవు పాలింపుమా!

# ఆ మో ద వీ చి

డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు
రీడరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు.

చిరంజీవి డా. జి. వి. సుబ్రహ్మణ్యము వర్ధమానులైన విద్వద్విమర్శకులలో అగ్రశ్రేణియందు నిలువదగినవాడు. వేదవిద్యాప్రవణమైన విప్రకుటుంబమున పుట్టి పెరిగిన ఈచిరంజీవిచిత్తక్షేత్రము వంశానుగత మైన సనాతనసంస్కారముచే సంపన్నమై ప్రాక్తనజన్మవాసనాసిద్ధమైన ప్రతిభాబీజముయొక్క సత్వరప్రరోహ ప్రవర్ధనములకు సర్వథా యోగ్యమై యున్నది. అదృష్టవశమున బోధనమహనీయులైన ఆచార్యవర్యుల బోధనాసుధాసేచనము లభించి ఈతని ప్రతిభాలత ఆపాద చూడమును అచిరప్రరూఢకోరకాలంకృత మైనది. సాహిత్యతత్త్వవేత్త యైన అగ్రజుని వాత్సల్యమృదుపరామర్శచే ఆకోరకము సుకుమారముగా వికసించినది. వాని సౌరభములే ఈ సంపుటియందలి వ్యాసములు. ఇవి ఆంధ్రసాహిత్యోపాసకుల అంతరంగములను ఆమోదతరంగితములు కావింప గలవు.

చిరంజీవి సుబ్రహ్మణ్యము ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఆంధ్రభాషా సాహిత్యములు అభిమానవిషయములుగా అధ్యయనము చేసి, ఎం. ఏ., పరీక్షయందు ప్రథమశ్రేణిలో ప్రథముడుగా ఉత్తీర్ణు డయ్యెను. మారన మార్కండేయ పురాణమును గూర్చి పరిశోధనము గావించి ప్రశస్తమైన సిద్ధాంతవ్యాసమును వ్రాసి డాక్టరేట్ పట్టమును సంపాదించెను. వీరరసము యొక్క విశ్వరూపమును నిరూపించు అపూర్వగ్రంథము రచించి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి బహుమతిని గెలుచుకొనెను. అకాడమీవారి ఆదేశము ననుసరించి బసవపురాణమునకు విపులపీఠికాలంకృత మైన సంక్షిప్తసంస్కరణమును సంతరించెను. ఆకాడమీవారి ఆదేశము ననుసరించియే రత్నములవంటి వ్యాసములను రెండుసంపుటములుగా సంకలనము చేసి సూక్ష్మసమీక్షారూపము లైన విపులపీఠికలను వానికి పట్టబంధములుగా సమర్చెను.

చిరంజీవి సుబ్రహ్మణ్యము ప్రతిభాశాలి, వ్యుత్పన్నుఁడు, వివేకి. సంప్రదాయానురక్తి, వృద్ధోపసేవాసక్తి, ఈతని చిత్తమునకు చక్కని పరిపాకమును సంయమమును సమకూర్చినవి. విషయవిశ్లేషణమునకు కావలసిన సూక్ష్మదృష్టియు, విశ్లిష్టాంశముల సమన్వయమునకు కావలసిన క్రాంతదృష్టియు ఈతనికి చక్కఁగా అలవడి యున్నవి. విషయమున సమగ్రత, పరిశీలనమున శాస్త్రీయత, సిద్ధాంతీకరణమున తార్కికత, ఈతని రచనల సామాన్య లక్షణములు. ఇతనిని ఉత్తమ పరిశోధకుడుగా, విమర్శకుడుగా, రచయితగా రూపొందించినది ఈతని సర్వప్రవృత్తికి ప్రాణభూత మైన ఉత్సాహము.

ఇష్టానిష్టప్రకటనము విమర్శ కాదు; అట్టిది రాగద్వేషజుష్టము కనుక. గుణదోష నిరూపణము కూడ విమర్శ కాదు; అట్టిది కేవలము శాస్త్రపరతంత్రము కనుక. తత్త్వావిష్కరణమే ఉత్తమవిమర్శ; అట్టిది పరమార్థనిరూపకము కనుక. జగత్తత్త్వమును దర్శించి దానిని కావ్యమున సౌందర్యరూపమున ఆవిష్కరించు కవికి ఋషిదర్శనమువంటి దర్శనము ఉండవలె నని భావించి పెద్దలు 'నా నృషిః కురుతే కావ్యమ్' అని సూత్రించిరి. కావ్యతత్త్వమును దర్శించి, దానిని లోకహితార్థము తన వ్యాసమున ఆవిష్కరించు విమర్శకునకు కవిదర్శనమువంటి దర్శనము ఉండవలయును గనుక మనము 'నా కవి ర్విమృశేత్ కావ్యమ్' అని అనుసూత్రింపవచ్చును. ఋషికి గల దర్శనశక్తితోపాటు దృష్టమైన అర్థమును భావించి జగదానందకర మగు సుందరరూపమును ప్రదర్శించు వర్ణనానైపుణియు కవికి గలదు. సహృదయునకు కవికి గల భావనాశక్తి మాత్రమే కలదు. ఆ భావనాశక్తితో పాటు భావితమైన కావ్యార్థమును జగదితంకరమగు పరమార్థరూపమున ప్రదర్శించు వ్యాఖ్యాననైపుణియు విమర్శకునకు కలదు. సూక్ష్మార్థావాప్తి నిరత మైన ధీవ్యాపారము నైపుణము అని శారదాతనయుడు వివరించెను. అట్టిధీవ్యాపారము గల విమర్శకుఁడే ఉత్తమ విమర్శకుడు. చిరంజీవి సుబ్రహ్మణ్యము ఇట్టి విమర్శకుల కోవలోని వాడు.

లోకమున ఎల్లరు సహృదయులు కారు. కాని వారిశ్రేయస్సు నభిలషించి విమర్శకుడు కావ్యతత్త్వము నావిష్కరించి చూపును. సద్విమర్శ ఒక వంక సాహిత్యారాధన; వేఱొకవంక లోకారాధన. కావ్యము వేద మైనచో విమర్శ ఉపనిషత్తు. కవి ఋషి యైనచో విమర్శకుడును ఋషియే. ఋషి కానివాడు కావ్యము చేయగూడనిచో కవి కానివాడు విమర్శ చేయగూడదు.

తత్త్వావిష్కరణమే లక్ష్యముగా గల విమర్శకుడు ఉత్తమ పరిశోధకుడు కూడ కావలెను. రససూత్రవ్యాఖ్యానములను పరామర్శించుచు అభినవగుప్తపాదులు ఉత్తమపరిశోధన లక్షణ మిట్లు నిర్దేశించిరి.

శ్లో॥ "తస్మాత్ సతా మత్ర న దూషితాని
మతాని తాన్యేవ తు శోధితాని
పూర్వప్రతిష్ఠాపిత యోజనాసు
మూలప్రతిష్ఠా ఫల మామనంతి"
'త దుచ్యతాం పరిశుద్ధ తత్త్వమ్'

సత్పురుషుల అభిప్రాయములకు దోష మాపాదింపరాదు. వాని యందలి దోషములను తొలగింపవలెను. ఆ తొలగించుటయే పరిశోధనము. పరిశోధనము వలన పరిశుద్ధతత్త్వము స్పష్టపడును. పూర్వప్రతిష్ఠితములైన మతములను సంయోజన చేయునపుడు మూలసిద్ధాంతమును శోధించి పరిశుద్ధరూపమును ప్రతిష్ఠింపవలెను. ఇది సంప్రదాయవేత్తలైన బుద్ధిమంతులు చేయుపని. చి॥ సుబ్రహ్మణ్యము ఇట్టి పరిశోధకుల కోవలోని వాడు. ఈవిధమైన పరిశోధన తపస్సు వంటిది కనుక పలువురు దానిజోలికి పోరు. తాళపత్ర గ్రంథములను సేకరించి, వ్రాతతప్పులు సవరించి పాఠాంతరములు సమకూర్చి ముద్రణమునకు సిద్ధముచేసి అదియొక పరిశోధన మని పలువురు తృప్తిపడుదురు. ముద్రితమయ్యు లోకుల అలసత కారణముగా అనాదృతిపాలైన ఒక మహాగ్రంథము యొక్క ఉపాదేయతను సహేతుకముగా స్పష్టముగా లోకులకు నివేదించుట పై దానికంటె మేలైన పరిశోధన మని నా యభిప్రాయము. చి॥ సుబ్రహ్మణ్యము ఇట్టి మేలైనపని కూడ చేసెను. మృతప్రాయమై యున్న మారన మార్కండేయ పురాణమును ఉజ్జీవింప చేసి కలకలలాడించెను. నక్రతిమింగలాదులకు భీతిలక మహాసముద్రమున మునిగి రత్నములను ముత్యములను పైకి తేగల ధైర్యశాలి ధీశాలి మాత్రమే ఇట్టి పనికి పూని నెగ్గగలడు!

భిన్నభిన్నగ్రంథములందు చెల్లచెదరై పడియున్న యంశములను సేకరించి, క్రోడీకరించి క్రమబద్ధమైన రూపమున ప్రదర్శించుటయు ఒక పరిశోధనగానే పరిగణింపబడుచున్నది. ఇది క్లేశముతో గూడిన పని. చి॥ సుబ్రహ్మణ్యా మిట్టి పనియు చేయగలడు. విజ్ఞానవీరుడైన అతని ఉత్సాహము నెదుట ఎంతటి క్లేశమును లేశమును గాదు.

కొన్ని విమర్శలు మేధావిలాస ప్రధానములుగా నుండును. అవి నిర్మాణాత్మకములై విజ్ఞానప్రదము లగును. కొన్ని విమర్శలు హృదయస్పంద ప్రధానములుగా నుండును, అవి సృజనాత్మకములై ఆనందప్రదములుగా నుండును. ఈ సంపుటియందు చి॥ సుబ్రహ్మణ్యము సమకూర్చిన వ్యాసములు వైవిధ్యశోభితములై ఆతని బహుముఖపరిశోధనాపాటవమునకును, వ్యాఖ్యాననైపుణికిని నిదర్శనములుగా నున్నవి.

'పురాణము – ఇతిహాసము' అనువ్యాసమున ఆ శబ్దముల నిరుక్తులు, వానిచే ప్రతిపాదింపబడు వస్తువులయొక్క స్వరూపములు, ఆ వస్తువుల నభివర్ణించు సారస్వత ప్రక్రియల లక్షణములు, అట్టి లక్షణములు గల గ్రంథముల లక్ష్యములు ప్రయోజనములు సూక్ష్మము, సర్వతోముఖము నైన దృష్టితో శాస్త్రీయమైన మార్గమున చర్చింపబడి సమగ్రముగా నిరూపింపబడినవి. పాశ్చాత్యుల 'మిత్, ఎపిక్' అనబడువాని స్వరూప స్వభావములు, వానియందలి భేదప్రభేదములు సునిశితముగా విమర్శింపబడి నిరూపింపబడినవి. వానికి పురాణేతిహాసములతో గల భేదసాదృశ్యములు పరిశీలింపబడి పురాణేతిహాసముల యొక్క విలక్షణత, ఉదాత్తత స్థాపింపబడినది. ఈ చర్చయందంతట వ్యాసకర్త ప్రదర్శించిన తటస్థభావము, సంయమము ప్రశంసనీయములు. పురాణేతిహాసముల ఆవిర్భావమునకు బీజములు వేదముల లోని అర్థవాదములందే కలవు. అతీతార్థప్రధానములైన వీనియందలి వృత్తాంతముల ప్రాచీనతను లఙ్ లుఙ్ లిట్ అను త్రివిధలకారములచే నిర్దేశింపబడిన భూతకాలత్రయముతో సమన్వయించుటకు చేసిన ప్రయత్నము మౌలికముగా నున్నది. 'పరిక్రియా పురాకల్ప ఇతిహాస గతిర్ద్వివిధా'' అని రాజశేఖరుడు చేసిన ఇతిహాసగతిభేదములను పరక్రియా పురాకల్పము లనెడు అర్థవాదములతో అనుసంధించి అర్థముల ఏకవక్తృత్వ బహువక్తృత్వములనే రాజశేఖరుడు ఏకనాయకత్వ బహునాయకత్వములుగా రూపించెనని చేసినయూహ చమత్కారవంతమే కాక, సత్యవంతమునై యున్నది. 'బహుశః మీమాంసకులు చెప్పెడి ఈ అర్థవాదభేదములను రాజశేఖరుడు గ్రహించి తన కావ్యమీమాంసయందు స్థాపించియుండవచ్చును'– అని వ్యాసకర్త తన యూహలో శంకాలేశమునకు తావిచ్చుచున్నాడు. ఈయనక్కరలేదు. 'కావ్యమీమాంస' అను పేరే అతని మీమాంసాశాస్త్రాభినివేశమును చాటుచున్నది. 'పరక్రియ' అను అర్థవాదమే 'పరిక్రియ' అను ఇతిహాసభేదముగా రూపొందినది. ఈ పదములందలి స్వరభేదము యాదృచ్ఛికము కాదు. పరిక్రియా 'పరిష్క్రియ' అనుపదములకు అలంక్రియ అని అర్థము. అలం

కృతమైన ఇతిహాసభేదము పరిక్రియ. అందలి వస్తువు ఏకనాయక మగుటయే 'పరిక్రియ' లేక 'పరిప్రిక్రియ'. నాయకైక్యము వస్త్వైక్యమునకును, రసైక్యము నకును కారణ మగును. కనుక పురాకల్పమైన ఇతిహాసమున రసమునకు ప్రాధా న్యము లేదు. అనగా సంపూర్ణకావ్యత్వము లేదు. కనుక దానికి పురాణత్వ శాస్త్రత్వములు సిద్ధించును. పరిక్రియ విశుద్ధమైన కావ్య మగును. కనుకనే రాజ శేఖరుడు రామాయణమును పరిక్రియగా భారతమును పురాకల్పముగా పేర్కొనెను. ఈ దృష్టితో చూచినచో సంస్కృతమున పురాకల్పమైన భారతమును తెలుగున పరిక్రియగా వెలయించుటకు కవిత్రయమువారు యత్నించినట్లు కనిపించును.

'మేఘసందేశము-ప్రకృతివర్ణనము' అను వ్యాసము విషయవిశ్లేషణము నకును, విశ్లిష్టాంశముల సమన్వయ పూర్వక వ్యాఖ్యానమునకును చక్కని ఉదా హరణము. కాదాళిదాసు సాహిత్యముపై ఎంతయో సాహిత్యము పుట్టినది. ఆయన కవితాసౌభాగ్యమును గూర్చి క్రొత్త విశేషములు చెప్పుట ఒకపాటివానికి శక్యము గాదు. ఆయనప్రతిభ ఉన్మేషించినట్లెల్ల ఉన్మేషించగల విలక్షణప్రతిభ గలవానికే అది శక్య మగును. మేఘసందేశమున వస్తువు లేదు. ఉన్నదంతయు వర్ణనయే. విశేషించి జడమో చేతనమో అయిన ప్రకృతియొక్క వర్ణనమే. జడము, చేతనము అని మన మందుము. కాని, ఆమహాకవి భావనలో పడి ఆయన చైతన్యమున మగ్నమై ఆయన కావ్యప్రపంచమున అవతరించిన వస్తువులకు జడము చేతనము అన్న భేదము లేదు. ఆయన నదీపర్వతకాంతారాదుల వర్ణనలలో ఈ రహస్య మెట్లిడియున్నదో వ్యాసకర్త చక్కగా నిరూపించెను. స్త్రీ పుంసయోగరూపమైన రతిభావమును జడప్రకృతియందు సైతము వర్షర్తు వెట్లు ఉద్దీపింప జేయునో పదార్థవిజ్ఞానశాస్త్ర సిద్ధాంతానుసారముగా వ్యాసకర్త నిరూపించినాడు. మేఘుని యాత్రను చతుర్విధపురుషార్థమయ మైన ఒకమహాపురుషుని జీవయాత్రగా కాళిదాసు ఉద్దేశించె నని యూహింప వచ్చును. పరోపకార మనెడి పరమధర్మము మేఘుని జీవితమునకు ప్రాతిపదిక. నానావిధశృంగారనాయిక లైన నర్మదాది నదీ లలామలతో ఉపభోగించు కాముకు డాతడు. అట్టివాడు సరస్వతీ జలపానముచే అంతశ్శుద్ధుడై గంగాజలమున మునిగి పవిత్రుడై కైలాసగిరి కేగి పార్వతీపరమేశ్వ రులను సేవించుటకు యోగ్యు డయ్యెను. తక్కిన నదులను శృంగారనాయికలుగా వర్ణించి, సరస్వతీగంగానదులను పుణ్యాంగనలుగా వర్ణించుటలో కాళిదాసుని ఆశయము క్షాళితకామకల్మషుని, సంచితపుణ్యుని కావించి మేఘుని కైలాసమునకు పంపుటయే యని వ్యాసకర్త చక్కగా భావించి నిరూపించెను.

మహాభారతమున కర్ణుని స్థాన మెట్టిదో అలంకారశాస్త్రానుసారముగా నిరూపింప నెవ్వరును ప్రయత్నించినట్లు కనపడదు. 'మహాభారతము, కర్ణుడు' అను వ్యాసమున వ్యాసకర్త అట్టి ప్రయత్నము చేసెను. నాయకపక్షమున అను నాయకోపనాయకులు ఉండుట ఆలంకారికులు గుర్తించి వారిలక్షణములను నిర్దేశించిరి. ప్రతినాయక పక్షముననను అట్టివారి యునికి సమంజసమే యని గుర్తించి కర్ణుడు ప్రతినాయకోపనాయకుడు అని వ్యాసకర్త శాస్త్రావిరుద్ధముగా సమర్థించెను; ప్రతి నాయక పక్షమునం దుండియు లోకులయొక్క సానుభూతికి అత్యంతము పాత్రు డగుటకు కర్ణుని జీవితమున గల రహస్యములను నిపుణముగా కనిపెట్టి ప్రపంచిం చెను. ఈ వ్యాసమున సుబ్రహ్మణ్యము చేసినది కర్ణుని శీలమును పరిశీలించుట కాదు; భారతమున చెదరి పడియున్న ఆతని జీవితాంశములను అనుసంధించి ఆతని సమగ్ర జీవితముయొక్క యథార్థస్వరూపమును చిత్రించి చూపుట. ఇట్టి విమర్శలో వివేచ నాత్మకమైన బుద్ధివ్యాపారముకంటె సమన్వయాత్మకమైన భావనావ్యాపారమునకే ప్రాధాన్యము. దీనిని చదువునప్పుడు కావ్యము చదునప్పటి యనుభవము వంటి అనుభవము కలుగును. ఇట్టి విమర్శయే సృజనాత్మకమైన విమర్శ యని నా అభి ప్రాయము.

ఓరుగంటిలో శివభక్తులు బసవపురాణము వినుచుండగా చూచి ప్రతాపరుద్ర దేవుడు 'ఆ పురాణంబు విధ మెట్లొకో' అని ఒక విప్రు నడిగెనట! ఆదూర్తవిప్రునకు దానివిధ మెట్టిదో తెలియదు. నేటివరకును తెలియలేదు. 'బసవపురాణ నిర్మాణము— జైనపురాణ ప్రభావము' అనువ్యాసమున చి॥ సుబ్రహ్మణ్యము బసవపురాణ స్వరూ పమును చక్కగా ఆవిష్కరించెను. ఆర్షసంప్రదాయ సిద్ధములైన పురాణముల యొక్క స్వరూపమును, తద్విరుద్ధములైన జైనపురాణములయొక్క లక్షణములను తదనుసారులైన శైవపురాణముల లక్షణములను వ్యాసకర్త సాకల్యముగా పరిశీ లించి, వానికి గల భేదములను సాదృశ్యములను స్పష్టముగా నిరూపించెను. ఈవ్యాస మున ప్రతిపాదింప బడిన సిద్ధాంతము అపూర్వమైనది. విపులమైన సామగ్రిని సేకరించి అందలి అంశములను తులనాత్మకదృష్టితో సూక్ష్మముగా పరిశీలించి ఒక నవీనమైన సిద్ధాంతమునకు అభిముఖముగా నిపుణముగా సమన్వయించి సుబ్రహ్మ ణ్యము ఈ వ్యాసమును పరిశోధకులకు చక్కని ఒజ్జబంతిగా రూపొందించెను.

పురాణరచనలో ధర్మప్రతిపాదనమునకే తప్ప, కథాకథన శిల్పమునకు, రసపోషణమునకు, పాత్రచిత్రణమునకు ఏమాత్రమును అవకాశము లే దందురు.

అది సంస్కృత పురాణముల విషయమున నిజమైన కావచ్చును. కాని, తెలుగు పురాణములతీరు వేరు. అవి పుట్టిన కాలమును బట్టి అవి పట్టిన మార్గములు వేరైనవి. తెలుగున వెలసిన మొదటి మహాపురాణము మార్కండేయము. దానిని రచించినవాడు మారన. ఆతడు తిక్కనగారి శిష్యుడు. తిక్కనగారి ముద్ర ప్రత్యక్షముగా పడినవాడు. తిక్కన రసప్రవణుడు. వ్యాసభారతమును ఆయన తెనుగు బాసలో వినిర్మించెను. ఆ వినిర్మించుట రసపుష్టి కొరకు. ఆయన మహాభారతమును ప్రబంధమండలిగా నిర్మించెను. మారన కా రహస్యము తెలియును. మార్కండేయ పురాణమును గూడ ప్రబంధమండలిగానే ఆతడు నిర్మించెను; పురాణపరమార్థము చెడకుండునట్లు కావ్యపరమార్థమును పోషించెను. మారన నిర్మించినది వట్టి పురాణము కాదు; ప్రౌఢపురాణము. అనగా యథాస్థానమున రస భావబంధురమైనది; వివిధ కావ్యశిల్పములతో విలసిల్లినది. ఈ యంశమును తొలుత గుర్తించి నిరూపించినవాడు చి॥ సుబ్రహ్మణ్యము. ఒక పురాణమును కావ్యముగా దర్శించుట కెంతయో సహృదయత కావలయును. అట్లుగా నిరూపించుట కెంతయో ప్రజ్ఞ కావలెను. 'మారన హరిశ్చంద్రోపాఖ్యాన' మను వ్యాసమున వేదమున, మార్కండేయ పురాణమున, మారన గ్రంథమున హరిశ్చంద్రుని కథ ఎట్లు క్రమవికాసము పొంది, సుందర కావ్యస్వరూపమును ధరించినదో ఈ వ్యాసమున చక్కగా నిరూపింపబడినది. సన్నివేశకల్పనమున, కథానిర్మాణమున, పాత్రచిత్రణమున, రసపోషణమున, అంగాంగిరససమన్వయమున మారన ఎట్టి సుకుమారమైన శిల్పమును ప్రదర్శించెనో ఈవ్యాసమున ప్రత్యక్షర పరిశీలన పూర్వకముగా నిరూపింప బడినది. మరుగుపడి యున్న ఒక మాణిక్యమును మెరుగుపెట్టి మరులుకొల్పు నట్లు చేసి, సుబ్రహ్మణ్యము తెలుగువారికి కనువిప్పు కలిగించినాడు.

రాయలవారు వర్ణనాప్రియు లని జగ మెరిగిన సత్యము. ఆ వర్ణనలయందలి చమత్కారములు పలువు రెరిగిన రహస్యములు. ఎవరికిని తెలియని యొక రహస్యమును సుబ్రహ్మణ్యము కనిపెట్టినాడు. అది విల్లిపుత్తూరును, మధురను వర్ణించు పట్ల రాయలవా రవలంబించిన విలక్షణమైన ఔచిత్యము. విల్లిపుత్తూరు విరక్తుడైన విష్ణుచిత్తుని ఆవాసము. దానికి ప్రభువు మహావిష్ణువు. ఆ నగరమందలి వాతావరణమంతయు విష్ణుభక్తిగుంఫితమై యున్నదా యన్నట్లు రాయలవా రానగరమును వర్ణించిరి. మధురానగరమునకు ప్రభువు పాండ్యరాజు. అతని పేరు

మత్స్యధ్వజుడు. అనగా మన్మథుడు. అచ్చట సర్వమును శృంగారమయముగా నున్నదా యనునట్లు రాయలవా రా నగరమును వర్ణించెను. ఈ రెండునగరముల వర్ణనములయందు ఇట్టి సమన్వయసూత్ర మొకటి వ్యాపించి యున్నదని ఈవ్యాస కర్త నిరూపించిన తీరు మిక్కిలి ప్రౌఢముగా నున్నది.

వరూథిని అనగానే పెద్దనగారు తీర్చిన వరూథినియే ఎల్లరకును స్ఫురిం చును. కాని అమె అంతకు పూర్వము ఎన్నడో పుట్టినది. ఆమె తొలిసృష్టి సంస్కృత మార్కండేయ పురాణమున జరిగినది. ఆమె వరాప్సర, మహాభాగ, మౌలేయ, రూపశాలిని. మారన మార్కండేయ పురాణమున అమె అభిమాన వతిగా, చతురవచోరచనాధురీణగా రూపొందినది. పెద్దన మనుచరిత్రమున ఆమె జాత్యహంకారవతిగా ప్రౌఢవచోనిపుణగా రూపొందినది. పురాణమున, పురాణ కావ్యమున, ప్రబంధమున వరూథినీ పాత్రము పొందిన ఈ క్రమవికాసమును, ఆ వికాసమునందలి దశాంతరములను వ్యాసకర్త నిపుణముగా చిత్రించినాడు.

కావ్యమున వస్తువునకు సర్వప్రాధాన్యమును ప్రాచీను లంగీకరింప లేదు. వస్తువునందలి అపూర్వకల్పనలకు కూడ రసపర్యవసాయిత్వమునే విధించిరి. కేవలకల్పితకథలకు కావ్యార్హతయే వారు నిరాకరించిరి. పింగళి సూరన రచించిన అపూర్వకథా సంవిధాన మహనీయ మగు కళాపూర్ణోదయము రసవన్మహాప్రబంధ ముగా ఆంధ్రుల ఆదరము పొందినట్లు కనపడదు. అపూర్వవస్తుకల్పన, విచిత్ర వస్తుసంధానము దానికి ప్రాణములు. వస్తువునకు ప్రాధాన్య మిచ్చు పాశ్చాత్య సాహిత్య సంస్కారము బలసిన తరువాత కళాపూర్ణోదయము ప్రశస్తి హెచ్చినది. ఆ కథానిర్మాణవిలక్షణతను గురించి, అందలి తాత్త్విక రహస్యములను గురించి, ప్రేమసిద్ధాంతములను గురించి గ్రంథములు, వ్యాసములు బయలుదేరి నవి. కథానిర్మాణమందలి చమత్కారములు నిరూపింపబడినవి గాని ఆ కథాంశము లకు బీజము లన్వేషింపబడలేదు. అట్టి అన్వేషణకు కీలకము దొరకలేదు. ఆ కీల కమును సుబ్రహ్మణ్యము కనిపెట్టినాడు. సరస్వతీ చతుర్ముఖుల కేళీఘట్టమున బ్రహ్మ వాణితో పలికిన పలుకులలో సూరన ఈ కీలకమును నిక్షేపించినాడు. ఇది యొక గ్రంథగ్రంథి. ఈ ముడిని విప్పినచో గ్రంథరహస్యము గుప్పున గుబాళిం చును. 'కలభాషిణీ కథామూలము' అను వ్యాసమున గుబాళించిన సౌరభము ఈ రహస్యమే. 'అందు వాచ్యత తోచినట్టి నామజాతి క్రియాదిక సకలపదార్థ వాక్యార్థాంతరము లెవ్వి యవియ యందు కలయవి' అను వాక్యమందలి 'వాచ్యత

తోచినట్టి' అను మాటలలో ఏదో రహస్యము దోబూచులాడుచున్నట్లు చి॥ సుబ్రహ్మ ణ్యమునకు తోచినది. ఆ తోచుట దైవికమే కాని దాని నన్వేషించి పట్టుకొనుటకు పురుషప్రయత్నము కావలెను. చి॥ సుబ్రహ్మణ్య మా ప్రయత్నము చేసి ఆ రహస్య మును సాధించినాడు. కలభాషిణీవృత్తాంతకల్పనకు మూలములైన బీజములు వాణీముఖ ప్రతిబింబ వర్ణనాఘట్టమున నిక్షిప్తములై యున్న వని అనుమానించి, నిశితముగా పరిశీలించి, వాణీచతుర్ముఖుల ముఖబింబముల యొక్కయు, మణిస్తంభ మునందలి తత్ప్రతిబింబముల యొక్కయు కదలికలయందు కలభాషిణీ కథయందలి సర్వకథాంతరములును కదలాడుచున్నట్లు కనిపెట్టెను; సూక్ష్మాతిసూక్ష్మ వివరము లతో ఆ కథాంశములకు మూలములైన బీజములను ఎత్తిచూపెను. కళాపూర్ణో దయ పరిశీలనమున సరిక్రొత్తయైన మార్గమును త్రొక్కి అనితరసాధ్యమైన రహ స్యమును సాధించి చి॥ సుబ్రహ్మణ్యము పింగళి సూరన ప్రతిష్ఠను మఱియొక మెట్టు పై కెక్కించెను.

జంటకవులుగా తిరుపతి వేంకటేశ్వర కవుల పాండిత్యము, స్వభావము, వ్యక్తిత్వము, వారికవిత్వముయొక్క ప్రశస్తి, సాహిత్యమునకు వారు చేసిన సేవ, మొదలగు నంశముల గూర్చియు బుద్ధ చరిత్రమును వా రాంధ్రీకరించిన తీరునుగూర్చియు చేసిన పరిశీలనములు ఆతని వివేచనా శక్తికి తార్కాణములుగా నున్నవి.

నాకు వ్యాకరణము రుచించదు. ఇంత సాహిత్యశిల్పదృష్టి గల సుబ్ర హ్మణ్యము మనస్సు వ్యాకరణము మీది కెట్లు పోయెనో ద్రుతస్వరూపమునుగూర్చి ఈతడు వ్రాసిన 17 పుటల వ్యాసమును చూచి ఆశ్చర్యపడితిని. ద్రుతమునుగూర్చి చెప్పదగినది ఇంత ఉన్నదా! ఇంకను ఏమైన ఉన్నదా! ఉండదు. ఉండనిచ్చుట సుబ్రహ్మణ్యము స్వభావము కాదు. ఎంతో విషయమును సేకరించుటయే కాక, సేకరించిన విషయములందలి విరోధాభాసములను సమన్వయించుచు ద్రుతముయొక్క వివిధావతారములను ఆత డేకసూత్రమున నడిపించి చూపెను. 'ఈ చిన్నివ్యాసమున ద్రుతస్వరూప నిరూపణమును గూర్చి యథాశక్తి వ్రాయబడినది' అని చెప్పికొనెను. ఇది వినయముతో చెప్పుకొన్నమాట, విద్యాతృష్ణవలెనే వినయమును అతనికి జీవనిష్ఠమైన ఒక మహాగుణము. 'విద్య యొసగును వినయంబు, వినయమునను బడయు పాత్రత, పాత్రత వలన ధనము, ధనము వలనను ధర్మంబు, దానివలన నైహికాముష్మిక సుఖంబు లందు నరుడు' అని అనుభవ మహితులైన మహాత్ములు

చెప్పిన ఈ సూక్తికి సర్వదా లక్ష్యభూతు డగునట్లు పరమేశ్వరుడు ఈ చిరంజీవిని ఆశీర్వదించు గాక అని వేడుకొందును. ఇట్టి రచనలను పెక్కింటిని సమర్పించి ఆంధ్ర సరస్వతిని, ఆంధ్రలోకమును, ఆరాధించి ఈ చిరంజీవి చరితార్థు డగు గాక అని ఆశాసింతును.

ఇతి శివమ్.

పాటిబండ మాధవశర్మ

# ఆశీస్సులు

## ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు

రిటైర్డు - ఆంధ్ర శాఖాధ్యక్షులు,
ఆంధ్ర శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములు.

తిరుపతి.
27-12-69.

చి॥ శ్రీ సుబ్రహ్మణ్యముగారికి, ఆశీర్వచనములు.

సారస్వత సౌరభము అనే మీ వ్యాససంపుటిని చాలభాగం చదివి సంతోషించాను. మీరు నిరుష్టమైన పాండిత్యము కలవారుగా, నిశితపరిశోధనదృష్టి కలవారుగా సరసవ్యాసకర్తలుగా లోకంలో ప్రతిష్ఠ గడించారు. అట్టి మీకు ఈ సంపుటిని గుఱించి నా అభిప్రాయము గాని, ఇంకొకరి అభిప్రాయము గాని ఆవశ్యకమని నే ననుకోను. అయినా మీ కోరికను త్రోసిపుచ్చలేక ఒకటిరెండు వాక్యాలు వ్రాస్తున్నాను.

పైన నేను పేర్కొన్నవి మీ సారస్వతయశమునకు కారణమైన ప్రజ్ఞలు. ఈ వ్యాససంపుటి కూడ ఆ ప్రజ్ఞావిశేషములకు అనుగుణముగానే ఉన్నది కాని భిన్నముగా లేదు. విశేషించి కళాపూర్ణోదయమునందలి సరస్వతీ చతుర్ముఖుల ప్రణయకలహాంశములకు మీరు చెప్పిన నూతనవ్యాఖ్యానము అపూర్వమును అద్భుతముగా నున్నది. ఆ గ్రంథకర్త, పింగళి సూరన, మి మ్మనుగ్రహింపుగాక! మీకు గల వృద్ధసేవాతత్పరత మీకు సర్వదా రక్ష యగుగాక!

పింగళి లక్ష్మీకాంతం

## ఆచార్య డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు

ఆంధ్ర శాఖాధ్యక్షులు,
ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు.

శ్రీ చి. డా. సుబ్రహ్మణ్యముగా రాదరగౌరవములతో నర్పించిన సారస్వత సౌరభము నాఘ్రాణించి యానందము నందితిని. వారు ప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు మూఁడును పుష్కలముగాఁ గల యువపుంగవులు. ఈ వ్యాససంపుటమందలి

ప్రతివ్యాసమును వారి నిశిత పరిశీలనమును, పాండితీ పరిపాకమును, శైలీరామ ణీయకమును జాటుచున్నది.

వారు మొదటివ్యాసమున పురాణేతిహాసముల లక్షణములను, పాశ్చాత్యుల ఎపిక్ మిత్తులకును వానికిని గల సంబంధమును జక్కగా విశదీకరించినారు. మేఘ సందేశమునందలి కాళిదాసుని ప్రకృతి వర్ణన నైపుణ్యమును, ఆముక్తమందలి రాయలవర్ణన చాకచక్యమును, బసవపురాణమునఁ గల జైనపురాణ ప్రభావమును వారు నేర్పుతో నిరూపించినారు. వారు వరూధిని మానినీత్వమును వ్యక్తము చేసిన వ్యాసము మిక్కిలి సరసముగా నున్నది.

సరస్వతీ బ్రహ్మల కేళీవృత్తాంతమందే కలభాషిణీకళాపూర్ణుల యుదంత ములు వ్యంగ్యముగను వాచ్యముగను గోచరించుచున్నవని వారు కావించిన సిద్ధాంతము నూతనమై వారి పరిశోధన ప్రాభవమును జాటుచున్నది.

జంటకవు లను వ్యాసమున వారు శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల ప్రతిభా మనస్తత్త్వములను బాగుగాఁ బ్రకటించియున్నారు. బుద్ధచరిత్రను సంస్కృతాంగ్ల మూలములతోఁ బోల్చి, వారు చేసిన విమర్శన బహుపరిశ్రమసాధ్య మైనది.

మారన మార్కండేయ పురాణమందలి హరిశ్చంద్రోపాఖ్యానము విశిష్టతను, మహాభారతమున కర్ణపాత్రకుఁ గల ప్రాధాన్యమును వారు నిరూపించినతీరు ప్రశంసా పాత్రముగా నున్నది. ద్రుతస్వరూపమును నిరూపించుటలో వారు వివిధాంధ్ర వ్యాకర్తల యభిప్రాయములను నిశితముగాఁ బరిశీలించి యాథార్థ్యమును వెల్ల డించినారు.

ఇందలి యొక్కొక్కవ్యాస మొక్కొక్క విశిష్టతతోఁ గూడి శ్రీ సుబ్రహ్మ ణ్యముగారి సర్వతోముఖ సామర్థ్యమును జాటుచున్నది. వారి శైలి నిర్దుష్టమై, విషయవివరణ దక్షమై, ప్రౌఢమై, విశదమై చదివిన కొలంది చదువవలె నను నుత్కంఠ కలిగించుచున్నది. వర్ధిష్యమాణులైన వారి వలన నాంధ్రభారతి కభి నవాలంకృతు లెన్నో చేకూరు నను నాయాశయు నాశయమును సత్వరసిద్ధి నొందుఁ గాక యని భగవంతుని ప్రార్థించుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని

8-1-70

## డా. పల్లా దుర్గయ్య
రీడరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము,
హైదరాబాదు.

ఇది సారస్వత సౌరభము. విమర్శక వ్యాసముల సంపుటి. కర్త డా. జి.వి. సుబ్రహ్మణ్యము. నిత్యసాహిత్య వ్యవసాయకు డీయన.

సాహిత్య మొక నందనవనము. అందలి అందాల తీవపందిళ్ళు ఆంధ్ర కావ్యపుష్పవాటికలు ; రసబంధుర పేటికలు.

కావ్యోద్యానములో విహరించి, సుకుమార కావ్యసమగర్భాంతరాళములు గవేషించి, పూలపాట పుక్కిలించి, పూలతావి పుడిసిలించి, తనిసిపోయి, తనిసి పోని విమర్శక పుష్పంధయము శ్రీ సుబ్రహ్మణ్యము.

తా నాస్వాదించిన రసములను, తా నాఘ్రాణించిన వాసనలను పదిమందికి పంచవలెనను బలీయమగు ఉబలాటమునకు ఫలితము ఈ సారస్వత సౌరభము.

దారి తెలియని ప్రవరునకు వరూథిని గారుదోత్కీర్ణభవనముజాడ తెలుపుటకు ఉపకరించినవి నాడు కస్తూరి పచ్చకప్పురముల ఘుమఘుమలు.

తీరు తెలియని జిజ్ఞాసువునకు ఆంధ్రసాహిత్యపు తెన్ను తెలిగించుటకు నేడు ఉపకరించునది ఈ సారస్వతసౌరభము.

ఇందలి వ్యాసములు పదునొకండును విషయవైవిధ్య విలసితములు. ఇందలి విమర్శనావిధానమును వినూత్నము. భారత, బసవపురాణ, మార్కండేయపురాణాదు లతిప్రాచీనములు. వరూథినీ కలభాషిణులును ప్రాతపడిన ప్రబంధ నాయికలే. ఐనను ప్రాతలో నుండియే ఏదో క్రొత్తవిషయము ఎత్తి చూపి, ఒత్తి చెప్పుటకు ఈ గ్రంథమం దంతటను ప్రయత్నము జరిగినది. ఇది యీ వ్యాసకర్త ప్రత్యేక గుణము. విషయపరిశీలనాసక్తి, విషయ వివేచనాశక్తి సర్వత్ర గోచరించును. కలభాషిణీ కథామూలము నరయుటకు జరిగిన యత్నములలో నిది ఆద్యము, అనవద్యము, నవ్యము, భవ్యము.

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము, లోకకావ్యాద్యవేక్షణములు కవికి ఆవశ్యకము లనిరి. ఈ గుణములు మాత్రమే కాక కవిహృదయము నర్థము చేసికొనగల సహృదయము, అర్థము చేసికొనినదానిని సరళముగను సరసముగను స్పష్టము

గను ప్రకటించునట్టి భాషాశైలులును, సత్యాన్వేషణదృష్టియు సద్విమర్శకునకు ముఖ్యగుణములు. ఈ గ్రంథమునందలి విమర్శ ఏవంవిధ గుణవిలసితము.

ఈ వ్యాసములు చదివిన మీదట 'కవికంటె రసజ్ఞుఁ డెఱుఁగు' నను భావము పాఠకులకు కలుగును. ఇది శ్రీ సుబ్రహ్మణ్యముగారి విమర్శనపాటవము నకు గీటురాయి.

ఆంధ్రసారస్వతము నవలోడించి ఆంధ్రులకు 'వీరరసము' చూఱలిచ్చిన శ్రీ సుబ్రహ్మణ్యముగారి ఈ 'సారస్వతసౌరభము' సకలాంధ్ర సహృదయులకు బుద్ధి ఘ్రాణేంద్రియ సంతర్పణమును సంతరించుగాక !

హైదరాబాదు.
18-2-1970 పల్లా దుర్గయ్య

## డాక్టర్ సి. నారాయణ రెడ్డిగారు

రీడర్, ఉస్మానియా విశ్వవిద్యాలయము,
హైదరాబాదు.

## మలిమెట్టు

సాహిత్యవిమర్శ రెండురకాలు. ఒక గ్రంథాన్నో, ఒక ప్రత్యేక విషయాన్నో తీసుకొని అంగాంగపరిశీలనం చేసి అంతరంగంలో మునకలు వేసి చేతి కందిన ముత్యాలో రత్నాలో సేకరించి వలసినవారికి అందివ్వడం ఒకరకం. క్షుణ్ణమార్గ సంచారం కాకుండా, ఏవో ఒక సరికొత్త మెరుపుకోసం మథనపడి, నిదుర చెడి, ఏ సుముహూర్తాననో ఒక నవ్యాంశం తటిత్తులా మెరిస్తే దానికి కరచరణాలు కల్పించి, సమగ్రరూపం శిల్పించి ప్రాజ్ఞుల యెదుట ప్రదర్శించడం మరోరకం. ఈ సారస్వత సౌరభాన్ని సమాఘ్రాణిస్తే మిత్రుడు డా. సుబ్రహ్మణ్యం మలిరకా నికి చెందినవాడనే బోధపడుతుంది.

బసవపురాణ ముంది. ఈ కావ్యాన్ని గూర్చిన చర్చ లన్నీ సామాన్యంగా దేశికవిత, ద్విపదచ్ఛందస్సు, జానుతెనుగు, సాంఘిక జీవన చిత్రణం, వీరశైవ మతప్రాబల్యం మొదలైన అంశాలచుట్టే చంక్రమణం చేస్తుంటాయి. సుబ్రహ్మణ్యం ఎన్నుకున్న తెన్ను వేరు. బసవపురాణం పురాణమా ? ఎలా ? నిజానికి భారతభాగ వతాదులు పురాణాలు. బసవపురాణం పురాణకావ్య సంప్రదాయాన్ని ధిక్కరించిన అచ్చమైన దేశికావ్యం. మరి అది పురాణం ఎలా అయింది ? ఆరంభ మైంది

ఆలోచనాకదనం. అంతర్మథనం. ఫలితం – బసవపురాణం జైనపురాణ ప్రభా వాన్ని పుక్కిట బట్టుకున్న రచన అని నిగ్గుతేల్చడం. అందుకు ఉపస్కారకంగా సంస్కృతపురాణాల్లోని పంచలక్షణాలకు ప్రతిగా జైనులు తమ పురాణాల్లో నిబంధించిన ఉత్సవపంచలక్షణాలను పేర్కొని, వాటిని బసవపురాణంపట్ల అతిసమర్థంగా సమన్వయించి చూపడం.

అలాగే మహాభారతంలో కర్ణుణ్ని ఉపప్రతినాయకుడుగా (ఈనాటి Deputy Leader of the Opposition ని తలపిస్తున్న దీమాట) సిద్ధాంతీకరించి, అందుకు తగిన ఉపపత్తులను క్రోడీకరించి, 'రోషమయ మహాతరువు సుయోధను; డురుస్కంధ మందులోన కర్ణు' డన్న ఉద్యోగపర్వంలోని పద్యాన్ని గుండెకాయగా స్వీకరించి, మొత్తం వ్యాసం ఒకేఒక కేంద్రబిందువు చుట్టూ పరిభ్రమించేట్టు చేయడం.

మరి మేఘసందేశంలో ప్రకృతి వర్ణనల గూర్చి వ్రాస్తూ వర్తిపట్టిక ఇవ్వడంతోనో, ప్రకృతివర్ణనారామణీయక ప్రశంసలతోనో తృప్తిపడక యక్షుడు వర్షరువులో ఆషాఢమేఘంతోనే ప్రణయసందేశం పంపవలసిన అవసరం ఏముందని వితర్కించుకోవడం మౌలికచింతనా లక్షణం. అందుకు సమాధానంగా వర్షారంభంలో చేతనాచేతన రూపమైన ప్రకృతి స్త్రీపుంసయోగరూపమైన మహాచైతన్యాన్ని భజిస్తూ ఉంటుందని వ్యాఖ్యానించి, యక్షుని విరహార్తిని వెల్లడించడానికి, సంయోగకాంక్షా దీప్తిని ప్రకటించడానికి వర్షామేఘం సిస్తులవస్తువుగా ఉపకరించిందని ప్రతిపాదించడం ఔచితీగర్భితంగా ఉంది.

మరి కలభాషిణీ కథామూలాన్ని త్రవ్వి చూపడంలోనూ ఈ మౌలికప్రయత్నమే కనిపిస్తుంది.

డా॥ సుబ్రహ్మణ్యం వివేచన ఉన్న భావుకుడు, రసజ్ఞత ఉన్న నిశితవిమర్శకుడు. విద్యావినయాలు సమప్రమాణంలో సంతరించుకున్న యువకుడు. ఉపరిశోధనలకంటె పరిశోధనలపట్ల ఆసక్తి ఉన్న సాధకుడు. సాహితీ విమర్శనా రంగంలో ఇతడెక్కిన తొలిమెట్టు 'వీరరసం'. మలిమెట్టు 'సారస్వత సౌరభం'. మలిమెట్టుతోనే దిదృక్షువులకు మిరుమిట్లు గొల్పిన ఈ సాధకునికీ, పరిశోధకునికీ నా అభినందనలు.

హైద్రాబాదు
26–1–70

సి. నారాయణ రెడ్డి

# మున్నుడి

నేను కొన్నేండ్లుగా చేయుచున్న సాహిత్యార్చనకు ఫల మీ సారస్వత సౌరభము. అమృతపూర మైన ఆంధ్రసాహిత్య కాసారమున నిండుగావిరిసిన కావ్యారవిందములనుండి గ్రహించి నామనఃపేటికలో భద్రపఱచుకొనిన సుమనః పరిమళమీ వ్యాస సంపుటి. దీని 'నాంధ్రావళి మోదముం బొరయు' నట్లుగ నందింపఁ గలుగుచున్నందులకు నే నెంతయో ఆనందపడుచున్నాను.

నాకు చిన్ననాటనే సాహిత్యాభిరుచి యలవడినది. దానికి మాపెద్దలు కారకులు. నన్ను తనప్రక్కలో పరుండఁబెట్టుకొని యైదేండ్లప్రాయమునందే అమరశ్లోకములతోపాటు, ఆంధ్రమహాభారత భాగవతములందలి హృద్యపద్యములను నోటఁబట్టించిన మాపితృదేవుల అవ్యాజవాత్సల్యము నా చిత్తక్షేత్రమున సాహిత్యబీజముల నిక్షేపించినది. మాచిన్నన్నగారి మధురకావ్యగాననైపుణ్యము నాలో సాహిత్యముపై ననురాగము పెంచినది. మాపెద్దన్నగారి యపారసాహిత్యలక్షణ పరిజ్ఞానము నాసాహిత్యవ్యాసంగమునకు శాస్త్రీయమైన దృక్పథమును ప్రసాదించినది. నాపదునేనవయేట నాచేత ఆంధ్రమహాభారతము నామూలాగ్రముగా చదివించుకొని విన్న నాపెద్దలు నాచిత్తమున సారస్వత సంస్కారమును సంపన్నము చేసి పోషించిరి.

నాకు ఉన్నతవిద్యాబోధనమందు హిమనగోన్నతులైన ఆచార్యులు నాపుణ్యవిశేషమున లభించిరి. వారు లక్ష్మీరంజనులు; వాఙ్మయ దివాకరులు. వారు సాహిత్యకుసుమసంగ్రథనకళానైపుణ్యమును నాకు బోధించిరి; అధ్యాపకవృత్తిలో సాహిత్యారాధనము చేయుమని నిర్దేశించి నాసాహిత్య నౌకకు కర్ణధారులై నేటికిని నడపించుచున్నారు. నాజీవితమున కలిగిన మఱియొక అదృష్టము పండితప్రకాండుల శుశ్రూష; సుహృన్మూర్తులైన సాహిత్యవేత్తల సాహచర్యము. విద్వన్మణియైన డా. పాటిబండ మాధవశర్మగారి స్నేహము నాకొక అభినవభారతీ సాక్షాత్కారము కల్పించినది. సాహిత్యసౌరభ సమాఘ్రాణశిల్ప మాయనయొద్ద నేను నేర్చితిని. విశ్వనాథవారి విమర్శన వివేకము, రాళ్ళపల్లివారి సారస్వతాలోకము, పింగళివారి పలుకుల పొందిక, కట్టమంచివారి కవిత్వతత్త్వ విమర్శనము, వేదమువారి సాహిత్య దర్పణాలోకము, వజ్ఝలవారి వ్యాకరణ సంహితాసర్వస్వ స్వరూపము నా ఏకలవ్యభక్తికి

నిధానము లైనవి. మీదు మిక్కిలి సహృదయతామూర్తు లైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి ప్రోత్సాహము నాకీయుద్యమమున జవసత్త్వములను కల్పించినది. వీనికితోడు మిత్రమండలులు, రచయితల సంఘములు, సాహిత్యసదస్సులు, కవిసమాజములు నాలో సజీవసాహిత్య విమర్శను రూపుకట్టించినవి. ఇందరి స్నేహ వాత్సల్యములతో సాహిత్యక్షేత్రమున కాలూని నిలిచినవాఁడను నేను. విద్యార్థులకు నానేర్చినంత సాహిత్యమర్మమును విప్పి చెప్పుచున్నాను; విద్వాంసులకు నేనేర్చినంత సారస్వత సౌరభము నుపాయనముగా నందించుచున్నాను.

క్రొత్త దేదైన చెప్పవలె నన్నప్పుడే కలముపట్టు అలవాటు నాకు. సాహిత్య సమాధిలో మనసున మెఱసిన నవ్యదివ్యానుభూతిని సహృదయుల ముందు సవినయముగా నుంచు ప్రయత్నమే నారచనావ్యాసంగము. ఈ వ్యాసము లట్టి ప్రయత్న ఫలములే. ఇందులో ప్రతివ్యాసము నందును ఒక్కొక నవ్యాంశమును ప్రతిపాదింప గలిగితి నని తలంచుచున్నాను. వాని యోగ్యతలు నిర్ణయించుభారము సహృదయ లోకముపై నున్నది. అట్టి సహృదయ లోకమునకు నా హృదయపూర్వకాభివందనములు.

ఈ గ్రంథ మీరూపమున ప్రచురింపఁబడుటకు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు చేసిన వేయిరూప్యముల ధనసహాయము ప్రధానకారణము. కావున అకాడమీ వారికి నా కృతజ్ఞతలు.

ఈగ్రంథము నంకితము గొని, బంగారమునకు తావియబ్బిన గౌరవమును నాకృతికి కల్పించిన సారస్వతాభిమానులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి నా హృదయపూర్వక మైన కృతజ్ఞాభివందనములు.

సౌరభమునకు మలయానిల సాహచర్య మబ్బింపఁ జేసినట్లు నావ్యాస సంపుటికి 'ఆయోదవీచి' నందించిన ఆర్ద్రహృదయులు సాహిత్యశిల్పవేత్తలు–డా. పాటిబండ మాధవశర్మగారికి నా నమోవాకములు.

నావాక్కుల కమృతాశీశ్శు లందించిన మరుదాచార్యతుల్యులు ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారికిని, వాఙ్మయ వార్నిధులు ఆచార్య డా. దివాకర్ల వేంకటావధానిగారికిని, సాహిత్యవేత్తలు డా. పల్లా దుర్గయ్యగారికిని, నవ్యకవితా మన్మథులు డా. సి. నారాయణరెడ్డి గారికిని నాకృతజ్ఞతాభివందనములు.

ఈ వ్యాసములోఁ గొన్నింటి నిదివరకే ప్రచురించి ప్రచారమునకు దెచ్చిన ఆంధ్రప్రభ (సారస్వతానుబంధము), స్రవంతి పత్రికల యధిపతులకును, ఈ వ్యాసములందు ప్రతిపాదింపఁబడిన భౌతికశాస్త్ర విషయలు శాస్త్రవిరుద్ధములుగా లేవని చెప్పి నన్ను ప్రోత్సహించిన మిత్రులు శ్రీ అయలావజ్ఝల సత్యనారాయణమూర్తి గారికిని నా కృతజ్ఞతలు. జీవితవ్యాసమును తీర్చి దిద్దుటతోపాటు వ్యాసముల శుద్ధ ప్రతులను సిద్ధముచేయుటలో సాయపడిన శ్రీమతి చి॥ సుశీలకు నా ఆశీస్సులు. ఈ గ్రంథమును ముచ్చటగా ముద్రించి యిచ్చిన శివాజీ ప్రెస్ అధిపతులకును నాకృతజ్ఞతలు. ఎంత శ్రద్ధగా చూచినను ముద్రణమున కొన్ని దొసగులు దొరలుట తప్పలేదు. విజ్ఞులా దోసములు సవరించుకొని సహృదయభావముతో ఈ సారస్వత సౌరభమును సమాఘ్రాణింప ప్రార్థన!

సౌమ్య : భీష్మైకాదశి<br>
ఫిబ్రవరి 16, 1970

గ్రంథకర్త

—x—

# విషయసూచిక

# పురాణము - ఇతిహాసము

భారతీయులకు వేదములు పరమప్రమాణగ్రంథములు. వేదధర్మములు జనులకు సులభగ్రాహ్యము లగుటకై మహర్షులచేఁ దదర్థపర్యాలోచనరూపములుగా నిర్మింపఁ బడిన ధర్మసంహితలు స్మృతులు. శ్రుతిస్మృతులలోని ధర్మములను విపులీకరించి దృష్టాంతరూపము లగు వివిధేతిహాసకథాకదంబముల ద్వారమున పామరపండిత మనోరంజకముగ బోధించు గ్రంథములు పురాణేతిహాసములు. శ్రుతిస్మృతులు ప్రభుసమ్మితము లయి ధర్మప్రబోధమును నిర్వహించుచుండ, పురాణేతిహాసములు మిత్రసమ్మితము లై లోకమునకు హితము నుపదేశించుచున్నవి.

వాజసనేయీ బ్రాహ్మణోపనిషత్తు వేదములును, ఇతిహాసపురాణములును పరమేశ్వర నిశ్వాసరూపములని యభివర్ణించెను :

"అస్య మహతో భూతస్య నిశ్శ్వసిత మేతద్య దృగ్వేదో
యజుర్వేద స్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణమ్".

మానవునకు శ్వాసనిశ్వాసలు ప్రాణసంకేతము లైనట్లే భగవంతునకుఁ బ్రాణస్థానములు వేదపురాణేతిహాసము లని యుపనిషత్తాత్పర్యము. అనఁగా జీవునకు శ్వాసముతో యావద్ద్రవ్యభావిత్వ మున్నట్లే భగవంతునకు వేదపురాణములతో యావద్ద్రవ్యభావిత్వ సంబంధము గలదని భావము. దీనివలన నుపనిషత్తులు వేదార్థముల కిచ్చిన యున్నతస్థానమును, ప్రామాణ్యగౌరవమును బురాణేతిహాసముల కిచ్చి గౌరవించినట్లు తెలియుచున్నది. ఛాందోగ్యోపనిషత్తు ఇతిహాసపురాణము పంచమవేద మని చాటి చెప్పుచున్నది :

సహోవాచ "ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణమ్
చతుర్థ మితిహాసపురాణం పంచమం వేదానాం వేద మితి".

పంచమవేదము చతుర్వేదసారము. మహాభారత మాహాత్మ్యమును "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" త్తని నిపుణముముగాఁ బేర్కొనినది. కావున నితిహాసపురాణముల వలననే వేదము లెన్నఁగా బలపడుచున్నది. పురాణేతి

హాస విజ్ఞానమువలన వేదార్థము ప్రసన్న మగును. అనఁగా పంచమవేదము లైన పురాణేతిహాసములు వేదహృదయము విప్పిచెప్పు విశిష్టగ్రంథములు.

పురాణేతిహాసముల కత్యంతసాన్నిహిత్యము కలదు. వేదకాలము నుండియు నట్టి సంబంధము వానియందుఁ గానవచ్చుచున్నది. వేదబ్రాహ్మణములందు పురాణేతిహాసములు విడివిడిగాఁ బేర్కొనఁబడియున్నను శతపథబ్రాహ్మణాదులలో 'నితిహాసపురాణ' మను నేకపదద్వంద్వసమాసములు ప్రయోగింపఁ బడియున్నవి. సామాన్యముగా నట్టి ద్వంద్వసమాస మవినాభావసంబంధముగాని, యాజన్మవిరోధము గాని కల రెండువస్తువులను గలిపి చెప్పునపుడు వాడఁబడుచుండును గావున పురాణేతిహాసముల నవినాభావసంబంధము గల ద్వంద్వముగా నట్టిసమాసప్రయోగము సూచించుచున్నది.

పురాణేతిహాసముల స్పష్టమైనపరిగణన మథర్వవేదమునఁ దెలియవచ్చుచున్నది. వానితోపాటు గాథలు, నారాశంసలు, వాకోవాక్యములు,- అనువానిని గూడ నావేదము తెలుపుచున్నది. విద్యారణ్యసాయణాచార్యులు తమభాష్యములందుఁ బైవాని స్వరూపస్వభావములను గూర్చి పేర్కొనియున్నారు. "దేవాసురాస్సంయత్తా ఆసన్" అని యిట్లు పూర్వము జరిగినదట యనునట్లు పూర్వప్రసిద్ధ వృత్తములను దెలుపునది యితిహాస మనియు, "ఇదంవా అగ్రే నైవ కించి దాసీత్"- ఇట్లు జగత్ప్రాగవస్థ నుపక్రమించి చెప్పెడి సర్గప్రతిపాదకమైన వాక్యజాతము పురాణ మనియు, విద్యారణ్యులు. సాయణాచార్యులు గాథాదుల నిట్లు నిర్వచించెను: "మహోహి మివ వై ప్రహదాత్" ఇత్యాదయో మన్త్రాః గాథాః । 'నరాః మనుష్యాః తత్ప్రశంసాపాదకాః శ్లోకాః నారాశంస్యః గాథాః' । 'సమానా సద ముక్షన్తి' ఇత్యాదికాః మనుష్య ప్రశంసాపరాః నారాశంసాః' । 'సవై గౌతమస్య పుత్రవృతో జనం ధావయేత్' ఇతి ఉక్తిప్రత్యుక్తిరూపమ్ బ్రాహ్మణం (ప్రకరణం) వాకోవాక్యమ్".

పై వ్యాఖ్యాత లితిహాసాదులను వివేచించునపుడు వేదవాక్యములనే దృష్టాంతములుగా నిచ్చియుండుట గమనింపఁ దగిన యంశము. అనఁగా వేదవాక్యముల లోనే జగత్ప్రాగవస్థనుగూర్చి చెప్పెడి వాక్యములు పురాణము లనియు, దేవదానవ యుద్ధాది ప్రసిద్ధ విషయములను జెప్పు వాక్యసముదాయము లితిహాసము లనియు, దైవప్రశంసాత్మకము లైన మంత్రవాక్యములు గాథ లనియు, నరప్రశంసారూపము లైన వాక్యములు నారాశంస లనియు, ఉక్తి ప్రత్యుక్తిరూపము లైనవి

వాకోవాక్యము లనియు, స్పష్టమగుచున్నది. దీనినిబట్టి వేదవాక్యములందే పురాణేతిహాస స్వరూపకల్పన మొనర్పఁబడిన దని భావింప వచ్చును; మఱియు సర్గప్రతిసర్గలక్షణవిశిష్ట మైనది పురాణ మనియు, దేవదానవవంశములకు సంబంధించిన కథన మితిహాస మనియు నథర్వవేదకాలమున భావింపఁబడుచుండె ననియు గ్రహింపవచ్చును.

నైఘంటికు లొనర్చిన పురాణశబ్దనిరుక్తు లిట్లున్నవి: "పురా భవ తీతి పురాణః"; "పురా పూర్వస్మిన్ భూత మితి పురాణమ్": "పురా భవమితి పురాణమ్"; "పురా నీయతే ఇతి పురాణమ్"; "పురా నవం భవతి పురాణమ్": "పురా + అనక్తి"; మొదలగునవి. ఇట్టి నైఘంటికనిరుక్తుల కాలంబనములు పురాణములందుఁ గలవు.

"యస్మా త్పురా హ్యనక్తీదం పురాణం తేన హి స్మృతమ్
నిరుక్త మస్య యోవేద సర్వపాపైః ప్రముచ్యతే॥"

— వాయుపురాణము

"పురా పరంపరాం వష్టి పురాణం తేనవై స్మృతమ్॥"

— పద్మపురాణము

"యస్మా త్పురా హ్యభూ చ్చైతత్పురాణం తేన తత్స్మృతమ్॥"

— బ్రహ్మాండపురాణము

"పురాతనస్య కల్పస్య పురాణాని విదు ర్బుధాః॥"

— మత్స్యపురాణము

వీనినిబట్టి పురాణము లనఁ జిరకాలమునఁ బుట్టిన వనియుఁ, బ్రాచీన విషయము లను దమయందుఁ బొందించుకొనిన వనియుఁ, బ్రాచీనకాలమున నవీనములుగా నుండిన వనియు, పురావిషయములందు జీవించెడి వనియుఁ, బ్రాక్తనవిషయాభిరతి కలిగిన వనియుఁ, బురాతన కల్పవస్తుకము లనియు నేర్పడుచున్నది.

ఇవి యన్నియు నిట్లుండ "పురాపి నవమ్ పురాణమ్" అను నిరుక్తి యొకటి ప్రసిద్ధి గాంచినది. దీనినిబట్టి పురాణములం దభివర్ణింపఁబడు వస్తువిశేషములు పురాతనము లయ్యును నవ్యములుగను, నిత్యనూతనములుగను భాసించుచుండు నని తాత్పర్య మేర్పడుచున్నది. పురాణములందలి యీ నవ్యతయే వాని

కుత్తమసాహిత్యగౌరవము నాపాదించుచున్నది. పురాణములందలి వస్తువులు పురాతనము లయ్యు నవి రచింపఁబడికాలమునుబట్టి యర్వాచీనములుగాఁ బొడగట్టు చున్నవి కావున నవ్యము లనఁబడుచున్న వని యీ నిరుక్తిని కొంద ఱన్వయిం చిరి. అయినను పురాణ మన నతిప్రాచీన మైన దనెడి పూర్వనిరుక్తుల తాత్పర్య మున కెట్టి విప్రతిపత్తియు నేర్పడుటలేదు. కాని, పురాణములు ప్రప్రథమమున పురాణగాథా స్వరూపములై యుండినను క్రమముగా వానియం దర్వాచీనము లైన వస్తువిశేషము లెన్నియో చేరుచు వచ్చిన వని యీ నిరుక్తి స్పష్టము చేయు చున్నది.

పురాణవస్తులక్షణములను బరిశీలించి తత్స్వరూపనిర్వచనము చేయయత్నించిన ప్రాచీనులు పెక్కురు గలరు. వారందఱిలో నమరసింహుఁడు "పురాణం పఞ్చలక్షణ''మ్మని చెప్పిన నిర్వచనము కడు ప్రసిద్ధి కెక్కి యున్నది.

''సర్గ శ్చ ప్రతిసర్గ శ్చ వంశో మన్వన్తరాణి చ
వంశానుచరితం చేతి లక్షణానాం తు పఞ్చకమ్''

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము లను బంచ లక్షణములు గలవి పురాణము లని యమరకోశము. వంశానుచరితస్థానమున 'భూమ్యాదేః సంస్థాన'మ్మను పాఠాంతర మొండు కనఁబడుచున్నది. ఈ పంచ లక్షణ నిర్వచనమును మార్కండేయాగ్ని వాయు విష్ణు కూర్మ మత్స్యాది పురాణ ములు కూడ పేర్కొని యుండుటయే కాక, తల్లక్షణములను దమయందు యథావ కాశముగా సంతరించుకొని యుంచినవి. కావున ప్రాచీను లీ పంచలక్షణసూత్రము నతిప్రామాణ్యబుద్ధితో గ్రహించి యుండి రని భావింప వీలగుచున్నది.

ఈసూత్ర మంతప్రాచుర్య మందుట కాపంచలక్షణముల పరమసార్థక్యమే కారణము. పురాణము సర్గముతో నారంభింపఁబడు నని పైసూత్రనిర్దేశము. సర్గము నందు బ్రహ్మాండోత్పత్తి చెప్పఁబడును; విద్యారణ్యు లన్నట్లు జగత్ప్రాగవస్థకంటెఁ బ్రాచీనమైనవస్తువు సృష్టియందుఁ గానరాదు. పురాణ మచ్చటినుండి ప్రారంభ మగుటకంటె నౌచిత్యము మఱొండు లేదు. ఆపైన 'ప్రతిసర్గము'నందు బ్రహ్మదు లొనరించిన సృష్టివిధానము వివరింపఁబడి యుండును. అందు స్థావరజంగమాత్మక మైన సృష్టివైవిధ్యము విపులముగా వర్ణిత మగును. వంశములందు దేవాసురాది విభేదోత్పత్తియు, బ్రహ్మర్షి దేవర్షి వంశకర్తల చరిత్రములును వర్ణింపఁబడును.

కావున సృష్టింపఁబడిన జీవరాసులలో నేర్పడిన క్రమబద్ధమైన వికాస మిం దభి
వర్ణింపఁబడును. మన్వంతరములందు ధర్మశాస్త్రప్రవర్తకులై భువిని శాసించెడు
పదునలుగురు మనువుల యుత్పత్తియు, వారి పరిపాలన కాలములందలి విశేషము
లును, వర్ణింపఁబడును. అనఁగా నీ యంశమునందు వేదధర్మమును లోకమున
నాచరింపఁజేయుట కేర్పడిన విశిష్ట సంస్థలవంటి మహావ్యక్తులను గూర్చిన కథలు
కీర్తింపఁబడు ననుట. వంశానుచరితమున దేవమూలము లైన సూర్యచంద్రవంశ
ములందు జన్మించి, ధర్మవీరు లయి ప్రసిద్ధి కెక్కిన మహారాజులచరిత్రములు
వివరింపఁబడును. సర్గప్రతిసర్గ వంశములలో సృష్ట్యారంభమును, వేదోత్పత్తియు,
దేవదానవాదుల యుత్పత్తివికాసములును వర్ణింపఁబడఁగా మన్వంతరవంశానుచరితము
లందు మానవజాతివ్యవస్థయుఁ, దత్పరిపాలనమును, దత్ప్రభువుల విధానమును
దెలుపఁబడుచున్నవి. కావున వేదాదిధర్మములు దేవమానవసంఘములం దనుష్ఠితము
లగుక్రమ మీపంచలక్షణములందు నిర్దేశింపఁబడిన దనవచ్చును. మఱియొకమాటలోఁ
జెప్పవలెనన్న నీ పంచలక్షణ సూత్రమునఁ బ్రపంచోత్పత్తి వికాసక్రమము భాసించు
చున్నది. తద్వికాసమును బరమార్థానుసంధానదృష్టితో మిత్రసమ్మితముగాఁ
బ్రపంచించెడి సారస్వతమూర్తులు పురాణములు !

ఇట్లే యితిహాసస్వరూపమును భావించుటకు నైఘంటిక నిరుక్తులు కొంత
తోడుపడఁగలవు. "ఇతిహాసం పురావృత్త" మ్మని యమరసింహుఁడు. ' ఇతిహాసః –
ఇతిహ పారంపర్యోపదేశ అస్తి అస్మిన్ ఆస ఆధారే ఘఞ్. ధర్మార్థకామ
మోక్షాణాం ఉపదేశసమన్వితమ్ । పూర్వముక్తకథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే॥
ఇత్యుక్తలక్షణే పురావృత్తప్రకాశకే భారతాదిగ్రంథే"—అని శబ్దకల్పద్రుమము.
వీనినిబట్టి యితిహాస మన పూర్వవృత్త మని స్థూలముగాఁ జెప్పవచ్చును. అది
యిట్లు జరిగిన దని పారంపర్యముగాఁ జెప్పుకొనుచున్నకథయై యుండవలెను.
అనఁగా నది చారిత్రకసత్యమై యుండవలెను. ఆకథ వట్టివార్తగా, నుదంతముగా
నుండరాదు. చతుర్వర్గోపదేశసమన్వితమైన యుజ్జ్వలకథారూపమున నుండవలెను.
కావున నితిహాసము పూర్వచరిత్రనిబంధనప్రాయ మై, నుజ్జ్వలోపదేశాత్మక మైన
కథయై యుండవలె నని యేర్పడుచున్నది.

అభినవగుప్తుఁడు నాట్యశాస్త్రవ్యాఖ్యానమునఁ గర్మఫలసంబంధస్వభావము
లైన యాగమికార్థము లెందుఁ బ్రత్యక్షపరిదృశ్యమానము లగుచుండునో యది

యితిహాస మని పేర్కొనెను.[1] అనఁగా నాగమములం దాయాపుణ్యపాపకర్మాదుల కాయాఫలములు లభించు నని చెప్పఁబడిన వాక్యతాత్పర్యములు ప్రత్యక్షపరిదృశ్యమానము లగునట్లు ఇతిహాసమందలి యితివృత్త ముండవలె నని నిర్దేశింపఁబడిన దనవచ్చును.

పై నైఘంటికోక్తులను బరామర్శించినచోఁ బురాణములకును, ఇతిహాసములకును గొట్టవచ్చినట్లు కానవచ్చెడి సామ్యము పురావస్తుసంబంధము. కాని, తత్సామ్యమునందును బురాణేతిహాసములకు భేదనిరూపణము చేసి చూపించినారు విద్యారణ్యులు. జగత్ప్రాగవస్థనుండి యారంభ మగునది పురాణ మనియు, దేవాసురుల గాథలు చెప్పునది యితిహాస మనియుఁ జెప్పుటలోనే యాభేదము కలదు. అనఁగాఁ బురాణ మత్యంతప్రాచీన మగు వృత్తమును జెప్పుచుండ నితిహాస మిది యిట్లని చూచి చెప్పినవారినుండి పరంపరగాఁ జెప్పఁబడుచు వచ్చెడి పురాతన చారిత్రక వృత్తమును జెప్పునని తాత్పర్యము.

సంస్కృతభాషలో భూతకాలికక్రియలకు లఙ్, లుఙ్, లిట్ అను త్రివిధ లకారములు చేర్చి అనాద్యతనాద్యతనానంతభూతకాలికార్థములను దెలుపుచుండుట కలదు. అనఁగా భూతమును బ్రాచీనులు ముత్త్రిధముగా భావించి రని స్పష్టపడుచున్నది. అమరసింహుఁడు పురాశబ్దమునకు చిరాతీతనికటాగామికార్థములు కల వని పేర్కొనుటయు దీని కుపబలకముగా నున్నది. ఇట్టి విభాగమునం దౌచిత్యమును గలదు. లౌకికానుభవదృష్టితో వివేకించినపు డిది తెలియఁబడును. మనకుఁ బ్రస్తుతము వర్తమానము. అది ప్రత్యక్షము. కొలదికాలము గడచినతరువాత నావిషయము వార్త యనఁబడును. మఱికొంతకాలము గడచుసరికి అది పరంపరాకథనరూపమున వెలసి చారిత్రకవృత్త మనఁబడును. అదియే చిరకాలమైన తరు

---

1. నాట్యశాస్త్ర, 1. 15 శ్లో. లోని "సేతిహాసమ్" అనుపదమున కొనర్చిన వ్యాఖ్యానము :

"ఇతిః = ఏవ మర్థే ప్రత్యక్షనిర్దేశం ద్యోతయతి । హః = ఇహ శబ్ద ఆగమః । ఆసః = ఆసనం. ఏవం ప్రకారాః ప్రత్యక్షపరిదృశ్యమానాః ఆగమికార్థాః కర్మఫలసంబంధస్వభావాః యత్ర ఆసతే తేన ఇతిహాసేన – సహేతి పాఠే మత్వర్థీయో అకారః । ఇతి జ్ఞానమ్ తస్యహాసో హర్షపూర్వకో వికాసో యతః ఇతి కేచిత్— ఇతిహాస శ్చ - తల్లక్షణం ఇద్ధం కిల ఆసనం యత్ర రూపకభేదానాం భణ్యతే (దృశ్యతే)॥."

వాతఁ జెప్పఁబడినచో దాని చారిత్రకత్వముకంటె పురాతనత్వమే యధికముగా భాసించి పురావృత్త మనఁబడును. దీనిని జగత్కథ కన్వయించుచో సర్గాది పురాలక్షణవిశిష్ట మైన వస్తువు నేఁడు పురాణవస్తు వనుటలో విప్రతిపత్తి లేదు. ప్రాచీన ప్రసిద్ధరాజచరిత్రము లితిహాసము లని గ్రహించుటలో నెట్టిసంకోచమును లేదు. అమరసింహుని మాటలలోఁ జెప్పిన- చిరభూతార్థము పురాణము, అతీతభూతార్థము ఇతిహాసము. ఈసత్యమును గుర్తించి భోజుఁడు "అతీతార్థప్రాధాన్యా దితిహాసః"[1] అని నిర్దేశించినాఁడు.

చతుర్విధపురుషార్థప్రబోధము నితిహాసములవలెనే పురాణములుకూడ నిర్వహించుచున్నవి. కాని, పురాణము లాయర్థములను ద్రివిధభాషలలో[2] యథానుకూలముగాఁ జెప్పవచ్చును. ఇతిహాసములు తదర్థబోధ నైతిహాసికకథాముఖమున నిర్వహింపవలసియుండును. ఈభావమునే మఱియొకవిధముగాఁ జెప్పినచోఁ గర్మఫల రూపము లయిన యాగమికార్థములు ప్రత్యక్షపరిదృశ్యమానము లగునట్లు చెప్పవలె నను నియమము పురాణములం దానుషంగికముగను, ఇతిహాసములం దవశ్యముగను పాటింపఁబడు నని భావము. ఇతిహాసమునఁ జతుర్వర్గసాధకు లైన ప్రసిద్ధపురుషుల జీవితవృత్తములు వర్ణింపఁబడును. అందు వారు తమలక్ష్యసిద్ధికై యొనర్చు ప్రయత్నాదులఁగూర్చియుఁ, దత్ఫలసిద్ధినిగూర్చియు వివరముగా వర్ణింపఁబడును. వారి జీవితవృత్తములు కర్మఫలరూపములైన యాగమికార్థములకు దృష్టాంతరూపములుగా నుండును. ఇట్టికథార్థములచే వ్యంజిత మగునది చతుర్విధపురుషార్థప్రబోధము. పురాణమున నిట్టిప్రబోధము చారిత్రకసత్యమైన మహాపురుషజీవితకథావర్ణనముఖము

---

1. సరస్వతీకంఠాభరణము 2-368 శ్లో.వ.

2. సమాధిభాష-లౌకికభాష-పరకీయభాష-యనునవి త్రివిధభాషలు. సమాధిగమ్యములును, అతిగంభీరములు నైన వేదార్థములను సూత్రప్రాయమైన భాషలోఁ జెప్పుట సమాధిభాష. అతిసూక్ష్మము లైన వేదతత్త్వములను సర్వజనసుబోధము లగునట్లు లౌకికభావముల తోడ్పాటుతో సార్థకాలంకారబంధురముగాఁ జెప్పుట లౌకికభాష. వేదార్థములను దృష్టాంతరూపము లైన కథేతిహాసముల ద్వారమున బోధించుట పరకీయభాష. సమాధిభాషను లౌకికభాష సరళము చేయును; సమాధిభాషలోఁ జెప్పఁబడిన ధర్మమును బరకీయభాష దృఢీకరించును. విష్ణుపురాణప్రథమాధ్యాయము నందలి సృష్టివర్ణనము సమాధిభాష. అదేతత్త్వము దేవీభాగవతశ్రీభాగవతములందు లౌకికభాషలోఁ జెప్పఁబడినది. వేదసమ్మతమైన సత్యధర్మమహిమను స్థాపించుటకై హరిశ్చంద్రోపాఖ్యానాదులు చెప్పుట పరకీయభాష.

ననే నిర్వహింపవలసిన యవసరము లేదు. కల్పితకథలద్వారమునగాని, ప్రతీకాత్మకగాథలవలన గాని, సమాధిలౌకికభాషలద్వారమున గాని ప్రబోధింపవచ్చును. కావున పురాణేతిహాసములు చతుర్వర్గప్రబోధైకదృష్టి కలవయ్యు భిన్నమార్గముల ననుసరించుచున్న వనవచ్చును.

క్రీ.పూ. 4వ శతాబ్దిప్రాంతమున వెలసిన కౌటిల్యుని యర్థశాస్త్రమున నితిహాసస్వరూపము తెలుపఁబడియున్నది. రాజుయొక్క దినచర్యను నిర్దేశించి చెప్పుచుఁ గౌటిల్యుఁడు-ప్రభువు పూర్వాహర్భాగమున హస్త్యశ్వప్రహరణ విద్యాభ్యాసమును, పశ్చిమాహర్భాగమున నితిహాసశ్రవణమును జేయవలె నని నిర్దేశించి, "పురాణ మితివృత్త మాఖ్యాయికోదాహరణం ధర్మశాస్త్రమర్థశాస్త్రం చేతిహాసః"[1]– అని యితిహాసస్వరూపమును బేర్కొనెను. ఈమాటలవలన నితిహాసమునందు కొంతపురాణము ప్రవర్తిల్లు ననియుఁ, గార్యకారణసంబద్ధమైన ప్రఖ్యాతవృత్తము నిబంధింపఁబడియుండు ననియు, నాయకనాయకేతరులచేఁ జెప్పఁబడు కొన్ని యాఖ్యాయికలును, దృష్టాంతరూపములైన కొన్నిగాథలును, ధర్మార్థశాస్త్రవిషయములును సంతరింపఁబడియుండు ననియు స్పష్టమగుచున్నది. ఈలక్షణము లన్నియు మహాభారతమున కన్వయించుచున్నవి. భారతారంభమున సర్గాదిలక్షణయుక్తమైన వస్తువు కలదు. దేవదానవవిభేదకథనము కలదు. తదంశలచే సంభూతులైన రాజులును, వారి వంశములును బేర్కొనఁబడినవి. చంద్రవంశప్రసిద్ధచక్రవర్తులచరిత్రములు కీర్తింపఁబడినవి. అందును పాండవకౌరవులవృత్తాంత మాధికారికవస్తువుగా విస్తరింపఁబడినది. వాసుదేవమాహాత్మ్య మాకథయందు వర్ణింపఁబడినది. ప్రసక్తానుపశమున బహువిధోపాఖ్యానములును, ధర్మార్థనీతిమోక్షశాస్త్రాదివిషయములు- నందు పొందుపఱుపఁబడి యున్నవి. మహాభారతము మోక్షశాస్త్ర మనియు, ధర్మశాస్త్ర మనియు, నర్థశాస్త్ర మనియు, నీతిశాస్త్ర మనియు, నితిహాస మనియు, పురాణ మనియు, మహాకావ్య మనియుఁ గీర్తింపఁబడుచున్నది. ఈయంశములను గ్రోడీకరించి చూచినచో గౌటిల్యుఁడు వాచ్యముగాఁ జెప్పకపోయినను మహాభారతము నుపలక్షించియే యితిహాసస్వరూపము నట్లు నిరూపించెనని భావింప వలనుపడుచున్నది.

రాజశేఖరుఁడు పురాణము శాస్త్ర మనియు, నందు వేదములలోఁ జెప్పఁబడిన యాఖ్యానము లుపనిబద్ధములై యుండు ననియు, నది పంచలక్షణ సమంచిత

1. అర్థశాస్త్రము I. 5. పుట 10.

మనియుఁ దెలిపి, పురాణములలోని యొకవిధమైనభేదమే యితిహాసమని పేర్కొ-నెను. అట్టి యితిహాసగతి పరిక్రియాపురాకల్పభేదముచే ద్వివిధ మనియు, నందు పరిక్రియ యేకనాయక మనియు, పురాకల్పము బహునాయక మనియు నిర్దేశించెను.[1] వానికిఁ గ్రమముగా రామాయణమహాభారతము లుదాహరణములుగా నిచ్చెను. ఇందు రాజశేఖరుఁడు ఇతిహాసము పురాణాంతర్గత మైన దని భావించుట గమనింపఁదగినది. సృష్ట్యాదినుండి కలియుగరాజ వంశములవఱకు వ్యాపించియున్న మానవజాతియొక్క సమగ్రచరిత్రమును బురాణవాఙ్మయము సమీక్షించుచున్న ట్లగుచున్నదికదా! అప్పుడు అతీతప్రధాన మగు నితిహాసము పురాణాంతర్భాగమే-వంశవంశానుచరితాంతర్గతమే- యగుచున్నదికదా! కావున నితిహాసము పురాణైకదేశ మని భావించుటలో నెట్టి విప్రతిపత్తియును లేదు. ఇఁక రామాయణమహాభారతము లందు పలభాక్కు లగు నాయకులు వరుసగా రాముఁడును, పంచపాండవులును నగుటచే వానిని రాజశేఖరుఁడు పరిక్రియాపురాకల్పము లని భావించియుండును. రాజశేఖరుఁ డీశబ్దములను దార్శనికుల పరిభాషనుండి గ్రహించినట్లున్నాఁడు. దార్శనికులు పరిక్రియాపురాకల్పము లనునవి యర్థవాదములుగాఁ బేర్కొనియుండిరి. అర్థవాదములు వస్తుతః నిందా - ప్రశంసా - పరకృతి - పురాకల్ప భేదముచే నాలుగువిధములు. మహాపురుషుఁ డొకఁడు పూర్వ మొనర్చిన యొకయంశమును బ్రమాణముగాఁ జూపించుట పరకృతి యనఁబడును. "అగ్ని యనువాఁడు సర్వభక్షకుఁడు కాఁగోరి అగ్ని నారాధించెను. సర్వభక్షకుఁ డయ్యెను"[2] అను పూర్వప్రవృత్తైతిహ్యమును బ్రమాణగాఁ జూపించుట పరకృతి. పూర్వ మొకనిచేఁ జెప్పఁబడిన యర్థమును బ్రతిపాదించునది పురాకల్పము. పూర్వ మగ్ని హోమములు మోయ నిష్టములేక నీటిలో దాగెను. దేవత లగ్ని నన్వేషించుచుండిరి. చేప లగ్ని నీటియందు దాగియుండె నని చెప్పినవి. అగ్ని తనరహస్యమును బయలు పఱచినందుల కాగ్రహించి చేపలను- 'లోకులు మిమ్ముల నిష్టమువచ్చిన ట్లెల్లఁ

---

1. "పరిక్రియా పురాకల్ప ఇతిహాసగతి ర్ద్విధా
స్యా దేకనాయకా పూర్వా, ద్వితీయా బహునాయకా".

కావ్యమీమాంస. 2 అధ్యా.

2. తైత్తిరీయ బ్రాహ్మణము. III. 1. IV. 1.

బంపెదపుగాక !' యని శపించెను-[1] అను పరవక్త్రైకార్థప్రతిపాదనము పురాకల్పము. ఇవి చెప్పఁబడినవిధము గమనించినచోఁ బరక్రియ యేకవక్త్రైక మనియు పురాకల్పము బహువక్త్రైక మనియు నేర్పడుచున్నది. ఒకవిధముగా నీరెండును అతీతార్థప్రధానములే. కాని పరకృతి యద్యతనభూతార్థము; పురాకల్ప మనద్యతన భూతార్థము. పరకృతియందు ప్రాచీనోదంతము ప్రప్రథమముగా నొకవక్తచేఁ జెప్పఁబడినది. పురాకల్పము పారంపర్యకథనముగా బహువక్తలచేతఁ జెప్పఁబడినది. బహుశః మీమాంసకులు చెప్పెడియీయర్థవాదభేదములను రాజశేఖరుఁడు గ్రహించి తనకావ్యమీమాంసయందు స్థాపించియుండవచ్చును. కాని, వాని సహజలక్షణము లగు నేకవక్త్రైబహువక్త్రైకత్వములను మార్చి యేకనాయకబహునాయకత్వములుగా నాతఁడు నిబంధించి యుండవచ్చును. 'పరక్రియా' శబ్దమును 'పరిక్రియ'గా మార్చి యుండవచ్చును. ఇతిహాసము పారంపర్యోపదిష్ట మైనదే కావున మీమాంసకుల మతము తద్విరుద్ధము కాదు.

సామాన్యముగా లాక్షణికులు వాఙ్మయమును శాస్త్రేతిహాసకావ్యము లని ముప్విధముగాఁ బరిగణించెదరు. అందు శాస్త్రము శబ్దప్రధాన మనియు, నితిహాస మర్థప్రధాన మనియు, కావ్య ముక్తిప్రధాన మనియుఁ బరిగణించెదరు. అగ్ని పురాణము ఇతిహాసమునకు నిష్ఠత ముఖ్యమని పేర్కొనినది.[2] అతీతార్థప్రధాన మగుటచే నితిహాసమునకు సత్యప్రతిపాదనము సహజలక్షణ మగుచున్నది. అది యర్థప్రధాన మగుటచే వేదాదులవలెఁ బ్రభుసమ్మితముగాఁ గాక, కావ్యమువలెఁ గాంతాసమ్మితముగాఁ గాక హితునివలె మిత్రసమ్మితముగాఁ బ్రబోధము నిర్వహించు చున్నది. ఆనందవర్ధనాచార్యుఁడు ధ్వన్యాలోకమున నితిహాస మగు మహాభారత మును 'శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయిని' యని పేర్కొనెను. దాని వలన శాస్త్ర కావ్య మధ్యవర్తి యగు నితిహాసమునందుఁ గొంత శాస్త్రరూపమును, కొంత కావ్యచ్ఛాయయును అన్వయించి యుండునని యేర్పడుచున్నది. అనఁగా నితిహాసము

1. తైత్తిరీయ సూత్రము. II. vi, VI, 1.
ఇవి కృష్ణయజ్వ 'మీమాంసాపరిభాష'యను గ్రంథమునుండి గ్రహింపఁ బడినవి.

2. ''శాస్త్రే శబ్దప్రధానత్వం – ఇతిహాసేషు నిష్ఠతా ।
అభిధాయాః ప్రధానత్వాత్ - కావ్యం తాభ్యాం విభిద్యతే"

— అగ్నిపురాణము

శాస్త్రకావ్యచ్ఛాయల కొకవిధమైన సంగమస్థానము. శాస్త్ర మనఁగాఁ జతుర్వర్గ వ్యుత్పత్తి. కావ్య మనఁగా రసభావసమన్వితోక్తి. ఇతిహాసమునకు సహజలక్షణము అతీతార్థప్రధాన మైన సత్యవస్తుకథనము. ఇతిహాసమునకు శాస్త్రరూపకావ్య చ్ఛాయలు సమకూడినచో నుపదేశోపరంజకత్వములు సిద్ధించి, యొకనిండుదనము కలుగుచున్నది. సత్య, శివ, సుందరరూప మగుచున్నది.

పురాణము లితిహాసములవలెనే అర్థప్రధానములు, మిశ్రసమ్మిశ్రములు. ఈ రెండును వేదార్థములనే యుపదేశించును. పురాణమున శాస్త్రవిషయ మధిక ముగాఁ జెప్పఁబడును. దృష్టాంతరూపమున బెక్కితిహాసకథాగాథాదులు పేర్కొనఁ బడుచుండును. ఇతిహాసమున శాస్త్రము సామాన్యముగా కథాగతి కొదిగియుండును. ఇతిహాసకథాకథనమునఁ బ్రధానవృత్తమునందు మందమయ్యు నొక యవిచ్ఛిన్నత భాసించును. దానియం దొక వస్త్వైక్యము గోచరించును. పురాణకథాకథనమునందు సామాన్యముగా వస్త్వైక్య ముండని కారణమున నవిచ్ఛిన్నతకు మాఱుగా ననుసంధాన మొండు భాసించును. అం దైక్యతకు బదు లేకవాక్యత శోభించును.

పురాణము లితిహాసములకంటె నధికముగా దైవలీలలను వర్ణించును. ఋషిదేవపితృగణముల వృత్తములు, శాస్త్రవ్రతాది నియమములు, స్వర్గనరకాది లోకానుభవవర్ణనలు, పుణ్యపాపఫలనిరూపణములు, పుణ్యతీర్థక్షేత్ర మాహాత్మ్య ములు, వివిధశాస్త్రార్థసారసంగ్రహములు పురాణములందు స్వేచ్ఛగా వర్ణింపఁ బడును. ఇతిహాసములం దివి సందర్భవశమున నౌచిత్యవంతముగాఁ జెప్పఁబడు చుండును.

సంస్కృతమున వెలసిన ఇతిహాసములు రామాయణమహాభారతములు. ఇందు రామాయణ మాదికావ్య మను ప్రశస్తి గాంచి మహాకావ్యగౌరవము నందు కొనినది. మహాభారత మితిహాస మని ప్రసిద్ధి గాంచినది. పైన పేర్కొనఁబడిన యితిహాసలక్షణము లన్నియు మహాభారతమున కన్వయించుచున్నవి. పురాణముల వలెనే యదియును పంచమవేదఖ్యాతిఁ బడసి భారతీయవిజ్ఞానమణిదర్పణమువలె విరాజిల్లుచున్నది.

పురాణేతిహాసములు మాతాపుత్రికల వంటివి. కావున వాని రెండింటికిని కొన్ని పోలిక లున్నవి. పరిణత యైన పుత్రిక మాతవలె గౌరవప్రపత్తులను లోకమున సంపాదించుకొనును. పురాణపురంధ్రి పండినవిజ్ఞానకల్పకము. తత్పు

త్రిక తల్లక్షణములు కొన్ని ముద్రించుకొనిన మహితమాకందమూర్తి. వారిగుణము లందును, లక్ష్యములందును సామ్యము లుండును. కాని యవస్థలయందును, వ్యవస్థల యందును భేద ముండక తప్పదు.

భారతీయసాహిత్యములం దితిహాసపురాణము లెట్లు ప్రసిద్ధిఁ జెంది యున్నవో పాశ్చాత్యవాఙ్మయములందు Epics, Myths అట్లు విఖ్యాతిఁ బడసి యున్నది. వీని పుట్టుపూర్వోత్తరములకును, వికాసక్రమమునకును, స్వరూప నిర్మాణ సంవిధానములకును వానికిని సంబంధప్రభావములు చాల తక్కువ. కాని, సాహిత్యప్రక్రియలుగా వానికిని, వీనికిని సామ్యము కొంత కానవచ్చుచున్నది. పాశ్చాత్యవిమర్శకులు ప్రాచ్యపాశ్చాత్య సాహిత్యప్రక్రియాపర్యాలోచనము సేయుచు భారతీయము లైన యితిహాసపురాణములను గ్రమముగా Epics, Mythsగాఁ బరిగణించుట జరిగినది.

Epic poem సామాన్యముగా నొక సుదీర్ఘకథావృత్తము గల కావ్యమై యుండును. మహాసంగ్రామమువంటి యుద్వేగచైతన్యభావముచే నుత్తేజితమైన జాతియొక్క జీవితవృత్తమునుండి గైకొనఁబడిన యుజ్జ్వలములును, బ్రసిద్ధములు నైన సన్నివేశములతో నది నిర్మింపఁబడును. దానియందలి పాత్రలును, సన్నివేశములును మానవుని యౌదార్యోన్నత్యములయందును, మహోన్నతలక్ష్యసాధన శక్తియందును సామాజికులకు విశ్వాసము నినుమడింపఁజేసి విశిష్టానందము నొడఁగూర్పఁ గలుగునట్లు చిత్రింపఁబడును.[1] Epic poem లో నితివృత్తమున కధిక ప్రాముఖ్యము కలదు. అందలి కథ రసభరితమై యుండవలెను. అందు మానవ జీవితానుభవముల కతీతములుగాని సంఘటనలు వర్ణింపఁబడుచు, వానిపైఁ బ్రభావము వేయుచున్న విధిప్రాబల్యము నెఱుకపఱచుచుండవలెను. దానివలన నొక మహా ప్రబోధము గాని, మహాప్రయోజనము గాని సాధింపఁబడవలెను. అట్టి యుదాత్త వస్తువున కుచితమును, ఛందోలంకారబంధురము నైన కవిత్వశైలి దానియందు నిబంధింపఁబడును.[2] ఇట్టి లక్షణములతో నొప్పారు Epic స్వరూపస్వభావములచే నితిహాసము కన్న భిన్నమయ్యుఁ గొన్నియంశములందు సాదృశ్యము సంతరించు కొనుచున్నది. సుదీర్ఘకథాకథనము, ఉజ్జ్వలమైన జీవితవృత్తములు గలపాత్రలు,

1, From Virgil to Milton; By C. M. Bowra. పుట. 1.

2. The Epic – By L. Eber Crombe పుట. 51.

కము దాల్చి రని మారన వర్ణించెను. మూలమున యజ్ఞకర్త యైన హరిశ్చంద్రుని బాధించుచున్నందులకు దేవతలకు జాలి కలిగెనని చెప్పఁబడియున్నది. యజ్ఞయాగాదులచేత దేవతలఁ దృప్తిఁ బఱచిన రాజుపై సురలు జాలి ప్రకటించి రని మూలకర్త వర్ణింపఁగా హరిశ్చంద్రుని సత్యనిష్ఠయే యతనికి నిడుమలఁ దెచ్చి పెట్టిన దని దేవతలు జాలిపడినట్లు మారన చిత్రించెను. ఈకథయందు నాయకుని సత్యనిష్ఠకుఁ బ్రాధాన్య మిచ్చుట యుచిత మని మారన నిష్కర్ష!

మారన కాశీనగరప్రవేశము చేయు హరిశ్చంద్రుని వర్ణించుచు 'తోలఁగని సత్యధర్మములు తోడుగఁ దాలిమి యాది' దుఃఖములఁ దరించుచుండె నని పేర్కొనెను. అనఁగా నాజేనికి సత్యధర్మము లంగరక్ష లనియు, ఓరిమియే పూనిక యనియు కవిభావము. కథాంతమున నమరేంద్రుఁడు హరిశ్చంద్రునిగూర్చి చెప్పినమాటలు :

చ. "నరుల కగమ్యమై వెలుఁగు నాకము నీ కభిగమ్య మయ్యె నీ
నిరుపమసత్యధర్మమహనీయత శాశ్వతదివ్యభోగముల్
దొరకొనియె న్నరేశ్వర ! సుతుండును భార్యయు నీవు నూత్నర
త్నరుచిర సద్విమానము ముదమ్మున నెక్కుఁడు రండు." —(1. 274)

శాశ్వతదివ్యభోగములకు సత్యధర్మమహనీయత హేతు వని సురేంద్రుఁడు వల్కినట్లు మారన. పురాకృతసుకృతకర్మఫలముగా నాభోగము లాజేనికి దొరకుచున్న వని మూలము (8. 248). మూలమునందు స్పష్టముగాని సత్యధర్మనిష్టను మారన తనరచనమున విస్పష్ట మొనర్చెను. ఇట్లు కథారంభగర్భనిర్వహణములందు షడ్లింగములచేతఁ బ్రధానప్రతిపాద్యకదార్థమును ధ్వనింపఁజేయుట మారన కథాకథన శిల్పము !

కథారంభనాయకగుణకీర్తనమునం దతని యంతర్వ్యక్తిత్వమును వ్యంజింపఁజేసినాఁడు మారన. మొదటిపద్యమున హరిశ్చంద్రుని చక్రవర్తిత్వమును, రెండవపద్యమున నతని ధర్మపాలనదక్షతను, మూఁడవదానియం దాతఁడు సామ్రాజ్యపౌరులఁ దీర్చిదిద్దినవిధమును వర్ణించి తాత్పర్యమున నతని ధీరోదాత్త నాయకత్వమును స్థాపించినాఁడు. కులీనత్వాది నాయకసామాన్యగుణములను కవి మొదట నిరూపించెను. వేదము లతని మాహాత్మ్యమును గీర్తించు ననుటచే నతఁ డుత్తమశ్లోకుఁ డనియు, సప్తద్వీపవసుంధరావలయ మాతనిశాసనము శిరమున

దాల్చు ననుటచే నాతఁడు విశ్వంభరాధిపత్యమను మహాభాగ్యముచే నొప్పారెడువాఁ డనియు, మహేంద్రాదుల కాతనిరక్ష పెట్టనికోట యని చెప్పుటచే నాతఁడు త్రిలోక రక్షాదక్షుఁడైన ప్రతాపుఁ డనియు, బ్రహ్మాండ మంతయు వ్యాపించిన కీర్తి గలవాఁ డనుటచే దిగంతవిశ్రాంతకీర్తి యనియు, మహితగుణాభిరామమూర్తి యనుటచే నౌజ్జ్వల్యము, ఔదార్యము, తేజస్విత, ధార్మికత్వము, వైదగ్ధ్యము, ఆర్తావన త్వము, కావ్యగీతప్రియత్వము మొదలగు సుగుణముల కాకరమైనవాఁ డనియు; 'ప్రత్యర్థిసమవర్తి యనుటచే శత్రుభయంకరుఁ డనియు; 'పరమపూజ్యసామ్రాజ్య వైభవస్ఫూర్తి' యనుటచే వివిధాధ్వరనిర్మలధర్మకర్మల నెల్లవేళల నాచరించుట చేతఁ బ్రకటీకృతపూజ్యసామ్రాజ్యవైభవము గలవాఁ డనియు స్పష్టమగుచున్నది. అతని సామ్రాజ్యమునం దీతిబాధలు లేక ప్రజలు సుఖించుచుండిరి. ప్రభువు విక్రమ కళాకుశలుఁడై దేశమును రక్షించుచుండుటయు, సత్యధర్మనియతాత్ముఁడై పుణ్య వర్తనుఁడై ప్రజలను బాలించుచుండుటయు, 'యథా రాజా తథా ప్రజా' యను న్యాయము ననుసరించి ప్రజలయందు ధర్మప్రీతి వర్తించుటయు నందులకుఁ గారణములు. ఆమహారాజు ధర్మశాసనము ననుసరించి నారాజ్యప్రజలు ధనరూప బలవిద్యాతపోమహత్వసంపన్ను లయ్యును మదాంధులు గాక వినయవివేకవం తులై వెలయుచుండిరి. ఇట్లు వర్ణించుటచే రాజు పరమధార్మికుఁడైన మహాత్ము డనియు ప్రజారంజకుఁడైన పాలకుఁ డనియు, రాజర్షి యనియు నేర్పడుచున్నది.

శ్లో. "అధ్యాక్రాన్తా వసతి రమునాఽప్యాశ్రమే సర్వభోగ్యే
రక్షాయోగా దయ మపి తపః ప్రత్యహం సఞ్చినోతి
అద్యాపి ద్యాం స్పృశతి వశిన శ్చారణద్వంద్వగీతః
పుణ్య శ్శబ్దో ముని రితి ముహుః కేవలం రాజపూర్వః."

—అభిజ్ఞానశాకుంతలము. 2అం. 14 శ్లో.

అను కాళిదాసశ్లోకతాత్పర్యమును నాయకవర్ణనమున వ్యంజింపఁ జేయుటయే మారన హరిశ్చంద్రస్వరూపచిత్రణమునందలి రహస్యము! మూలమునం దాదియం దున్న రాజర్షిశబ్దమును ఫలితాంశముగా వర్ణనమున చివర నిలిపి మారన యాభావమును సూచించెను.

ఈయుపాఖ్యానమున సత్యవీర మంగిరసము. దాని కాలంబనము హరిశ్చం ద్రుఁడు. వీరమునకు స్థాయి ఉత్సాహము. అది ధర్మప్రధానమై యుండవలెను. 'తతోఽర్థకామయో ర్ధర్మమూలకత్వాత్ ధర్మప్రధానో వీరః' అని యభినగుప్త

పాదులు. వీరము ధర్మైకరూప మయ్యును నిమిత్తభేదముచే భిన్నరూపము లయి భాసించుచుండును. రాగద్వేషరహితు లైన విద్వాంసులహృదయములచే నభ్యనుజ్ఞాత మగునది ధర్మ మని మనుస్మృతి. అది ధృతిక్షమాదయాస్తేయశౌచాది భేదముచే దశవిధము. అహింసాదులు తత్సాధనములు. అది ప్రవృత్తినివృత్తి భేదముచే ద్వివిధము. దశవిధధర్మలక్షణములలో సత్య మొకటి యైనను అది ధర్మ శ్రేష్ఠ మని పురాణములు చాటుచున్నవి. (సం. మా. పు. 8. 18). హరిశ్చంద్రుఁడు దశవిధలక్షణాత్మక మగు ధర్మమును నిర్వహించుచునే సత్యనిష్ఠచేఁ బ్రదీప్తమైనయుత్సాహస్ఫూర్తినిఁ బ్రకటించియున్నాఁడు. సత్యవ్రతసిద్ధికై సర్వ ధర్మసంచయమును దాని కంగసముచ్చయముగా ననుసంధించుకొనినాఁడు కావున సత్యవీర మంగి యైనది. కథలో ధర్మతాత్పర్యము సత్యనిష్ఠగాఁ బరిణమించిన క్రమము గమనించినచో నీతాత్పర్యము స్పష్టపడఁ గలదు.

హరిశ్చంద్రుఁ డొకనాఁడు మృగయావినోదమున దగిలి యొకవనమున గ్రుమ్మరుచుండెను. ఒకచోట నాతనికి 'రక్షింపుడు రక్షింపు' డను నాడుకూయి బిగ్గరగా వినవచ్చినది. ఆరాజశేఖరుఁ డప్పుడు వేట చాలించి, డార్తత్రాణపరాయణత్వము మెఱయ, 'నోడకోడకు' డని యభయమిచ్చి, "ఏనుండ మిమ్ముల నన్యాయవృత్తి నెవ్వఁ డలంపఁగలఁ" డని యిట్లు గర్జించెను:

చ. "వెలుఁగు మహాప్రతాపశిఖివేడిమి దిక్కులు నించుచున్న నా
కొలఁది యెఱుంగ కెవ్వఁడొకొ మోరపుఁ జిచ్చిటు చీరఁ గట్టెడి
న్దలరక యిట్టిదుర్మదు నధర్మపరు న్దురితాత్ముఁ జండదోః
కలితధనుర్విముక్తపటుకాండవిఖండితగాత్రుఁ జేసెదన్." —1. 52

ములుకులవంటి యాపలుకులకు విశ్వామిత్రుఁ డలిగి, వైశ్వానరసదృశుఁడయ్యెను. నిజ మప్పటికి గాని తేటపడలే దారాజునకు. పూర్వము వినవచ్చిన స్త్రీరోదనములు మునితపోగ్నితప్తములైన విద్యల యాక్రందనలు. మునితపము చెదరినంతనే విద్యలకు మోక్షము కలిగినది. వాని యావేదన లుడిగినవి. రాజు విద్యాక్రందనలను స్త్రీరోదనలని భ్రమించి క్షత్రియసహజ మైన యార్తజనరక్షణోత్సాహమును బ్రకటించి, దోషియైన ధూర్తునిపై రౌద్రము ప్రకటించినాఁడు. ధూర్తునకు బదులుగా దుర్వార క్రోధమూర్తి యగు కౌశికుఁడు ప్రత్యక్షమైనాఁడు. ఇందు హరిశ్చంద్రునివర్తనము దోషకలితము గాక ధర్మబద్ధమై యున్నది. దాని నాతఁడే మునికి సవినముగా విన్నవించుకొనినాఁడు.

చ. అలుగకుమయ్య ! యోమునిజనాగ్రణి ! తపోౢక యింత లేదు నా
వలన నరేంద్రధర్మ మగు వాక్యమ పల్కితిఁ జిత్తగింపు మ
స్ఖలితము గాఁగ నిచ్చుటయుఁ గాచుటయు న్విలు చేతఁ బట్టి ని
శ్చలత రణంబు సేయుటయు శాస్త్రమతస్థితి రాజధర్మముల్."
—1. 157

హరిశ్చంద్రుని శాసనమహిమచే నాతని రాజ్యవాసు లెల్లరు ధర్మవ్రతులును, మదవిరహితులు నై యుండి రని వెనుక తెలుపఁబడినది. అట్టి ప్రజలు గల యా దేశమున నట్టి విపరీతవర్తనము విన్నను, కన్నను ఆరాజు మండిపడుటలో నాశ్చర్య మేమి కలదు? అతఁడు ధర్మనిర్వహణమున విధివిరుద్ధముగా వ్యవహరింపలేదు. కావున విశ్వామిత్రుఁడు నిరుత్తరుఁ డయ్యెను. కాని రౌద్రము కౌశికుని నావహించినది. రౌద్ర మర్థప్రధాన మైనది. అర్థసాధనము ధర్మ మానుషంగికమైనది. కావున నామునివక్రమార్గము ననుసరించినాఁడు. "ఎవ్వరికి నిత్తు? గాతు నీ వెట్టివారి? రాజ! యెవ్వరితో బవరంబు సేయుదు?" అని ప్రశ్నించినాఁడు. "విప్రుల కిత్తు, భయార్తజనులఁ గాతు, శత్రులతోడ సంగర మొనర్తు' నని రాజు ప్రత్యుత్తర మిచ్చినాఁడు.

మ. "అనినం గాధితనూజుఁ డీవిహితధర్మాచారము ల్పల్కుదే
ని నరోత్తమ! యేను బ్రాహ్మణుఁడఁ గానే రాజసూయాధ్వరం
బునకుం జాలినయంత సొమ్మొసఁగుమా భూదేవతాకోటికి
న్దనియ న్దక్షిణ లిచ్చి యజ్ఞ మమరేంద్రప్రీతిగాఁ జేసెదన్."—1. 160

అని యడిగినాఁడు. మునీంద్రుఁడు భయార్తుఁడును, శత్రుకోటిలోనివాఁడును, గాక పోవుటచేత రాజువలన రక్షణను గాని, యుద్ధమును గాని కోరలేదు. మిగిలినదానమును గూడ నతఁడు విప్రుఁడైనచో నడుగవచ్చును. అతఁడు తొలుత రాజర్షియై పిదప బ్రహ్మర్షి యైనవాఁడు. ఆతనిని బ్రహ్మర్షిగా నంగీకరింపని వసిష్ఠునిఁ బుత్ర శోకవార్నిధియందు ముంచినవాఁడు. అట్టియతఁడు "ఏను బ్రాహ్మణుఁడఁ గానే?" యని ప్రశ్నించుటయందు మూలమున లేని వాగ్వక్రత తెలుఁగున గానవచ్చుచున్నది. అడుగుటకుఁ గౌశికుఁడు తనను బాపనిగా లెక్కవైచికొనినను అడిగినది క్షత్రియోచితమైన రాజసూయయాగమును జేయుటకువలయుధనము. అదియును భూదేవతాతతికి దక్షిణ లిచ్చుటకు. మారన విశ్వామిత్రుని గడుసరివానిగాఁ జిత్రించినాఁ డాంధ్రమున. మూలమున "యష్టుమిచ్ఛామి విప్రోహం దీయతా మిష్టదక్షిణా" అనుచు నచ్ఛమైన

విప్రునిగా యాచించు విశ్వామిత్రునిలోఁ దెలుగుపలుకులలోని కాకుస్వరవ్యంగ్యము గాని, కమనీయవక్రత గాని, సమయోచితాడంబరము గాని పొడగట్టదు.

హరిశ్చంద్రుఁ డామునిమాటలు వినినతోడనే చచ్చిబ్రతికినట్లు తేరికొనినాఁడు. ఆనందభక్త్యావేశముతోఁ దనయాస్తి సర్వస్వమును మునీంద్రుని కాళ్ళముం దుంచి నాఁడు. అందు సిరిసంపదలును, రాజ్యాధికారమును, ధాత్రియును, ధనరాసులును, భార్యయును, బుత్రుఁడును, తానును గలరు. మూలమున లేని 'ధర్మచయము' గూడ తెలుఁగున జేర్పఁబడినది. ధర్మనిష్ఠ మగు నాయకునిచిత్తవృత్తి యామాట ననకుండ నుండఁజాల దని మారన నిష్కర్ష.

విశ్వామిత్రుఁడు కోరినది రాజసూయాధ్వరమునకుఁ గావలసినంతధనమై యుండగా హరిశ్చంద్రుఁడు తనసర్వస్వము నిచ్చియున్నాఁడు. ఇచ్చుచు వినయసూచకముగా "దక్షిణకు విత్తము చాలినయంత మున్న యిచ్చినదిగా నెఱుంగుము" అని పేర్కొనినాఁడు. అందు "మున్న ఇచ్చిన" దన్నమాటకుఁ గౌశికుఁడు వక్రముగా వ్యాఖ్యానించినాఁడు. అది హరిశ్చంద్రునియభిప్రాయమునకు సాక్షాద్విరుద్ధమైనది. రాజు నాగరికసభ్యత ననుసరించి 'నాసంపదయంతయు మీదే; మీదక్షిణను మీ రడుగకపూర్వమే నే నిచ్చినట్లు భావించి నాయందు చనువు చూపి యావస్తువులలో మీకిష్టమైనది దక్షిణకు బదులుగా నెన్నుకొనుఁ' డను భావము వచ్చునట్లు మాటలాడినాఁడు. కాని, విశ్వామిత్రుఁడు వెన్నలో వెంట్రుకలు వెదకినాఁడు. 'మున్న యిచ్చినది' యనఁగా హరిశ్చంద్రుఁడు తనసర్వసంపదను దనముఁం దుంచకపూర్వమే యిచ్చిన దని నిశ్చయించినాఁడు. దానిని లెక్కవైచికొనకయే హరిశ్చంద్రుని సర్వసామ్రాజ్యమును దానముగాఁ బుచ్చుకొనినాఁడు. ఇట్లు ద్వంద్వార్థము వచ్చునట్లు రాజు మాటలాడుటయే యిచ్చట జరిగిన పొరపాటు. విశ్వామిత్రుఁడు సర్వరాజ్యమును గైకొని హరిశ్చంద్రుని నగరు వెడల నాజ్ఞాపింప నతఁడు నారచీరలు గట్టి భార్యాపుత్రసమేతుఁడై నిష్క్రమించు సమయమున బూర్వదత్తమైన యజ్ఞదక్షిణను గూర్చి ప్రశ్నించునంతవఱకు నాచక్రవర్తి కాపొరపాటు తెలియలేదు. తెలిసి యప్పుడు పశ్చాత్తాపపడి లాభము లేకపోయినది. అన్నమాట నిలువఁబెట్టుకొనుటకు భార్యాపుత్రులనే కాక చివరకు తననే యమ్ముకొపవలసివచ్చెను. మాటతప్పని యామానధనుఁడు అభిమానమును సైతమమ్ముకొని సత్యమును గాపాడుకొనెను. హరిశ్చంద్రునివాక్యరచనలోని 'గండ' మను నొక్కరూపకాంగము నాధారముగాఁ జేసికొని కథపూర్వభాగమునుండి యుత్తరభాగమున కల్లుకొనిపోవుట యచ్చటి

కథానిర్మాణశిల్పము. ఏతత్కథాపరిణామానుసారియై నాయకుని ధర్మోత్సాహము క్రమముగా సత్యపాలన మనెడి నిమిత్తము నూతగాఁ గొని యుత్కటమగుచున్నది. ఇట్టి సత్యవీరము జన్యరస మైన యద్భుతము నంగముగాఁ గొని నిర్వహణమున సఫలతఁ గాంచుచున్నది.

ఈయుపాఖ్యానమున సత్యవీరము క్రోధకరుణాది రసభావములచేఁ బరిపుష్ట మైనది. ఇందు బ్రతినాయకుఁడు కౌశికుఁడు. అతనిసహాయకుఁడు ధర్ముఁడు. కౌశికుఁడు రౌద్రరసమూర్తి. అతని 'రౌద్రవృత్తి'ని మారన 1.189 పద్యమున సూచించియున్నాఁడు. విశ్వామిత్రుని క్రోధ మర్ధప్రధానముగా నామూలాగ్రముగ పోషింపఁబడినది. హరిశ్చంద్రుని గడగండ్లపాలు సేయుటలో నాతఁ డనుసరించిన క్రూరమార్గ మాతని యౌద్ధత్యమును జెప్పకజెప్పుచున్నది. అతని రౌద్రమువలన శైబ్యయందును, హరిశ్చంద్రునియందును పుత్రవియోగజనితమైన కరుణము కలుగుట కవకాశము కలిగి జనకజన్యరసనిష్పత్తి కనువైనవిధ మేర్పడినది. హరిశ్చంద్రుఁడు కాటికాపరి యగుటచే నాతనియౌజ్జ్వల్య మొక్కింత మాటుపడినదే గాని యట్టిదీనావస్థయందును నతనిచిత్తమున సడలని సత్యదీక్షయు, కదలనిస్థైర్యమును బొడగాంచినచో నాతనితేజస్విత మఱింత యౌజ్జ్వల్యము దాల్చిన దని స్పష్ట పడకపోదు. తనను దా నమ్ముకొనియును ఋషిఋణము తీర్చిన హరిశ్చంద్రుని సత్యధర్మతేజముముందు విశ్వామిత్రునిరౌద్రదీప్తి వెలవెలపోయినది. మాయాచండాలుని క్రూరబుద్ధి హరిశ్చంద్రుని కఠోరధర్మదీక్షముందు స్తంభించిపోయినది. ముని శాపభీతియు, చండాలసేవావిధియు హరిశ్చంద్రునిదుఃఖార్ణవమున ముంచినవి. పరితాపాగ్నితోఁ గాల్చినవి. కాని యతని నిష్కళంకసత్యవ్రతదీక్షమాత్రము తాలిమి నూది తరుణముకొఱకు ప్రతీక్షించినది. ప్రాణతుల్యుఁడైన పుత్రునియొక్కమృతి హరిశ్చంద్రున కేర్పడిన చివరిపరీక్ష. విధి పెట్టిన యాపరీక్షను ద్రిప్పి విధిముఖము ననే కొట్టి యానరపతి చితిపై నెక్కి శ్రీకాంతుని స్మరించినాఁడు. దేవదుందుభులు మ్రోసినవి; పూలవానలు కురిసినని; అమృతపుజల్లులు వాలినవి; శాశ్వతదివ్యభోగము లెదుట నిలిచినవి. అవియన్నియు నాతేని 'సత్యధర్మమహనీయత'కు మెచ్చి దేవత లిచ్చిన బహుమానము లని మహేంద్రుఁడు స్పష్టముచేసినాఁడు; ధర్మకౌశికుల కపట నాటకమును విప్పిచెప్పినాఁడు. దానివలన జిజ్ఞాసువుల హృదయమునందు విశ్వామిత్రుని రౌద్ర మాభాసముగా స్ఫురింపవచ్చును గాక! ధర్మునియౌద్ధత్యము మాయామూలక మని మనసు కెక్కకపోవుగాక! సత్యపాలనకై యప్పటికే యమయాతన

ననుభవించియుఁ బ్రజాకుటుంబముకొఱకు నారకదుఃఖములైన ననుభవించుఁ సిద్ధమై స్వర్గసౌఖ్యమును ద్యజింప నుత్సహించి యాశ్రితావనధర్మము నారాధిం హరిశ్చంద్రుని యుత్కటోత్సాహము మాత్రము పఠితహృదయమున రససి గలిగింపక మానదు.

కథాకథనకుశలుఁడైన మారన హరిశ్చంద్రోపాఖ్యానమున బహువిధములై యంతర్నిర్మాణశిల్పములను గూర్చి దాని నొకకళామందిరముగాఁ దీర్చిదిద్దెను. ఆ వానిలో ముఖ్యమైనవానిని గొన్నింటిని బరిశీలించుటవలన కవియొక్క కావ్యరచ సామర్థ్యము కొంత తేటపడఁగలదు.

1. హరిశ్చంద్రుఁడు విశ్వామిత్రునకు సమస్తసామ్రాజ్యసంపదలను దత్తః చేసి, మేనిపై ధరించిన యాభరణాదులఁ బరిత్యజించి వల్కలాజినధారియై నగ వీడి వనికిలో బ్రవేశించుఘట్టమున మారనకవి యమూలకము లగు మూఁడు సీ పద్యములను రచించి ప్రకరణోచితరసభావవర్ణనానైపుణ్యమును బ్రకటించెన అందు మొదటిపద్యమున రాచనగపులో హరిశ్చంద్రుఁడు వర్జితానేకవిశేషభూషణ డగు నప్పుడితఁడు బంధుజనులకుఁ దోచినవిధము వర్ణితము :

సీ. సురుచిరకిరణవిస్ఫురణంబు డింది యెం
  తయు మాఁగుపడినమార్తాండు పగిది,
భాసురరత్నప్రభలు వాసిన విన్న
  నౌ రోహణశిలోచ్చయంబు మాడ్కి,
విలసితతారకవిభవంబు చెడి కడుఁ
  బొడలియున్న నభంబుకరణి,
ప్రవిమలకుసుమసంపద యెల్ల నుడిపోయి
  రూపుదక్కిన మహీరుహముభంగి
తే. నొందఁ గోటీరహారకేయూరకంక
ణాది మణిభూషణోత్కర మపనయించి
యొప్పు పొలిపోయి దీనత నుండె బంధు
జనులమూడ్కులు కమర నజ్జనవిభుండు. 1. 169.

హరిశ్చంద్రుఁడు కిరీటమును, హారములను, భుజకీర్తులను, కంకణాదిమణిభూషణో త్కరమును అపనయించినప్పుడు పొలిపోయి దీనత నొప్పిన యతనిస్వరూపావస్థ

లను యథాసంఖ్యోపమాలంకారశోభితముగా సీసమున మారన వర్ణించినాఁడు. ఈ పద్యమున బ్రతిచరణమును సార్థకమై రసానుకూలభావసమర్పకము లగుట గమనింపఁ దగియున్నది.

ఉజ్జ్వలరత్నకిరణప్రసారసుందరమైన కిరీటము నపనయించినతోడనే కాంతి దక్కి సురుచిరవిస్ఫురణము డింది యెంతయు మాఁగుపడిన మార్తాండునివలె రాజు దైన్యము నొందినాఁడు. మృతమైన జగత్తును బునరుజ్జీవింపఁ జేయువాఁడు మార్తాండుఁడు. అట్లే సామ్రాజ్యప్రజలను క్షయమునుండి కాపాడువాఁడు హరిశ్చంద్రుఁడు. అట్టి యుత్తమధర్మమునకుఁ బ్రతీక యతఁడు శిరమున ధరించినకిరీటము. అది యూడుటతోడనే యతనినుండి పాలనధర్మమును, కాంతిమత్త్వమును వేరుపడిన వనుభావ మాయుపమానమువలన మారన వ్యజింపఁజేసెను.

కంఠసీమయందును, ఉరఃప్రదేశమునందును వెలుఁగొందు రత్నహారములఁ దీసివైచిన హరిశ్చంద్రుఁడు భాసురరత్నప్రభలు వాసి విన్ననౌ రోహణశిలోచ్చయము మాడ్కి వైవర్ణ్యము దాల్చినాఁడు. రత్నరాశులు పర్వతమునకు సహజసంపద. అట్లే చక్రవర్తికి రత్నహారములు సహజసంపదలు. శిలోచ్చయశబ్దము హరిశ్చంద్రుని దృఢశరీరమును విపులవజ్రోరఃప్రదేశమును వ్యజింపఁజేయుచున్నది. రత్నహారము లొక్కసారిగా వీడుటచే నాతనియురము వివర్ణమై విన్నబోయిన దని యలంకారతాత్పర్యము.

కేయూరవిరహితుఁడైన హరిశ్చంద్రుఁడు తారకావైభవము చెడి కడుఁబాడఱి యున్న నభమువలె నుండెనట! "మేఘైర్న భా తీతి నభః" అని గురుబాలప్రబోధిక. మేఘాచ్ఛన్నమైన యాకసము వోలె భుజకీర్తులు కోల్పోయిన రాజుపై నైల్యము వ్యాపించి చిన్నబోయిన యనుభావము కానఁబడె నని తాత్పర్యము! ఇందలి తారకావైభవము కేయూరమణివైభవమున కుపమానస్థానము.

కంకణాదివివిధమణిభూషణోత్కరము నపనయించిన మహారాజు ప్రవిమలకుసుమసంపద యెల్ల నుడివోయిన మహీరుహము భంగి రూపుసెడి యుండెనఁట! ఈయుపమానబలముచేతఁ బూలు రాలినచెట్టు ఫలసిద్ధి కెట్లు దూర మగునో యట్లే మణిభూషణోత్కర మంతవఱ కాతని నాశ్రయించి యున్నను నతని కెట్టిఫలసిద్ధిని గల్పింపకయే దూరమైపోయిన వని కవి వ్యంజింపఁ జేసినాఁడు.

అహార్యసంపదఁ గోల్పోయి కాంతిహీనుఁ డైన హరిశ్చంద్రుఁడు గుర్తించు టకే వీలులేనంతగా మారిపోయినాఁ డని మారన నిరూపింపఁ యత్నించినాఁడు. అట్టి దైన్యావస్థలో నున్న హరిశ్చంద్రుని గాంచిన బంధుజనులచూడ్కులు కమరి పోయిన వనుటలో నాశ్చర్యము లేదు. హరిశ్చంద్రుఁడు రాజ్యభోగములఁ దా ననుభ వించుటయే కాక తనబంధుకోటిని గూడ అనుభవింపఁ జేసినాఁడు. కావున తమ వైభవస్ఫూర్తి కేమహితాత్ముని దీప్తి కారణమైనదో యది తమకన్నులయెదుట నంతరించుచుండుటఁ గాంచి సురసురస్రుక్కినా రనుట సార్థకము!

పురవీథులవెంట పాదచారియై యరుగుచున్న హరిశ్చంద్రుని గాంచి పౌరులు మిన్ను విరిగి మీఁదఁ గూలిన విధముగా గుండె లవిసి కళవళించి యిట్లని వాపోయిరి:

సీ. కాంచనాలంకృతిఁ గర మొప్పి నీమ్రోల
నేతెంచు గజఘట లెందుఁ బోయెఁ?
గనకకింకిణులచెల్వునఁ గ్రాలు తురగంబు
లేల నీకెలఁకుల నేఁగుదేవు?
రత్నోజ్జ్వలము లైన రథములు నీపజ్జ
వడిఁ జనుదేర కెక్కడ నడంగె?
వివిధాయుధస్ఫూర్తి వెలుఁగు కాల్వుర మొత్త
మేల నీతో రాక యేమి యయ్యె?

తే. రమ్యభూషణదివ్యాంబరములు దొలఁగి
నారచీరలు గట్టి యనాథవృత్తి
నాలుఁ గొడుకును వెంటరా నరుగునట్టి
యెడరు వాటిల్లెనే మేదినీశ! నీకు.

సీ. పొలుచు నీసామ్రాజ్యవిభూతి బ్రేఁగయ్యెనే
దైవంబుకంటికి ధరణినాథ!
చక్రంబు పనిసేయ సడిసన్న నీపెంపు
బూడ్దబొట్టయ్యెనే భూరికీర్తి!
యాదిగర్భేశ్వరి యగు నీమహాదేవి
యింతకు నోచెనే యిద్ధచరిత!

గోమునఁ బెరిగిన యీముద్దుపట్టి భా
గ్యం బిట్టి దయ్యెనే యధికపుణ్య !

తే. హా ! మహారాజ ! రాజసూయాధ్వరేశ !
హా ! హరిశ్చంద్ర ! నిత్యసత్యాభిరామ !
హా ! దృఢైశ్వర్య ! శౌర్యజితారిలోక !
హా ! సమస్తలోకేశ ! దయారమేశ ! —1. 175- 177.

మొదటిపద్యమునందు రాజచిహ్నములు లేక యనాథవృత్తి సకుటుంబియై వచ్చు మహారాజును జూచి ప్రజలు విలపించిరి. కాంచనాలంకారభూషితము లైన గజసమూహమును, కనకకింకిణీక్వాణమండితము లైన తురంగములును, రత్నోజ్జ్వలము లైన రథసమూహములును, ఆయుధపాణు లైన భటులును - అనఁగా చతురంగబలములు - వెంట రాగా రమ్యభూషణదివ్యాంబరములు ధరించి పురమున నూరేగవెడలు రాజున కానాఁడు కలిగిన యెడరును గూర్చి ప్రస్తావించిరి. రెండవ పద్యమునఁ బురి వెడలిపోవుచున్న హరిశ్చంద్రుని గాంచు ప్రజలయెడఁదలలో శోకానలము కార్చిచ్చువలె నంటుకొని యాక్రందనల కుపక్రమింపఁ జేసినది. వారు పిలిచిన ప్రతి పిలుపులోను, సార్థక్యమును సాదరమును ఉట్టిపడుచున్నవి. దైవము నకే కన్నుకుట్టునంత రాజ్యవిభూతి కలవాఁ డగుటచే నాతఁడు ధరణీనాథుఁ డైనాఁడు. సప్తాంగచక్రమును సమర్థముగాఁ బని చేయించుటచే నాతని కపారకీర్తియు నభ్యుదయమును గలిగినవి గాన భూరికీర్తి యనఁబడినాఁడు. ఆదిగర్భేశ్వరి యగు నా మహాదేవిని జేపట్టుటచే నాతఁ డిద్ధచరిత్రుఁ డైనాఁడు. రాజసూయాధ్వరప్రవర్తకుఁ డగుటచేతనే యాతనికి మహారాజపదము సార్థక మైనది. నిత్యసత్యాభిరాముఁ డను విశేషణమునకును హరిశ్చంద్రుఁ డన్న విశేష్యమునకును విడదీయఁ జాలని యను బంధము కలదు. అతఁడు శౌర్యజితారిలోకుఁ డగుటచే దృఢైశ్వర్యుఁడును, విష్ణ్వంశ గల మహారాజగుటచే దయారమేశుఁడు, సమస్తలోకేశుఁడును అగుచున్నాఁడు. మారనచేతిలో నాపౌరు లుచితప్రయోగశిల్పకుశలులవలె సృజియింపఁబడినారు.

ప్రజ లారాజచంద్రుని యేలుబడిలోఁ జల్లగా జీవించుచుండిరి. కష్టమన్నది కాని, కన్నీ రన్నది కాని వారికిఁ గలుగకుండఁ జూచిన పెన్నిధివంటివాఁ డా ప్రభువు. అతనిపై దుర్విధి కసిపూనినది. దానిని వివేకముతో భావించి ప్రజలు దుఃఖావేశముతో నెలుగెత్తి విలపింతురే కాని ప్రత్యక్షదుర్విధి యైన విశ్వామిత్రుని

బల్లెత్తుమాట యైనను అనరు. ఆమహారాజు వారి కిచ్చినశిక్షణ యటువంటిది. మద విరహిత మైన చిత్తవృత్తి సత్యధర్మశాసనమహిమచే నారాజ్యమునఁ బ్రజాహృద యములందు వసించిన దని యిచ్చట వస్తుధ్వనిచే మారన వ్యంజింపఁ జేసినాఁడు. కథానిర్వహణమున హరిశ్చంద్రునితోపాటు దివ్యవిమానములందు పాదము లుంచు టకుఁ దగినయర్హతను బ్రజలయందు సమాయత్తపఱచి మారన కథార్థములను సారవంత మొనర్చినాఁడు.

2. హరిశ్చంద్రోపాఖ్యానము - మారన ఫలశ్రుతిలోఁ జెప్పినట్లు - "హరి శ్చంద్రు నుత్తమచారిత్రము" చెప్పుటకే పుట్టినట్లున్నది. ఆమహారాజునకు సంబం ధించిన వివరములను మాత్రము పురాణకర్త సవిస్తరముగాఁ జెప్పుచుండును గాని యేమాత్ర మైనను అడుగు ప్రక్కకు వైచి యితరవిషయములను బట్టించుకొనఁడు. కనీస మామహారాజుగారి పట్టమహిషినామము గూడ పేర్కొనక పోవుటయే యందులకు సాక్షి. ఇఁక చండాలునిపేరును గూర్చియు, శైబ్యను విలిచిన బ్రాహ్మ ణునినామముగూర్చియు వేఱుగాఁ జెప్పవలయునా? కథార్థములలో బ్రాహ్మణ సేవలో శైబ్యపడిన యగచాట్లు గాని, యామె భర్తనుగూర్చి పడిన పరితాపము గాని, పుత్రునికిఁ బాము కఱచుటకుఁ గల హేతువును గాని యిసుమంత బైట పెట్టడు కథకుఁడు. కాని, నాయకుఁడైన హరిశ్చంద్రుని చరిత్రచిత్రణమున మాత్రము సర్వసూక్ష్మాంశములను శ్రద్ధతోఁ బరిశీలించి సంతరించినట్లు స్పష్టముగాఁ గనవచ్చుచున్నది.

3. మారన హరిశ్చంద్రుని చిత్తవృత్తిని దీర్చిదిద్దుటలోఁ గొంతసామర్థ్య మును బ్రకటించినాఁడు. ఆనేర్పంతయు ధీరోదాత్తుఁడును, ధర్మవీరుఁడు నైన నాయకునియందు కరుణరసదీప్తి కనువైన మనోవృత్తిని స్థాపించి, యది యతని ధీరత్వమునకును, ఔదార్యమునకును, ఉత్సాహశీలమునకును భంగము వాటిల్లకుండ తీర్చిదిద్దుటయందే కేంద్రీకరింపఁబడినది.

సామాన్యముగా వీరులగు నాయకులు సాధకు లనియు, సిద్ధు లనియు రెండు తెఱఁగులు. అపూర్వకార్యసాధనోత్సాహులై యడ్డంకుల నధిరోహించి పురోగమించి యారబ్ధకార్యసిద్ధిని గాంచు కార్యశీలురు సాధకులైనవీరులు. క్రియాబహుళము లైన యుద్ధాదులయందట్టినాయకులు కానఁబడెదరు. దానసత్యాదివీరములయందు సాధారణముగా సిద్ధు లైన వీరులు నాయకులుగా వర్ణింపఁబడుచుందురు. అందు

వారు తమసిద్ధులఁ బరీక్షింపఁ నేర్పడిన క్లిష్టపరిస్థితులమధ్య నలిగియు, కలఁగియు తాలిమిచే ధృతి వహించి తమసిద్ధిబలముచే కార్యసిద్ధిని బడసెదరు. సాధకునిచిత్త వృత్తి వార్షుకతరంగిణివంటిది. అది గట్లొరసి పారుచు కొండలను గుట్టలను సైతము తనప్రవాహవేగముచేఁ గోసియైనను తనగమ్యస్థలము చేరెడివిధమునఁ బ్రగతిశీలమై యుండును. సిద్ధునిచిత్తవృత్తి వర్షాకాలనదీప్రవాహగర్భమున నున్న స్థిరమైన గిరిరాజువలె క్షమాప్రధానమై యుండునని భావింపవచ్చును. హరిశ్చంద్రుఁడు సత్యధర్మాచరణమున సాధకకక్ష్యను దాటినసిద్ధుఁడు. తద్ధర్మమునందు గిరి వలె స్థిరుఁడు. కౌశికరోషసంజనితక్రోధముచే నుప్పొంగినశోకతరంగిణి యతనిఁ గలఁచివైచినను, వేదనాదవాగ్నిశిఖ లాపాదశిఖరము దహించినను అతఁడు క్షమామూర్తియై నిలిచియుండెను. చితిపై నెక్కినప్పుడు కూడ "నగియును నేనెన్నండు బొంకుపలుక, నాకిదియనిశ్చయం" బని నిశ్శంకగాఁ బలికిన నిష్ఠశాలి. పుటము పెట్టిన బంగారమువలె నతనియందలి వీరము దీప్తమై రాజించెను. ఈపద్ధతి ననుసరించి మారన హరిశ్చంద్రునిచిత్తవృత్తిని వీరరసానుగుణముగాఁ బోషించెను.

వీరమునకుఁ గరుణము విరోధ మని లాక్షణికులు చెప్పలేదు కాని పోషక రస మని మాత్రము గణింపలేదు. కరుణమునకు స్థాయిభావ మగు శోకమును లాక్షణికు లిట్లు నిర్వచించిరి.

''ఇష్టజనవినాశాత్ శాపాత్ క్లేశా చ్చ బంధనా ద్వ్యసనాత్ ఏతై రరవిశేషైః కరుణాఖ్య రస స్సముద్భవతి''-నాట్యశాస్త్రము.

''పుత్త్రాదివియోగమరణాదిజన్మా వైక్లబ్యాఖ్య శ్చిత్తవృత్తివిశేషః శోకః''-రసగంగాధరము. అట్టిశోకము ఉత్సాహభంజక మగును కావున వీరమున కది పోషకము కాదని వారి మతము. ఇది స్థూలదృష్టితో ననిన మాట. సూక్ష్మముగా నాలోచించినచో వీరరసప్రతీతిలోఁ గరుణమున నొకకొంతయవకాశము కలదు. లోకమున ననేకకార్యములందు ధీరోదాత్తాదినాయకు లపూర్వకార్యసాధకు లయ్యు నెడనెడ బంధుజనవియోగదుఃఖాదుల ననుభవించుట కాంచుచున్నాము. అర్జునుఁ డభిమన్యునిమరణవార్త విని శోకించును; శివాజీ తానాజీ వియోగమున దుఃఖించును. కాని వారిరువురును వీరవర్యు లగుటచే వారియందు తత్కాలశోకము తరువాత నపూర్వకార్యసాధనోత్సాహమునకు హేతు వయినది కాని వీరరసభంజకము కాలేదు; పైపెచ్చు కరుణము వీరరసజ్యోతికి స్నేహతుల్యమై భాసించినది. అట్టివిధము

కథార్థములపైనను, కవిసామర్థ్యముమీఁదను ఆధారపడియుండును. కావున నిష్ట జనవియోగమువలన గలుగు శోకము వీరునిహృదయమున నుత్సాహస్ఫూర్తిని బోషింపఁగలిగినచోట వీరమున కంగముగాఁ గరుణము వర్ణితమైనను దోషము కాదు. హరిశ్చంద్రునిచరిత్రమున వీరరసపోషకమైన కరుణము భాసించుట విశేషము. వనవాసాజ్ఞాతవాసములందు స్వీయదైన్యావస్థనుగూర్చి చింతించుచు నోరిమితోడఁ దన ధర్మోత్సాహమును బరిపోషించుకొనినధర్మరాజువలె హరిశ్చంద్రుఁడును విశ్వామిత్రక్రోధసంజనితములైన దుఃఖముల నెన్నింటి నైనను సహించి తనసత్యధర్మనిష్ఠను గాపాడుకొనినాఁడు. అతఁ డనుభవించిన ప్రతిదుఃఖానుభూతియు నతని ధర్మవీరప్రగతి కేర్పడిన యొక్కొక్కదృఢసోపానమువలె నీయుపాఖ్యానమున జిత్రింపఁబడినది.

హరిశ్చంద్రునిచిత్తవృత్తిని రెండుభాగములుగా నెంచవలయును. ఒకటి: అతనియందు సముద్రగాంభీర్యము దాల్చి స్థాయిగా నున్న మనోవృత్తి. రెండు; తత్తత్కాలోచితముగా నుద్విగ్నమై సముద్రతరంగములవలె లేచిపడు చిత్తవృత్తి. అందు మొదటిది జన్మవ్రతరూప మైన ధర్మము నాశ్రయించినది; రెండవది దేహధర్మము నాశ్రయించినది. సత్యధర్మవ్రతదీక్ష హరిశ్చంద్రుని జన్మవ్రతము. పురజన గురుజన. బంధుజనభార్యాపుత్రాదులయెడ నెరపెడి లౌకికధర్మము అతనిదేహధర్మము. జన్మవ్రతాచరణమున వీరుఁడె న్నడును శోకింపఁడు; శోకింపరాదు. ప్రతినాయకాదులచే నాయకునిదేహధర్మము బాధింపఁబడును. అట్టిపట్టులందు నాయకుఁడు శోకరసమగ్నుఁ డగును. కాని, ధీరుఁ డగుటచే దానినుండి తేరుకొని తనజన్మవ్రతమును రక్షించుకొనును. •అతనిజన్మవ్రతమే ప్రతినాయకహతమైనట్లు చిత్రింపఁబడినచోఁ గావ్యమున రసభంగ మేర్పడును. అనఁగా నాయకునిచిత్తవృత్తియందలి స్థాయిరూప మైన ధర్మము భజింపఁబడరా దని తాత్పర్యము. మారన యిట్టి రసశిల్పము నెఱింగి హరిశ్చంద్రుని స్థాయిసంచారిచిత్తవృత్తులను వివేకించి మొదటిది రెండవదానిచేఁ బుష్టినొందున ట్లౌచిత్యభరితముగ నిర్మించెను.

హరిశ్చంద్రుని సత్యధర్మప్రవృత్తిని లింగషట్కముచే నిందు మారన స్థాపించి రసానుగుణమైన కథానిర్మాణశిల్పమును బ్రదర్శించెను. కథారంభమున నాయకుని 'నిత్యసత్యవర్తి' యనియుఁ గథాంతమున 'నగియును నే నెన్నండును బొంకుపలుక నాకిదియ నిశ్చయం' బని పలుకువానిగాఁ జెప్పుటయు, కథయందు మాటిమాటికిని నాయకసత్యధర్మనియతిని బ్రస్తావించుచుండుటయు, ఫలమున —

'నీతితిక్షాతపస్సత్యనిష్ఠ కేను మెచ్చితి" నని ధర్ముఁ డనినట్లును, "నీనిరుపమసత్య ధర్మమహనీయత శాశ్వతదివ్యభోగముల్ దొరకొనియె న్నరేశ్వర!" యని మహేంద్రుఁ డనినట్లును బేర్కొనుటయు, నపూర్వసన్నివేశచారుత్వముచేత కథను నడిపించి తాత్పర్యమును వ్యంజింపఁజేయుటయు, విశ్వామిత్రహరిశ్చంద్రశైబ్యాది పాత్రముఖములందు సత్యప్రాశస్త్యమును గీర్తింపఁ జేయుటయుఁ, గథార్థము లన్నియు 'సత్యమేవ జయతే' యను నుపపత్తి కుపగమ్యమానము లగునట్లు నిబంధించుటయు నందులకు నిదర్శనములు.

5. కథాగతి కనుకూలములైన సన్నివేశములఁ గల్పించి, వాని కతి సహజము లైన హేతువుల నేర్పఱచిన శిల్ప మీయుపాఖ్యానమున మూలమునందు కంటె మారనయనువాదమునం దధికముగాఁ బ్రకాశితమగుచున్నది. మచ్చున కొకటి యీక్రింద నీయఁబడుచున్నది. విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిసామ్రాజ్యసంపదను గోరుఘట్టమున మూలమున నిట్లు కలదు:

"వినా భార్యాం చ పుత్త్రం చ శరీరం చ తథానఘ!
ధర్మం చ సర్వధర్మజ్ఞ యోయాన్త మనుగచ్ఛతి
బహునాత్ర కి ముక్తేన సర్వ మన్య త్ప్రదీయతామ్." —7. 28-29.

మారన యనువాదము :

శా. "నీ వేమిచ్చినఁ గాదన న్గానియెద న్వీరాగ్రణీ! ధర్మము
న్నీవు న్భార్యయుఁ బుత్త్రకుండు వెలిగా నీసర్వసామ్రాజ్యల
క్ష్మీవాల్లభ్యము మాకు నిమ్మనిన నిచ్చె న్నిర్వికారాననన
శ్రీవిభ్రాజితమూర్తియై సమధికప్రీతి న్హరిశ్చంద్రుఁడున్." —1. 163.

మూలమున విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిభార్యాపుత్త్రులను, శరీరమును, ధర్మమును విడిచి మిగిలిన సర్వమును గోరినట్లు కలదు. తెలుఁగున 'సర్వసామ్రాజ్యలక్ష్మీవాల్లభ్యము నభ్యర్థించినట్లు కలదు.' ఇందు ప్రతిపదము సార్థకమును, పూర్వాపరకావ్యార్థసమన్వయసమర్థమునై యొప్పుచున్నది. సామ్రాజ్యలక్ష్మిని గ్రహించిన తరువాత విశ్వామిత్రుఁడు "స్వామ్యం బలవదునే నీ వున్న మాకుఁ బార్థివముఖ్యా!" అను నభ్యంతరము చెప్పి హరిశ్చంద్రునిఁ బురి వెడలఁతరిమినాఁడు. ఇందు 'స్వామ్య'శబ్దము మూలమునం దున్నదే. సంపద వశమైనంతనే చాలదు; స్వామ్యమలవడవలయు ననుభావము విశ్వామిత్రుఁడు పూర్వమే యూహించి లక్ష్మీవాల్ల

భ్యము నర్థించి దానిని దత్తము చేసికొనినట్లు మారన వ్రాయుటచేత, ఇచ్చట హరిశ్చంద్రునియునికి విశ్వామిత్రస్వామ్యత్వసిద్ధి కంతరాయ మగుటచేతను సత్యధర్మనిరతుఁడైన యాచక్రవర్తి నిష్క్రమించుట తప్పనిసరి యైనది. కథలో నింతటి శక్తి 'లక్ష్మీవాల్లభ్యము' నర్థించుటలో నిక్షేపించినాఁడు మారన. దానితో నాగకమూలమునందు లేని రెండుచమత్కారములు చేసినాఁడు : మొదటిది : 'నీ వేమిచ్చిన గాదన న్గానియెదన్' అని యనుట. ఈవాక్యతాత్పర్యమును గాఢముగా భావించినచో హరిశ్చంద్రుఁడు దాన మిచ్చుచున్న సామ్రాజ్యవైభవమంతయు నారాజు వేడుకతో నిచ్చుచున్నట్లుగనే ముని తలంచినట్లు స్ఫురింపఁగలదు. ఈవాక్యము "దక్షిణకుఁ జాలినయంత (ధనంబు) మున్న యిచ్చినదిగా నెఱుంగు' మనెడి హరిశ్చంద్రుని వాక్యమునకుఁ గౌశికుఁడు కావించెడి వక్రవ్యాఖ్యానమున కుపోద్ఘాతముగా నున్నది. రెండవది 'వీరాగ్రణీ' యనెడు సంబోధనము. ఇది యనంతరకథార్థసూచి. చక్రవర్తియైన హరిశ్చంద్రుని సామ్రాజ్యవైభవమును మహర్షి హరించి యతనికి దానవీరుఁ డను కీర్తిని మాత్రమే మిగుల్ప నున్నాఁడను వ్యంగ్యము తత్సంబుద్ధివలన నేర్పడుచున్నది. మూలమున వాడఁబడిన 'అనఘ !' 'సర్వధర్మజ్ఞ' యను సంబుద్ధులు హరిశ్చంద్రునిగుణస్తుతిరూపములై యున్నవి. కాని, వానియందు శిల్పసార్థక్యము లేదు కావున మారన వానిని గ్రహింపలేదు.

6. విశ్వామిత్రునియం దంకురించి ప్రజ్వలించిన క్రోధభావముయొక్క క్రమోన్మీలనదశలను హరిశ్చంద్రుఁడు గుర్తించినట్లు మారన వర్ణించినాఁడు. అరణ్యమున మొదటిసారి 'విశ్వామిత్రుని నుద్యద్వైశ్వానరసదృశవైభవు నాధాత్రీశ్వరుఁడు బిట్టు గని' (1. 155) నాఁడఁట ! సామ్రాజ్యలక్ష్మీవైభవమంతయుఁ బరిగ్రహించి యాముని 'యుగ్రతేజుఁ' (1. 164) డై నాఁడఁట ! కాశీపట్టణమున బ్రథమదర్శన మిచ్చినవేళ 'నవారితతేజస్స్ఫురణోగ్రుఁడై' (1. 191) కనుపట్టెనఁట ! విశ్వామిత్రుఁడు ఋషియు, క్రుద్ధుఁడునై యుండుటచే తేజోమయునిగా వర్ణించుట సార్థకము. మొదట వైశ్వానరసదృశుఁ డనుటచే నాతనియందలి క్రోధభావోదయమును, రెండవసమాసమున దాని తైక్ష్ణ్యమును, తృతీయసమాసమున తద్దుర్నివారసమగ్రోగ్రమూర్తిని దశాత్రయమునందుఁ గ్రమవికాసరమణీయముగా మారన వ్యంజింపఁజేసి ప్రతినాయకరౌద్రస్ఫూర్తి నుపలక్షింపఁజేసినాఁడు.

7. కౌశికరోషవిస్ఫూర్తిని నతఁడు హరిశ్చంద్రుని సంబోధించువైఖరిచేత గూడ వ్యంజింపఁ జేసి మారన యొకయపూర్వరచనాశిల్పమును వెలార్చినాఁడు.

హరిశ్చంద్రుఁడు వేటఁ జాలించి విశ్వామిత్రునివైపు వచ్చుచు నచ్చట ఋషి యుండె నని యెఱుంగక యతనిని 'దురితాత్మ' (1. 152) డని పేర్కొనెను. దానికిఁ బ్రతిగా నారాజు కంటఁబడినంతనే యాముని 'ఓరిదురాత్మక !' (1. 156) యని మాటకుమాట వడ్డించినాఁడు. ఆరాజు వినయముతో మ్రొక్కి 'మునిజనాగ్రణీ !' (1. 157) యని సగౌరవముగాఁ బలుకరించినాఁడు. దానికి దీటుగా నామునియు నాతనిని 'నరేంద్రోత్తమ, (1. 160) యని యాశ్వాసించినాఁడు. దాన మదుగఁ బోవుచు నారాజును మునిరాజు 'వీరాగ్రణీ !' (1. 163) యని పిలిచి యతని సార్వభౌమత్వమును హరింపనెంచె నని సూచించెను; రాజ్యాపహరణానంతరము 'రాజా ! పార్థివముఖ్యా !' (1. 165) యను సంబుద్ధులచే నాతని సామాన్యక్షత్రియత్వమునే గుర్తించినట్లు మాటలాడెను. కాశీనగరమున హరిశ్చంద్రునితో విశ్వామిత్రుఁడు సంభాషించుచు నసలు సంబోధనలే చేయక యాతనియం దత్యనాదర భావమును బ్రకటించెను. ఆపాత్రను, తత్సంభాషణములను అంతజాగరూకతతో రచించిన మారన యేలనో 1 అ. 192, 205, 206, 207, 209 పద్యములలో విశ్వామిత్రునిచేత మహీతలేశ, నృప, ధరణీనాథ, అనఘా, భూవరా ! అను సంబోధనలు చేసినట్లు రచించినాఁడు. దీనినిబట్టి యాకవి యాశిల్పమును దనకావ్యరచనమున నుద్దేశపూర్వకముగాఁ జేసినది కాదని యూహింపవలసివచ్చుచున్నది. అయినను కథాకథనక్రమావిష్కారమున దొరలిన కొన్నిశిల్పము లసంపూర్ణము లైనను మహాకవిప్రతిభాశక్తిపై మన కున్న విశ్వాసముచేత వానిని గౌరవించుటలో దోసము లేదు.

8. భావస్పష్టతకొఱకు మారన స్వీయకల్పనావిలసితము లగు నలంకారముల నాయాస్థలములందుఁ జొప్పించి కథార్థముల నాస్వాదమధురములుగా నొనరించెను. ఉదాహరణమునకు :

1. ఉపమాలంకారము :

చ. అనినఁ జలించుచున్నృపతి యంగన కేలొకచేఁ దెమల్చి వే
చనఁ జన నేమి చెప్ప మునిచందము ? చేతిప్రచండదండ మె
త్తి నయ మొకింత లేక సుదతీతిలకంబు కృశాంగవల్లి నే
సె నిభము దొండ మెత్తి మదజృంభిత మై లత ద్రేయు చాడ్పునన్."

— 1. 184.

2. రూపకాలంకారము :

క. "చేతో, వననిధి పిండలి పిండుగ
ఘనచింతామంథరంబు గలఁపఁగ మదిలోన్."— 1. 193.

3. అర్థాంతరన్యాసము :

(అ) తే. గీ. "వెడలిపొ మ్మేల మాటలు వేయు ? రాజ్య
మేకముఖము గాకున్న మా కెట్లు చెల్లు ?
వినుము రాజ ! సూదికి రెండుమొనలు గలవె ?" —1. 166.

(ఆ) ఉ. "మాలఁడు వొంగి యమ్మునికి మానుగ సద్దన మిచ్చి పట్టి భూ
పాలుని నంటఁగట్టి యకృపామతిఁ గొంకక చేతికోలఁ బై
తో లెగయంగ వ్రేసి వెసఁ దోడ్కొని పల్లెకుఁ బో నేరికిం
గాలవశంబునం గలుగు కర్మఫలంబులు దప్పనేర్చునే?" 1.131.

9. మూలములోని సన్నివేశముల నొకించుక మార్చి కథార్థ పుష్టికిమారన పాటుపడినాఁడు. మూలమున హరిశ్చంద్రునిభార్య కాటికాపరిగా నున్న తనభర్తను బుత్రశోకాతిశయముచే నతఁడు మూర్ఛితుఁ డగునంతవఱకును గుర్తింపలేదని చెప్పఁబడి యుండగా మారన దాని నొకింత మార్చి వారిరువురును బ్రథమవీక్షణము నందే పరస్పరము గుర్తించుకొనినట్లు వ్రాసినాఁడు. ఈమార్పువలన శైబ్య హరిశ్చంద్రునిదైన్యస్థితిని వర్ణించుచు శోకించుట కవకాశ మధికముగా లభించినది. దాని వలన రసప్రయోజనమును, నాయకదశాపరిణామవర్ణనమును బ్రక్క నున్న మఱియొకపాత్రచేఁ జేయించు కావ్యప్రక్రియాప్రయోగమును సాధింపఁబడినవి.

శైబ్యాహరిశ్చంద్రసంభాషణమున స్వప్నవృత్తాంతమును మారన చమత్కారముగాఁ బ్రవేశపెట్టి (1. 263) కథయందలి నిర్వహణోన్ముఖావస్థను వ్యంగ్యముగా సూచించెను.

10. పుత్రశోకాతిశయముచేఁ బ్రాణత్యాగమున కుద్యుక్తుడైన హరిశ్చంద్రునిసంభాషణమును మారన మూలముకంటె సంగ్రహించి యౌచిత్యము పాటించెను.

శ్లో "నరకే నిపతిష్యామి కీటకః క్రిమిభోజనః
వైతరణ్యాం మహాపూయవసాసృక్స్నాయుపిచ్ఛిలే."

శ్లో. అసిపత్రవనం ప్రాప్య భేదం ప్రాప్స్యామి దారుణమ్
తాపం వా ప్రాప్స్యామి వా ప్రాప్య మహారోరవ రౌరవౌ.

శ్లో. మగ్నస్య దుఃఖజలధౌ పారం ప్రాణవియోజనమ్
ఏకోపి బాలకో యోయ మాసీ ద్వంశకర స్సుతః.

శ్లో. మమ దైవానుయోగేన మృత శ్చాపి బలీయసా
కథం ప్రాణా న్విముఞ్చామి పరాయత్తోస్మి దుర్గతిః.

శ్లో. అథవా నాస్తి సఙ్క్లిష్టో నరః పాప మవేక్షతే
తిర్యక్త్వే నాస్తి తద్దుఖం నాసిపత్రవనే తథా.

శ్లో. వైతరణ్యాం కుతస్తాదృగ్యాదృశం పుత్రవిప్లవే
సోహం సుతశరీరేణ దీప్యమానే హుతాశనే.

శ్లో. నిపతిష్యామి తన్వంగి క్షంతవ్యం కుకృతం మమ
అనుజ్ఞాతానుగచ్ఛ త్వం విప్రవేశ్మ శుచిస్మితే.

శ్లో. మమవాక్యం చ తన్వంగి నిబోధాదృతమానసా
యది దత్తం యది హుతం గురవో యది తోషితాః.

శ్లో పరలోకే సంగమో మే భూయా త్పుత్రేణ చ త్వయా
ఇహలోకే కుత స్త్వేత ద్భవిష్యతి మమేప్సితమ్.

శ్లో. త్వయా సహ మమశ్రేయోగమనం పుత్రమార్గణే
యన్మయా హసతా కించి ద్రహస్యేన శుచిస్మితే.

శ్లో. అశ్లీల ముక్తం తత్సర్వం క్షన్తవ్య మమయాచతః
రాజపత్నీతి గర్వేణ నావజ్ఞేయ స్సతే ద్విజః. —8. 226-236.

ధీరుఁడును, మితభాషియు నైన హరిశ్చంద్రుఁడు నిబ్బరము లేక సామాన్యునివలె రోదన మొనర్చినట్లు మూలమున గలదు. మారన కందు పాత్రౌచిత్యము కానరాలేదు. అందువలన దానిని సంగ్రహించెను, మారన మొదటియాఱుశ్లోకములలోని వివిధనరకబాధలను బ్రత్యేకించి పేర్కొనక రాజుచేత "నీదుర్మరణంబునం జేసి యనేకఘోరనరకంబు లైన ననుభవించెద" (1. 264) నని యనిపించుటయందే

వానిని వ్యంజింపఁజేసెను. 8. 232. 233, 234 శ్లోకములతాత్పర్యము "దానయజనయాజనగురుపూజ లొనరించినవాఁడ నైతినేని పరలోకంబున నైన మనమెప్పటియట్ల కూడియుండెదము''- అనువాక్యమున గుదించెను. 235, 236 శ్లోకములందలి మొదటిచరణముల ననువదింపక వదలెను. వానికి బదులు "వినుము! నగియును నే నెన్నండును బొంకు పలుక నాకిదియ నిశ్చయంబు" అను ముత్యమువంటి మాట యొకటి నాయకునివాక్కు నలంకరించునట్లు మారన రచించెను. శైబ్యయందు గర్వలేశము నెచ్చటఁ గానరాకుండ నామెను జిత్రించియుండుటచేఁ గాఁబోలు ''రాజపత్నీతి గర్వేణ నావజ్ఞేయ స్సతే ద్విజః' అను హెచ్చరిక నామె కీయ నవసరము లేదనియే మారన వదలినాఁడు; "నీ వరిగి యమ్మహీదేవుని దేవునిఁబోలె నారాధింపు'' మనుటలో హరిశ్చంద్రుని ధర్మనిష్ఠను వ్యంగ్యముగా స్థాపించినాఁడు.

ఇట్టి ప్రతిపదసార్థకమైన మారన రచనము ఔచిత్యదృష్టికి నికషోపలము !

—X—

# రాయలు - వర్ణనములు

సాహితీసమరాంగణసార్వభౌముఁ డనియు, ఆంధ్రభోజుఁ డనియుఁ గీర్తి గాంచిన శ్రీకృష్ణదేవరాయలు రచించిన 'అముక్తమాల్యద' ఆంధ్రమహాప్రబంధము లలో నొకటి. రాజకీయచరిత్రలో రాయల కెంతప్రాముఖ్య మున్నదో సాహిత్య చరిత్రలో నాతనికావ్యమున కంత ప్రచారమున్నది.

అముక్తమాల్యదకు విష్ణుచిత్తీయ మను నామాంతరము కలదు. ఆనామ ద్వయమునుబట్టి గోదాదేవివివాహమును, 'విష్ణుచిత్తునిచరిత్రమును ప్రధానముగా నిందు వర్ణింపఁబడు నని తెలియుచున్నది. కాని, యిందు ప్రసక్తానువశమున మఱి కొన్ని యుపాఖ్యానములు పొందుపరుపఁబడియున్నవి. అవి : యామునాచార్యచరిత్రము, ఖాండిక్యకేశిధ్వజసంవాదము, చండాలబ్రహ్మరక్షస్సంవాదము మొదలగునవి.

కావ్యములందు నిబంధింపఁబడు వస్తువిధమును స్థూలదృష్టితో సమీక్షించినచో ముత్త్రివిధముగా విభజింపవచ్చు నని తోచుచున్నది. ఒకటి : నాయికా నాయకులకు సంబంధించినకథనే ఆమూలాగ్రము పంచసంధులు పాటించి రచించుట; రెండు : కావ్యగతములగు పాత్రలు ప్రసక్తానువశమునఁ జెప్పుకొనుకథలను ఉపాఖ్యానములుగా వర్ణించి, కావ్యమునందు పొందుపఱచుట; మూఁడు : సర్వాంగసుందరముగాఁ జిత్రించినకథలను గొన్నిటిని గూర్చి ముత్యములపేరువలె నొకకావ్య హారము గ్రుచ్చుట. ఈమూఁడుమార్గములును సాహిత్యమునం దుచితగౌరవమును బొందియున్నవి. ఆముక్తమాల్యదలోని వస్తువిధము వీనిలో రెండవ తెగకుఁ జెందినది.

రాయలు ప్రబంధయుగమునందలివాఁడు. ప్రాచీనమహాకవులయొక్కయు, లాక్షణికాగ్రేసరులయొక్కయు భావముల నవగాహన మొనరించుకొనినపండితుఁడు; అనరవతసాహిత్యప్రపంచసంచారుఁడు: కవిపండితగాయకాదికళామూర్తుల నుపాసించిన తపస్వి; తత్త్వజ్ఞానసమన్వితుఁడు. అతనికావ్య మొకమహాప్రబంధము, విజ్ఞాన స్యందము, ద్వైతమతావలంబము.

ఆముక్తమాల్యదలో రాయ లెంతరసవేత్తగాఁ గానుపించునో అంతతత్త్వవేత్తగా భాసించును. 'నానృషిః కురుతే కావ్య' మ్మను ప్రాచీనులవాక్కునకును, 'No man was ever yet a great poet without being, at the same time, a profound philosopher (Coleridge) అన్న పాశ్చాత్యులనమ్మికకును సరియైన యుదాహరణము రాయలకావ్యము. తత్త్వవేత్త నియమసహితమైన జీవితమును నడిపి లోకమున కాదర్శప్రాయుఁ డగును. కవి నియమసహితముగా కావ్యము నిర్మించి లోకమున కాదర్శము పట్టును. ఈరెండు లక్షణము లొకనియందే సమన్వయమందినచో నతఁడువిశ్వశ్రేయోరూపముగా కావ్యమును సంతరింపఁగల దక్షుఁ డగును.

'విద్వత్స్వం స్తవనీయభవ్యకవితావేశ'ము[1] కవిని కావ్యరచనకుఁ బురికొల్పును. తదావేశఫలితముగా లోకోత్తరములైన భావములు శబ్దరూపముగా కవిముఖమునఁ బ్రవహించి రాగరంజితముగా, లయాత్మకముగా కావ్యరూపమును దాల్చును. కావ్యమునకుఁ గొన్నినియమములు కలవు. వానిని రసౌచిత్యములు చెడకుండ నితివృత్తాశ్రయముగాఁ దీర్చిదిద్దవలసినబాధ్యత కవికిఁ గలదు.

"నగరముఖ్యాద్యష్టదశవర్ణనములచేతఁ
బరగునదియును భవ్యప్రబంధ మనఁగ."

అని లాక్షణికోక్తి.

"అటు లష్టాదశవర్ణనాకలితమై యేపారు కావ్యంబు నం
తటఁ బాటించి తదర్థసంఘటనముం దర్కించి భావోదయ
స్ఫుటభేదంబు లెఱింగి తద్రసగతుల్ శోధించి యచ్ఛంపుమె
చ్చుటకుం దావలమై చకుక్యపతి సంశోభిల్లు నెల్లప్పుడున్."

అని విన్నకోటపెద్దన కావ్యాలంకారచూడామణియందు వ్రాసియున్నాఁడు. దీనిని బట్టి ప్రబంధమున వర్ణింపఁబడు వర్ణనలలో నిబంధింపఁబడినయర్థములను, వానిని బొందుపఱచిన క్రమమును దర్కించి, భావోదయస్ఫుటభేదములను రసపోషణమును శోధింపవలయు నని తెలుచున్నది. కావున ఆముక్తమాల్యదయందు 'తదర్థసంఘటన'

1. "Inspiration means a great golden flood of words pouring into poet's mind and marshalling themselves neatly into lines and stanzas." —W. H. Hudson.

మెట్లు సాధింపఁబడెనో యించుక – స్థాలీపులాకన్యాయమున – తడవిచూచుట యీ వ్యాసమునందు నాచేయుప్రయత్నము.

ఈకావ్యమునందు కథారంభమునుండి విష్ణుచిత్తుఁడు మత్స్యధ్వజుని వైష్ణవునిగా నొనర్చి తాను మఱల విల్లిపుత్తూరులోఁ 'దనచిరంతనతులసికాదామకరణదాస్యమును జేసికొనుచుఁ దత్పరత' నుండునంతవఱకు నొకఘట్టము. ఇందలికథ కడుసూక్ష్మము. విల్లిపుత్తూరునందు విష్ణుచిత్తుఁడను భాగవతోత్తముఁడు మన్నారు కృష్ణునకు మాలికాకరణకైంకర్య మొనర్చుచు, నిరతాన్నదాతయై, ద్వైతజ్ఞానియై యొప్పారుచుండెను. మధురయందు మత్స్యధ్వజుఁడను రాజు తనరాజ్యమును ఈతిబాధలు పొందకుండ పాలించుచున్నను విషయలోలుఁడై యుండెను. గ్రీష్మకాలావసరమున నొకనాటిరేయి వేశ్యాగృహమున కరుగు మత్స్యధ్వజుఁడు పరదేశి వైష్ణవుని ప్రబోధముచే నివృత్తిమార్గాసక్తుఁడై మోక్షప్రదాత యగు దైవమును గూర్చిన చింతను వహించెను. మన్నారుకృష్ణునిచే ననుజ్ఞాతుఁడైన విష్ణుచిత్తుఁడు పాండ్యసభలోని ప్రతివాదుల నోడించి, విష్ణుమహిమను స్థాపించి, మధురానాథుని వైష్ణవునిగా నొనర్చెను. దైవకృపకుఁ బాత్రుఁడై విష్ణుచిత్తుఁడు సువర్ణగృహమును బొంది, యంతకుఁ బూర్వముకంటె నధికమైనభక్తితో దేవుని భజించుచుండెను. ఇది మూఁడాశ్వాసములపై ముప్పదియేడు గద్యపద్యములలో వ్యాపించియున్న యితివృత్తము.

ఈఘట్ట మింత విపుల మగుటకు – ఇందు వర్ణింపఁబడిన వర్ణనములు, ఉపాఖ్యానములు కారణములు. అవి : ప్రథమాశ్వాసమునందలి విల్లిపుత్తూరువర్ణనము, ద్వితీయాశ్వాసమునందలి మధురానగరవర్ణనము, గ్రీష్మర్తువర్ణనము, తృతీయాశ్వాసమునందలి ఖాండిక్యకేశిధ్వజసంవాద మను నుపాఖ్యానము. ప్రథమాశ్వాసమున కథాత్మకములగు పద్యగద్యములు ముప్పదియైదై యుండగా నం దిఱువదియాఱు పురవర్ణనమునకు వెచ్చింపఁబడినవి. ఐదుపద్యములు విష్ణుచిత్తుని యింటిలోఁ జరుగు విందులను వర్ణించుట కుపయోగింపఁబడినవి. ఇట్లే ద్వితీయాశ్వాసమునందుఁ గల తొంబదియెనిమిదిపద్యములలో దాదాపు ముప్పదియాఱేసి పద్యములలో మధురానగర, గ్రీష్మర్తువర్ణనములు సేయఁబడినవి. తృతీయాశ్వాసమునఁ బదునాల్గవపద్యముమొదలు ఆశ్వాసాంతమువఱకు ఖాండిక్యకేశిధ్వజసంవాదమును, చతుర్థాశ్వాసమునఁ బదునేనుపద్యములవిస్తృతియందు అవతారవర్ణనమును వ్యాపించియున్నవి. అనఁగా మొత్తము 260 గద్యపద్యములలో దాదాపు 195

పద్యములు వర్ణనాదులకు, 65 పద్యములు మాత్రము ప్రస్తుతకథకును వెచ్చింపఁ బడిన వని ఫలితార్థము.

దీనినిబట్టి చూడఁగా రాయలకు వర్ణనలయందును, ఉపాఖ్యానములందును ప్రీతి యధిక మని యూహింప వీలగుచున్నది. కావ్యేతివృత్తమున నుపాఖ్యానమునకుఁ గల స్థానమేమి ? దానిని కావ్యకర్త యేవిధముగాఁ బ్రయోగించును ? దానివలన కథాశిల్పమున కెట్టిగౌరవ మాపాదింపఁబడు నన్నవిషయమును స్థలాంతరమున వివరించెదను. ప్రస్తుతము రాయలవర్ణనములఁగూర్చిన వస్తువును గొంత పరిశీలించెదను. ఈఘట్టమునందలి వర్ణనలు ప్రధానముగా రెండు. 1. పురవర్ణనలు. 2. ఋతువర్ణనము. వీనివలన గలుగు కథాప్రయోజనములను, వాని అర్థ సంఘటనమును గ్రమముగా నిరూపింపయత్నించెదను.

విన్నకోటపెద్దన నగరవర్ణనమునకు లక్షణ మిట్లు చెప్పెను.

కం. "దుర్గమపరిఖావరణని
సర్గబలానీకచతురచాతుర్వర్ణ్యా
నర్గళసంపద్వనజల
వర్గస్తుతి వలయు నగరవర్ణనమునకున్."

అష్టాదశవర్ణనములలోఁ బ్రథమముగాఁ బేర్కొనఁదగినది నగరవర్ణనము. కావ్యము నగరవర్ణనముతోఁ బ్రారంభించుటలో నొకయౌచిత్య ముండనోపును. సాధారణముగా నొకకార్యము నిర్వహింపఁబడుటకు దేశ(స్థల)కాలపాత్రములప్రభావము బలీయమై యుండును. కావున కావ్యమునందు నాయకుఁడు, అత డుండుస్థలము, అతఁ డుండుకాలము ప్రధానవర్ణ్యాంశములై నిలచును. ఇచ్చట స్థలమునకు సంబంధించినది పురవర్ణనము; కాలమునకు సంబంధించినది ఋతువర్ణనము.

ప్రాచీనులు నగరవర్ణనమునే కావ్యమునందు నిబంధించుటలో వారినాగరికతను వెల్లడించుకొనినను, జనపదముపై వారు ప్రసరించిన సవతిచూపును మాత్రము దాచుకొనలేకపోయిరి. కోటలు, అగడ్తలు, ఆవరణములు పట్టణమునకాభరణములు కాని జనపదమునకు అందనిమ్రానిపండ్లు. కాగా కావ్యమునందు వర్ణింపఁబడవలసిన చతుర్విధనాయకులలో ధీరశాంతుఁడు క్షత్రియుఁడును రాజచంద్రుఁడునై యుండనవసరము లేకపోవుటచేతను, బ్రాహ్మణాదులే యైయుండుటకవకాశ ముండుటచేతను, శృంగారవీరములతోపాటు శాంతాదిరసములుకూడ అంగిరసములుగా కావ్యములం దెడనెడ బ్రయోగింపఁబడుచు వచ్చుచుండుటచేతను,

తద్రసనాయకానుగుణముగా జనపదమును వర్ణింపవలసివచ్చినచో దానికిఁ బ్రత్యేక లక్షణములు లాక్షణికులు నిర్ణయించినట్లు కానరాదు. ఈస్థితిలోఁ బైని పేర్కొనఁ బడిన లక్షణములో దుర్గపరిఖావరణాదులను వదలివైచి మిగిలినవే జనపదవర్ణనమునకు లక్షణముగా గ్రహించి రని సమాధానపడవలసియున్నది.

కృష్ణరాయలు మన్నారుకృష్ణుని నివాసమైన విల్లిపుత్తూరును, పాండ్య మత్స్యధ్వజావాస మైన మధురానగరమును గ్రామముగా వర్ణించెను. అం దీ దక్షిణమధుర సాంద్రద్రుమమధుర ! విల్లిపుత్తూరు 'పాండ్యనగరోర్వీరత్నసీమంతము'. అనఁగా మధుర నగరమై, రాజనివాసమై యున్నను, విల్లుపుత్తూరు పాండ్యభూరమణికి రత్నసీమంతము వలె శోభిల్లుచున్న దని యర్థము. రాయలు విల్లుపుత్తూరున కొకానొకవైశిష్ట్యము నాపాదించుచున్నట్లు తేటతెల్ల మగుచున్నది. ఈవిధముగానే ఈనగరద్వయవర్ణనమునందలి యర్థసంఘటనమును బరిశీలించినచో నీసత్యము బయలుపడఁగలదు.

ఈతారతమ్యపరిశీలనమునందు నగరద్వయమున సామ్యములు కొన్ని కానఁబడుచున్నవి. భవన, వన, శకుంత, పవన, వేశ్యాదుల వర్ణనములు రెండింటియందును నిర్వహింపఁబడినవి. అం దొక విచిత్రమైన సమన్వయసూత్రము వ్యాపించి యున్నది. రాయలు విల్లిపుత్తూరునందు వీచు వాయువుల నిట్లు వర్ణించినాఁడు.

మ. "పొలయుం గాడ్పు లుదజ్మహోలయవదంభోజాక్షవక్షస్థల
స్యలఘుస్రజ్మకరందబిందువులఁ బణ్యారంపుఁ బుణ్యంపుఁ గం
పులఁ దాపత్రయి మీఁటి వీట నటనప్రోద్యోగసజ్జీభవ
ల్లలనావర్జితకైశికక్షరితకల్హారాళి నల్లార్చుచున్."

వాయువు సర్వాంతర్యామి; మానవుని ప్రాణముయొక్క యునికికి చిహ్నము. దాని నిట్లు వర్ణించి, రాయ లేయితరప్రబంధకవులు ఊహింపలేని మాహాత్మ్యమును వాయువునకుఁ గల్పించినాఁడు. చరాచరవిశ్వసత్యస్వరూపదర్శనానుభూతికల్గిన మహామేధావి యగుట యతని కట్టివర్ణనాశక్తి లభించినది. ఆవాయువు తాపత్రయహారి. ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము అనునవి తాపత్రయ మనఁబడును. వీనిని మీటునంత శక్తిని ఆగాలి 'ఉదజ్మహోలయవదంభోజాక్షవక్షస్థలస్యలఘుస్రజ్మకరందబిందువుల' నుండియు, 'పణ్యారంపుపుణ్యంపుకంపుల' నుండియు గ్రహించినది. ఇచట నొక విచిత్ర మున్నది. కోవెల విల్లిపుత్తూరున కుత్తరపార్శ్వ

మునఁ గలదు. సాధారణముగా ప్రబంధములందు వీచునదిగాఁ జెప్పఁబడునది దక్షిణానిలము. ఇచ్చటను ఆమలయానిలమే వీచుచున్న దని గ్రహించుచో దక్షిణము నుండి యుత్తరమునకు వీచుచున్న ఈగాలి గొప్పదైన యాదేవాలయగర్భమున సరాసరి ప్రవేశింపఁగలదు. అచ్చట అంభోజాక్షుఁ డమలమూర్తియై నిలచియుం డును. ఆతనియురముపైఁ దులసికాదామము లలంకరింపఁ బడియున్నవి. తులసీ దళములనడుమ పూలగుత్తులు కూర్పఁబడియున్నవి. లేనిచో నలఘుస్రజ్మకరంద బిందువులు తులసీదళములనుండి పుట్టవు. దేవునిముందు పణ్యారములు నివేదనకై యుంపఁబడినవి. వానిపైఁ బ్రసరించినగాలి మకరందశైత్యమును, పణ్యార ములసౌగంధ్యమును వహించినది. మఱల పట్టణమున వీచుటకు బయలుదేరినది. తత్పవిత్రవాయుప్రసారప్రదేశమంతయు తాపత్రయరహిత మైనది.

గర్భాలయమునుండి గ్రామమువైపు వీచుచున్నగాలి దేవతారాధనానంతరము కోవెలను వీడివచ్చు భాగవతోత్తమునిఁ దలఁపించుచున్నది. ఇట్లనుటలో నొక యౌచిత్యమున్నది. భాగవతోత్తముఁడు ప్రకృతికన్న పరంబైన తనయాత్మను తెలిసికొని, ఆత్మకంటె పరుండైన పరమేశ్వరు నెఱింగి శేషశేషిత్వసంబంధ ముతో నాతని నుపాసించి యాతని కృపకుఁ బాత్రుఁ డయి యఖర్వనిర్వృతిని గాంచును. అట్టిది 'బహుజననకృతసుకృతఫలరూపము'. ఆత్మ ప్రకృతికన్న వేఱని తెలిసిన జ్ఞాని మోక్షప్రదాత యగు దైవమునుముందు మోకరిల్లి త న్నాతని కంకితము చేసికొనును. అప్పుడు

> "అనన్య శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
> తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహమ్."

అని ప్రతిజ్ఞచేసిన శ్రీకృష్ణభగవానుఁడు తనమాటను నిలిపికొనును. ఇట్టి తత్త్వ మిందు ధ్వనింపఁబడినది. పణ్యారములు పుణ్యవాసనలు కలవి. గర్భాలయమునం దున్న యితరసుగంధద్రవ్యములను వేనిని బేర్కొనకుండ వీనినే పేర్కొనుటలో రాయలకుఁ బ్రత్యేక మైన ప్రయోజనము కలదు. పుణ్యవాసనాభరితమైన పణ్యా రము భగవదంకితమైన భాగవతోత్తముని యంతరాత్మవలె శోభించుచున్నది. దేవుని వక్షస్స్థముపై వ్యాపించిన తులసికాదామమునుండి స్రవించుచున్న మకరంద బిందుసందోహము భక్తవత్సలుని కరుణారసమువలె రంజిల్లుచున్నది. అట్టిమక రందమునందలి శైత్యము వహించినవాయువు పణ్యారంపుపుణ్యంపుకంపుల

గ్రహించి జీవన్ముక్తుఁడైన భాగవతోత్తమునివలె భాసించుచుండెను. జీవన్ముక్తుఁడు సంసారమునందు తామరాకుపై నీటిబిందువువలెఁ జరించుచు జీవులకుఁ దరణో పాయమును గల్పించు ధర్మమును బోధించుచుండును. విషయలోలు లయి సంసార బంధమునఁ జిక్కి దుఃఖితులైన వారి తాపత్రయములను దైవదత్తము లైన మహిమలచే మాన్పి దైవపరమైన ప్రవృత్తిని వారిలో రేకెత్తింపఁజేయును. అట్లే వాయువు తాపత్రయములఁ బాపి, 'నటనప్రోద్యోగసజ్జీభవల్లలనావర్జితకైశికక్షరిత కల్హారాళి నల్లార్చు' ననుటలో దేవదాసీజనములు తమనాట్యనీరాజనములతో దేవతా రాధనము చేయఁబూనఁగా వారినిఁ బ్రోత్సహించుచున్నట్లు కానఁబడుచున్నది.

మన్నారుకృష్ణుని తులసీకాదామమునుండి ప్రసరించిన వాయుమాహాత్మ్యమే యింతటిదై యుండ నాపురాణపురుషునిమహిమ లెన్న నెవ్వరితరము? అతఁ డాయూరి యుత్తరమున మిట్టపైఁ గూర్చుండి తనకమలాయతనేత్రములతో వీటిని చల్లని చూపు చూచుచుండును. ఆవీటియందలి ప్రతిజీవియొక్క ప్రవృత్తియు నాదేవుని ప్రభావముద్రను వహించియుండును. విల్లిపుత్తూరులోని సువర్ణసౌధములపై నవ రంజిత్రాతలతోఁ జిత్రింపఁబడిన లక్ష్మీవిగ్రహములు, తత్పార్శ్వములందు శంఖ చక్రములు ప్రత్యక్షము లగును. ఉద్యానంపులోఁద్రోవలందు నడచు మన్మథసాయక ములవంటి ద్రవిడాంగనలు సైతము దివ్యప్రబంధానుసంధానము గావించుచు, నచ్యుతమజ్జనార్థము జలఘటములను, పూజార్థ మంబుజములను గైకొని చనుచుం దురు. కొందఱయిండ్లలో వనజాక్షుద్వంద్వ మధివసించిన రథములు చిత్రింపఁబడి యున్నవి. కుసుమబాణునిసైతము కువిటునిగాఁ బరిగణించెడి యాయూరివేశ్యలు శ్రీకార్యపరులను గాంచినప్పు డంజలి ఘటించి మ్రొక్కుదురఁట! వారిచెవులు శ్రీలఁట! సాయంకాలములందు కేళివనములందు 'కులాయగమనప్రోత్థితద్విస్వర స్థాయిశ్వేతగరుత్పటపటాత్కారము'ను క్రేంకారమును మన్నారుకృష్ణునికోవెలలో మ్రోయు దుందుభిధ్వనులకు, కాహళికాస్వనమునకు ప్రతిస్వనములుగా నుండునఁట! రాత్రులందు మలయపవనాహతిచే మ్రోగిన దేవాలయధ్వజస్తంభముయొక్క బంగా రపుచిఱుగంటలసవ్వడికి తత్ప్రాంతశకుంతము లదరి రొదసేయ నావీట దంపతులు వేకువ యయ్యె నని భ్రమించి, ప్రణయకలహములు మాని కూడుదురఁట! ఆదేవా లయమునకు సంబంధించిన రురుశాబము నైనను ద్రవిడకన్యలు గౌరవముగాఁ జూచుచుందురు. ఇ ట్లావిల్లిపుత్తూరునందలి ప్రజాజీవిత మొకానొకవిధముగా నాదేవునిప్రభావముతోఁ బెనవైచికొనిపోయినట్లు వర్ణించుట రాయల ప్రతిభావిశేషము.

అట్లు వర్ణించుటచే నావర్ణనము సార్థకమును, రసపోషకము నగుచున్నది. అం 'దక్రాంతయోగాందూబద్ధమధుద్విషద్ద్వీరదుఁ' డగు విష్ణుచిత్తుఁ డను సార్థకనామధే యుఁడు నివసించుచుండుట యబ్బురము కాదు కదా !

మధురానగరవాతావరణము వేఱు. ఆనగరమునందు వీచు మలయమారుత స్వభావము వేఱు. మదేభగంధమును, సురతశ్రమజ మగు కామినీమృదుగండఘర్మము నందలిశైత్యమును, కస్తూరివాసనను వహించి గంధవహుఁ డానగరమునందుఁ దన మిత్రు లగు నెమిళ్ళరెక్కల నిమురుచు మందగమనమున వీథులవెంట నడచునఁట ! అందువాయువు ఉత్సాహము, స్త్రీలౌల్యము, భోగపరాయణత్వముకల్గిన ధీరలలితుఁడగు రాజకుమారునివలెఁ గన్పడి, శత్రుభంజనులగు మిత్రులను గౌరవించుచున్న ట్లున్నది. అవ్విధముగా నచ్చట వర్ణించుటలో రాయ లౌక యౌచిత్యమును బాటించియున్నాఁడు.

పాండ్యరాజు మత్స్యధ్వజుఁడు. ఆతని పేరునందే మీనాంకుఁడుమూర్తీభ వించినాఁడు. ఇఁక నాతనిఁగూర్చి వేఱుగాఁ జెప్పఁ బనియేమి ? ఎంత సమర్థుఁడైన చక్రవర్తియైనను విషయలోలుఁ డాతఁడు. "యథా రాజా తథా ప్రజా" అన్నట్లు అతనిపరిపాలనలో నున్న మధురానగరప్రజ కూడ ఆతనిస్వభావమును ముద్రించు కొనియున్నది.

"ఏవీట సతులపాలిండ్లపై గంబూర
నవహారముల చిప్పకవుచు మాన్చు"

నని వర్ణనము ప్రారంభించుటలోనే మధురానగరశృంగారవిలాసము ద్యోతక మగు చున్నది. లోకసాక్షు లగు సూర్యచంద్రులుసైత మాపట్టణమునఁ జరించుచు 'ఉదుటు గుబ్బలు గల తల్పుటురము సూచి' మోహితు లగుదురఁట ! అచేతనములందు సైతము కామినీత్వము సాధించుకొని దేవతలే దైన్య మందినప్పుడు ఇఁక నరుల మాట యేమి ? స్వర్గసౌధములఁ దలదన్ను మేడ లానగరమునఁ గలవు. అట్టి భవ నములందు వసించు నాగరికుల నిత్యజీవితమునందు లేశమైనను విమలవ్యాపారము కానరాదు. మేఘగర్జనముగూడ వినఁబడనంతటి యెత్తుపై నివసించుచున్నను వారు నక్షత్రమౌక్తికహారములను ధరించుచు క్రీడాసక్తులై యుందురు. అచ్చటి దంపతుల ప్రణయకలహములను నివారించుట సప్తర్షి వృద్ధభార్యల యుద్యోగము. చంద్రరేఖ సైతము పూదండ తగిలించుకొను నొంకెగా మారిపోవు నచ్చట ! ఆవీట నడ యాడు పుష్పలావికల నర్మవచనములలోఁ బచ్చిశృంగారము కస్తూరివలె గుబా

శించుచుండును. అచ్చటి పణ్యయువతులు సురతవైయాత్యనిధులు. 'కంతుకలహోన్మాదము' వారి కెడత్రెంపు లేదు. ఆయూర నున్న ఏనుఁగులు తమప్రియురాండ్ర మరిగి అతికష్టమునఁ బురము సేరునఁట! ఇట్లు వర్ణించుటచే రాయలు మధురను అచ్చంపుమన్మథరాజ్యముగాఁ జిత్రింప నెంచి కృతకృత్యుఁ డైనట్లు కానఁబడును.

సర్వసౌఖ్యవిలాసావాసమైన ఆపట్టణమున గ్రీష్మర్తువు ప్రవేశించినది. ఋతురాజమును, ఋత్వగ్రగణ్యమునైన వసంతము మొట్టమొదట మోసులెత్తుటకు బదులు గ్రీష్మము ప్రథమముగా నీప్రబంధమండలమున దిగుచున్నది. ఊరకరారుకదా మహాత్ములు! కారణము లేని కార్యముం డదు కదా!

"అట్టి వేసవి బెడిదంపువెట్ట కతన
హస్తము సెమర్పసారెకు లస్తకంబు
దుసికిలఁగఁ గాదె సవరింప వసము గాక
పుష్పబాణుని చెఱకువి ల్పుడమిఁ బడియె."

అనుపద్యమున రాయలు తనగ్రీష్మర్తువర్ణనారహస్యమును సూచించియున్నాఁడు. పుష్పబాణుని చెఱకువిల్లు చేయిజారి క్రిందఁబడినది. అతని చేతులు విల్లు పూనినచోఁ జెమర్చి యుండుచుండెను. ఇట్లనుటలో– రతిప్రేరణకు హేతుభూతమైన సాధన మోటువడినమనోభవుని లోకము వహించియున్నదని భావము. ఇట్లే గ్రీష్మర్తువర్ణనమంతయు జీవప్రవృత్తియం దాసమయమున వ్యాపించిన నిస్సారమును, రతివైముఖ్యమును బ్రదర్శించుటకై వినియోగింపఁబడినది. అధికాతపసంతప్తజీవులగు దంపతుల పొందుల నీవిధముగా వర్ణించినాఁడు రాయలు :

"హృదయము లెప్పుడున్ గదియకే తఱచౌ వెడకౌఁగిలింతలన్
గదిరెడు మేలుకార్యములఁ గల్గక మాటలయందె కల్గు పె
న్జదురులు వట్టిశైత్యములుఁ జాల ఘనంబయి యుండు వేసవిన్
బొదలఁగ నిల్చె దంపతులపొందు లనార్యులపొందు కైవడిన్."

"అనార్యుల పొందుకైవడిన్" అను నుపమానమును వాడుటలో రాయలు రమణీయార్థప్రతిపాదన మొనర్చినాఁడు. హృదయములు కదియకుండుటలో, మేలుకార్యములు కలుగకుండుటలో, చతురవచనములలో, వట్టిశైత్యములలో దంపతుల రతివైముఖ్యమును రసవత్తరముగాఁ దీర్చిదిద్దినాఁడు. నిదాఘతాపమునకు సొమ్మసిల్లిన

యువతీముఖచంద్రుఁడు తనయోషధీనాథత్వమును వినియోగపఱచి కంతునితోఁ బాతాళమునకుఁ బారిపోవుచున్న కమ్మనిపిల్లతెమ్మెఱనుశీరపుతాళవృంతములతో బలిమిని దెప్పించుకొని యనుభవించుచున్నాఁడఁట! మలయపవనము నోచుకొనని మావపునిమనము మరునిబాసలమాటలే మఱచిపోయినది. అట్టియనుభూతియే సకల సత్త్వములందును వ్యాపించుటచే నవి నీరసములై నిజధర్మములందు నిర్లిప్తత గాంచి యున్నవి. మంటగాలిని మేయలేక సప్తాశ్వనిరథపుపగ్గములగు పాములు ముడులువీడి డుల్లవోయినవి. రసపూరితములగు కూపవితానములు రసశూన్యములై రజశ్చకాకృతితో గగనమున కెగురుచున్నవి. నదీలలామలు 'అబ్ధిరాడ్విరహమున' 'అధ్వనీకృత'కూపజలప్రతిబింబిత భానుబింబాకాకృతిరూపముక్తాహార గళసీమలై తమకు జీవనాధారభూతుఁ డగు మేఘమునకు లంచముఁ బెట్టుచున్నవి. బకోటకులము నకు జానుదఘ్నములగు చెఱువులు, ఉలుచలు, చిఱుతగుల్లలు, మీఁటగు మీనము లును కరువైపోగా నెత్తెల బురదలోఁ జనిపోయిన బొమ్మడాయలచేపలను తిని డొక్కలు పూడ్చుకొనుచున్నవి. జలదేవతలు చలిపందిళ్ళను శరణుజొచ్చిరి. కాళ్ళు పడిపోయినమన్మథుఁ డచ్చోటనే యొకమూల కుక్కిమంచ మెక్కినాఁడు. 'కట్టా విక్రియ నావి రెగయు' నట్టి వేసవిమధ్యాహ్నమందు విరియపూచిన మల్లెమొగ్గలు అగ్గిబొబ్బలవలెఁ గానుపించుచున్నవఁట! వెన్నెలరాత్రి వేడితో వేగి కాలినచాఁపట్టు వలెఁ జూపట్టునఁట! వేకువజామునకుఁ గాని నేల కొంత చల్లారదు. అప్పటికి గాని సొమ్మసిల్లి కునుకుతీయు దంపతుల డెందాలలో కంతుని చందాలు చిందులాడవు; అప్పుడుగాని ఆరామములందు 'అంధుయంత్రనతిక్రుత్ప్రోద్గీతగేయౌఖములకు' తాళము వేయు 'కుంభోంభనోద్భూతాంబుధ్వనులు' వినఁబడవు. కాని, యదియు క్షణికము. ప్రొద్దుపొడుపుతోఁ బ్రాణులు తల్లడిల్లి దీర్ఘికలందు కుత్తుకబంటినీటిలో మునింగి పవలెల్లఁ దపనఁ దీర్చికొందురు; ఎడనీళ్ళు, చెఱకురసములు, వడపప్పు పానకములు విధివిరామములు లేక సేవించుచుందురు.

ఇట్టి గ్రీష్మమున మత్స్యధ్వజుఁ డొకనాటిరాత్రి భోగినీసంగతికి బయలు దేరెను. అతఁ డెండకన్నెరుగనిభోగి. పైపెచ్చు పన్నీట మునిఁగితేలినాఁడు. మక రందపుసోన లుట్టిపడు పాటలపుష్పములను ధరించినాఁడు. శరీరము శైత్యము వహించినది. కాని గ్రీష్మకాలప్రభావమున హృదయోత్సాహము దస్సియే యున్నది. అతఁ డాభోగినిదరికిఁ జేరినను హృదయములు కదియునన్న ధైర్యము లేదు. వట్టి శైత్యములు ఘనము కాక మానవు; చివరకు ఎట్టిమేలుకార్యములు జరుగకపో

వచ్చును. అట్లున్నది కాలమహిమ ! అట్టివిచిత్రావస్థయందు రాజునకు పురోహిత ధర్మబోధకంబగు పరదేశివిప్రుని ప్రబోధ మాత్మ గిల్కొనినది: అనఁగా హృదయమున గాటముగా నాటుకొనిన దన్నమాట ! భావిహితార్థసూచకముగా హృదయకుహరమున మారుమ్రోగినదన్నమాట ! బహుశః అది యేవసంతఋతువో యైనచో నట్టి ప్రబోధము మనసునకు హత్తుకుండునేమో ! అందువలననే గ్రీష్మ మిచ్చట ప్రవేశపెట్టఁబడుట. ఆత్మ కామప్రవృత్తియందు శోషించి యున్నది. కావుననే 'అందని ద్రాక్షపండ్లు పుల్లన' యని తనకోర్కెను త్రోసివైచి సత్యాన్వేషణ కుపక్రమించినది. ఐహికభోగము లనెడి మత్తునిద్రలో నున్న జీవుఁడు గ్రీష్మ మనెడిజఠరాగ్నితన యందు ప్రకోపింపఁగా జ్ఞాన మనెడి మాతృమూర్తి భిక్షకు కేకవేయ, చివాలున లేచి పరుగెత్తినాఁడు. ఆకలిమంట తీవ్రమగుటచే తల్లిని త్వరగావడ్డించు మని వేమారు వేడినాఁడు. ఆకొన్నబిడ్డకు అన్నముపెట్టుట తల్లియొక్క విధి. అట్లే తత్త్వభిక్ష వేడిన భక్తునిఁ బ్రసాదించుట దేవునివిధి. అట్లు కానిచో 'అక్కఱకు రాని చుట్టమువలె. మ్రొక్కిన వర మీనివేల్పును గ్రక్కున విడువం' బడును. అందువలననే విల్లిపుత్తూరునుండి లోకమును వేయికన్నులతోఁ గాంచుచున్న మన్నారుకృష్ణుఁడు విష్ణుచిత్తుని మధురకంపుట కంత వేగీరపడుట. గజేంద్రవరదుని కారుణ్యభావము కరిగిజాలువారినది; భక్తునిజీవిత ముద్ధరింపఁబడినది.

ఇచ్చట కథలో నొక చమత్కారము కలదు. భక్తవత్సలుఁడగు భగవంతుఁడే స్వయముగా రాజునకు దర్శన మిచ్చి వైష్ణవునిగా నొనరింపక విష్ణుచిత్తున కాపని నంటగట్టుచున్నాఁడు. పాండ్యసభయందు దేవునిమహత్త్వము పండిత వాదములపై నాధారపడియున్నది. వాదమునందుఁ దనమోక్షప్రదానసామర్థ్యము నిరూపితము గాకపూర్వమే మత్స్యధ్వజునకుఁ గృష్ణుఁడు దర్శనమిచ్చినను అతని హృదయము సమాధానపడదు. కావున ఇతఃపురాపఠితశాస్త్రగ్రంథజాత్యంధుఁడైన విష్ణుచిత్తునే శాస్త్రవాదమునకుఁ బంపఁనుంకించుట. "వా దితనిచేత గెలిపింతు; నాదు మహిమ ముఖిద కనుము !" అని చెంత చిఱునగవుచేఁ జెన్నారు లక్ష్మిముందు ప్రాభవముగాఁ బల్కుట ! అట్లే తనపంతము, తనపందెము నెగ్గించుకొనినాఁడు. భక్తవాత్సల్య మొకవైపున్నను అది ప్రధానముగా నాత్మగౌరవమునకు సంబంధించినవిషయము. ధీరులకు మానము ప్రాణముకన్న మిన్నకదా !

భక్తుఁ డనన్యచింతతోఁ గైవల్యముకొఱకు పరితపించునపుడు దైవము తానే ఆచార్యరూపమున నాతనికిఁ దరణోపాయము చూపి, అతఁడు పరిపూర్ణాధి

కారము గాంచిన తరుణమునఁ దనదివ్యదర్శన మొసఁగి మోక్షపద మందించును. ఆమార్గముననే మన్నారుదేవుఁడు విష్ణుచిత్తుఁ డను ఆచార్యునిరూపమున రాజునకు మూలమంత్రపూర్వకముగా 'ద్వయము'ను ప్రసాదించి కైవల్యమార్గమును సూచించెను.

"లోకోత్తరవర్ణనానిపుణః కవిః" అని మమ్మటుఁడు. కవి వర్ణించుట కొక వస్తు వుండవలెను. ఆవస్తువు ద్వివిధము. తాను, తనకన్నినితరమైనది. తాననఁగా నిచ్చట తనశరీరము, తనభావన, తనప్రవృత్తి అని భావము. తనకన్న నితరము సర్వస్వము. దానిని ప్రకృతి యనియు, అందలిసత్యస్వరూప మగు పరమాత్మ యనియు వింగడింపవచ్చును. కవికి వీనిని లోకోత్తరముగా వర్ణించుటకుఁ దత్సంబంధమైన యనుభూతి యవసరము. వ్యక్తిగతానుభవమే సాహిత్యమున కాధారము.[1] ఆయనుభవ మైంద్రికమే గాక భాగవతమునై యుండవచ్చును. అధికానుభవజ్ఞుఁడు వ్యుత్పన్నుఁ డగును. వ్యుత్పత్తి అపూర్వవస్తునిర్మాణశక్తి యగు ప్రతిభను ప్రకాశింపఁజేయును. అట్టిప్రతిభతో అభ్యాసవశమున కవి యపూర్వవర్ణనాత్మకమైన కావ్యమును సృజించును.

కావ్యమున భావము శబ్దార్థముల నాశ్రయించి యుండును. శబ్దవృత్తులు అభిధ, లక్షణ, వ్యంజన మను నామములతో నొప్పారుచున్నవి. అందు వ్యంజన ప్రధానమైనకావ్య ముత్తమము. దానినే ధ్వన్యాత్మక మనియు నందురు. అనఁగా కావ్యమున వాచ్యమైన యర్థముకంటె దానిచే స్ఫురింపఁ జేయఁబడు వ్యంగ్యార్థమునకు ప్రాధాన్య మొసఁగిన గ్రంథమన్నమాట! ఈయభిప్రాయమున ప్రాచ్యపాశ్చాత్య పండితులయభిప్రాయములు సమన్వయించుచున్నవి. ధ్వనిసిద్ధాంతప్రవర్తకుఁడైన ఆనందవర్ధనుఁడును, లోచనవ్యాఖ్యానకర్త అభినవగుప్తుఁడును భావించినట్లే కావ్యవిషయమున "By Poetry we mean the art of employing words in such a manner as to produce an illusion on the immagination, the art of doing by means of words what the painter does by means of colours" అని Macaulay యు "For Poetry, idea, is everything; the rest is a world of illusion, of divine illusion. Poetry attaches its emotion to the idea,

1. Personal experience is the basis of all real literature -W. H. Hudson.

గునఁ బ్రాచుర్యముగా వినఁబడునవి వీరి పేర్లే. క్రీ. శ. 1892 లో కాకినాడలో విశాఖానక్షత్రద్వయమువలె దివాకర్ల తిరుపతిశాస్త్రిగారును, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారును జంటకవులై ప్రకాశించి శతఘంటకవన సరస్వతిని సాక్షాత్కరింపఁ జేయుటతో జాతి కొాక కనువిప్పైనది. నాఁడు మొదలీ కవిద్వయము శ్రీకాకుళము మొదలు చెన్నపట్టణము వఱకుఁ గల తెలుఁగుదేశమున నవధానకవితాయాత్రలు చేసి ఆంధ్ర భారతికి బంగారుపల్లకిసేవను జరిపించుటతో తెలుఁగుబిడ్డల రసహృదయములు సారస్వత భక్తి భావముతో పులకరించి, పొంగులువారినవి. వీరిపే ర్లుచర్చించినంత మాత్రముననే తెలుఁగువారి నాలుకలపై ఛందస్సు లాస్యమాడినది; వీరిని దర్శించి నంత మాత్రముననే తెలుఁగుకవులకు జంటకవిత్వము నాశువుగా నల్లవలెననెడి కోరిక లీరికలెత్తినది. వీరి తర్వాత తలలెత్తిన జంటకవులకు తిరుపతివేంకటకవులే ఆదర్శప్రాయులు. ఒక అర్ధశతాబ్దము వఱకు జంటకవు లనెడి భావము సారస్వత లోకమును ముచ్చట మురిపెములతో ముంచెత్తినది.

తిరుపతి వేంకటకవు లన్న పేరునకున్న కుదిరిక తెలుఁగున మఱి యేజంటకవుల పేర్లకును లేదు. దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి అనుపేర్లలోని ప్రధాననామములకైన విశిష్టమైన కలయిక రమణీయార్థదాయకముగా నీరక్షీరన్యాయమున ఏకరూపముగా భాసించినది. ఇది సాక్షాద్బ్రహ్మ (చెర్ల బ్రహ్మయశాస్త్రిగారు) కలిపినజంట ! ఇఁక మిగిలిన జంటకవులపేర్లు తిలతండుల న్యాయమునే వహించినవి కాని నీరక్షీరన్యాయమును పొందఁజాలక పోయినవి. కొందఱి జంటకవుల పేర్లు రెండు రెండుగనే ఉండిన అందముగా నుండును గాని కలిపెద మన్నను అతుకవు. కొంచఱివి ప్రధాననామము లతుకక మొదళ్ళు చిగుళ్లు కలిపి ముడి వేసినట్లుండును. కొందఱివి "సోదరుల"న్న పదముతో కాని పొత్తుకుదిరెడివి కావు. అట్లైనను ఇరువురి పేర్లకు అందులో అవకాశము ముండెడిదికాదు. ఎట్లైనను అతుకులు పెట్టుకొని జంటకవులైన వారేకాని 'త్వమేవాహ' మ్మనుసమైక్య మేలాఁటి జంటకవుల నామముల కేర్పడినది కాదు. తెలుఁగువారి కభిమాన దైవమైన తిరుపతి వేంకటేశ్వరస్వామి నామము వ్యంగ్యమగునట్లు పేరు కుదురుట ఈకవుల యదృష్టము ! వేంకటశాస్త్రి గారు జాతకచర్యలో నాస్వామితోఁదమ్ము పోల్చుకొనుచు శ్లేషాలంకారమున నిట్లు చమత్కరించినారు.

సీ. "శ్రీమహా లక్ష్మి విశిష్టుఁడా నయశాలి
శ్రీమహా లక్ష్మి విశిష్టుఁ డితఁడు;

నీలాచలాదరాన్వితుఁడా చమత్కారి
నీలాచలాదరాన్వితుఁ డితండు;
విబుధ రాజ స్తవ్య విభవుఁ డామహితుండు
విబుధ రాజ స్తవ్య విభవుఁ డితఁడు;
బ్రహ్మగురుత్వ వైభవుఁ డాయశోరాశి
బ్రహ్మగురుత్వ వైభవుఁ డితండు;

తే. గీ. నిరత తిరుపతి విరచితాదరుఁ డతండు
నిరత తిరుపతి విరచితాదరుఁ డితండు;
వేంకటేశ్వరుఁ డాతండు; వేంకటేశ్వ
రుం డితం డన నప్పుండితుండు తనరె.'' —జాత. పూ. 389.

పారలౌకిక మైన పరమాత్మతత్త్వము పరివేషముగా భాసించిన తిరుపతి వేంకట కవుల నామధేయము తెలుఁగువారి భక్తిపుష్పాంజలులకు పాత్రమై విలసిల్లినది!

''అడివి యుసిరికాయయు నుప్పును'' కలియురీతి తిరుపతి వేంకటకవులకు నేస్తము కడు విచిత్రముగా సంఘటితమైనది. తిరుపతిశాస్త్రిగారు వెల్నాటివారు; వేంకటశాస్త్రిగారు ఆరామద్రావిడులు; ఒకరు యండగండిగ్రామస్థులు, మఱియొకరు యానాము వాస్తవ్యులు. ఒకరు దివాకరాన్వయవారినిధి శీతరోచి, మఱియొకరు చెల్లపిళ్ల విఖ్యాతవంశ్యులు. వీరిరువురు కులరూపగుణములందు సములై చెర్ల బ్రహ్మగురు నొద్ద సహాధ్యాయులై మైత్రి కలిసి జంటకవులైరి. వీరి స్నేహము అమలము, నిత్యము, సత్యము, ఆదర్శప్రాయము!

శా. ''నీరక్షీరములట్లు లెల్లపుడు నీనేస్తంబు గైకొంటి మ
క్రూరంబైన మనంబుతో నిదియ మాకుం దెచ్చెఁ గీర్త్యాదికం
బేరే మైత్రినిగూర్చి చెప్పుకొనుచో దృష్టాంతమౌఁ గాక పెం
పారం దిర్పతి వేంకటేశ్వరుల సఖ్యం బెల్లకాలంబులన్.
—శతావధానసారము – ఉత్త. పుట. 90

చ. ''ఇరువురుఁ గూడియే రచన యెప్పుడు చేయుదు రొక్కవేళ నొ
క్కరొకటి, యొక్క రింకొకటి కైకొని చేయుదు, రందుహెచ్చుత
గ్గొరులకుఁ గానరాక యది యొక్కరు చేసినభంగి నుండు, నొ
క్కరు రచియించిరేనియును గాఁదగు తిర్పతివేంకటీయమై.''
—జాతకచర్య. పూ. 240. ప.

అనిన ప్రతిజ్ఞలు వీరి యభేదస్నేహమూర్తిని సాక్షాత్కరింపఁ జేసినవి. ప్రత్యర్థు లెందఱో వీరి స్నేహమును భగ్నపరుప యత్నించిరి కాని అకృత్రిమమైన వారి ప్రవృత్తిపట్ల విఫలులైరి.

తిరుపతివేంకటకవు లాశుకవిత్వము చెప్పి అవధానసభలను రంజించునంత వఱకు జంటకవులు కవిత్వ మెట్లు చెప్పెదరో తెలుఁగువారికి స్పష్టమైన తెలివిడి లేదు.

చ. "ఒక చరణం బతండు మఱియొక్కటి నేను మఱొక్కఁ డాతఁడున్
సకలకవీంద్ర సంతతులు సమ్మతిచేఁ దలలూచి మెచ్చఁగాఁ
బ్రకటతరాశుధార దనరన్ రచియింపఁగ నేర్తుమయ్య! 'నూ
టికిసెల'గయ్య! నిక్కమిది డెబ్బదిమాటలు సెప్ప నేటికిన్ ?"

నానారాజసం. పూ. 44. ప.

అని మొదటిసారి విడమరిచి చెప్పినవారు తి. వేం. కవులే. పద్యములో నొక్కొక్క చరణ మొక్కొక్కరు చెప్పుట, ఆశువుగా శతావధాన మొనర్చుట అనునీ కవుల రెండుగుణములు లోకమున కాశ్చర్యముద్రఁ గల్పించినవి. ఏకకవిబుద్ధి విలసితమైన యొకసంపూర్ణభావావేశము ఛందోమయముగా నొక పద్య మగుటయు లేక ఒకకావ్య మగుటయు లోకమున సహజముగా గోచరించు విషయము. కాని తి. వేం. కవులు ఒక్కొక్కచరణ మొక్కొక్కరు చెప్పి రనఁగా నొక్క వ్యక్తి యం దుండవలసిన సమాహితబుద్ధిప్రాభవము జంటకవులలో నిద్దఱి నాశ్రయించి యేకోన్ముఖముగాఁ బ్రవహించు నని స్పష్టమగుచున్నది. భావయిత్రీ కారయిత్రీ ప్రతిభలయందు ఈకవులు సాధించిన సమన్వయసంసిద్ధి యపూర్వము. జ్ఞానేచ్ఛా క్రియా వృత్తులు భవ్యకవితావేశోన్ముఖములై జంటకవులయందు భావసంస్కా రము నేకరూపముగా నావిష్కరింపఁ జేసినవని యిందు తాత్పర్యము. మానసిక స్నేహము తాదాత్మ్యవస్థ నందెడి యుత్తమస్థితికి తి. వేం. కవుల భావైక్యము ఒక విశిష్టదృష్టాంతము ! అట్టిది జంటకవులలో నభూతోనభవిష్యతి !

జంటకవుల మనఃప్రవృత్తి కావ్యసృజనవ్యాపారమం దేకైకమార్గావలంబి యైనట్లు ఇతరవిషయములం దుండ నవసరము లేదు. వ్యక్తిగతములైన అభి రుచులు, అభిప్రాయములు భిన్నభిన్నములుగా భాసింపవచ్చును. అనఁగా కవన వ్యాపారమందు కవలబిడ్డల మనఃప్రవృత్తిని, జీవితవ్యాపారమునందు స్నేహ

ప్రవృత్తిని జంటకవులు ప్రపంచించెద రని తాత్పర్యము. సామాన్యముగా కవుల బిడ్డ లొకనిర్దిష్టవిషయమునం దొకేవిధముగా వర్తించుటయు, స్నేహితుల హృదయము లొకటయ్యు అభిరుచులు వేరై యుండుటయు లోకప్రసిద్ధము. అట్లే తి. వేం. కవులు తమ కవిత్వ మొక్క కవి రచించినట్లే భాసింపఁజేయు భావై క్యము కవిత్వమున సాధించిన వారయ్యు జీవితమున భిన్న దృక్పథములు కల వారై యుండిరని వారి గ్రంథములు నిరూపించుచున్నవి. మచ్చునకు వీరివి కొన్ని విభిన్నాశయముల నిచ్చట నుదాహరించుచున్నాను.

1. తిరుపతివేంకటకవులు ఇరువురు నానారాజసందర్శన మొనర్చి వారిచే గౌరవసత్కారాదులు పొంది యుండిరి. వేంకటశాస్త్రిగారికి రాజదర్శనము ప్రీతి దాయకమే కాని, వారి నాశ్రయించుకొని బ్రతుకెల్ల నస్వతంత్రముగా నడపుట మాత్ర మిష్ట మయ్యేడిది కాదు.

మ. "నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నన్ గాని తత్సన్నిధిన్
స్థిర వాస మ్మొనరించు నట్టిపని నాచేఁ గాదు నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగా బెరిఁగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బరుల న్నిత్యము గొల్చు టొప్పగునె ? యంబా ! దేవి కామేశ్వరీ !"

అని వేంకటశాస్త్రిగారు తమ యభిమతమును స్పష్టపఱిచినారు. తిరుపతిశాస్త్రిగారు దీనికి విరుద్ధము. అందువలననే పోలవరము జమీందారు గారి యాస్థానమునువా రలంకరింపఁ గల్గినాఁడు. అందు తప్పేమియు లేదు కాని, వేంకటశాస్త్రిగా రొకసారి కోరినప్పుడు వెంటనే తిరుపతిశాస్త్రిగారు అవధానయాత్రకు ప్రభుసేవకారణముగా రాఁ జాలక పోయినారు. "నిరంకుశాః కవయః" అన్న సూక్తిని వేంకటశాస్త్రిగారు నూరుపా ళ్లనుసరించిన స్వతంత్రులు.

2. "అవధానాలలో కొన్ని విషయాలు క్రొత్తరకాలు ప్రవేశపెట్టా లని అతనికి (తిరుపతిశాస్త్రిగారికి) వుత్సాహం వుండేది. వాట్లను నేను (వేంకటశాస్త్రిగారు) వప్పుకుండేవాణ్ణికాను. యెందుచేతనంటే- ఆవిషయాలు గారడిబాపతులో చేరు తాయి. కాని కేవలప్రతిభైకస్ఫోరకాలు కావు. సార్వత్రికంగా కాకపోయినా క్వాచిత్కంగా నేనా ఆవిషయాలు యితరులున్నూ చేసే కిటుకులు. మన అవధా నంలో ఆకిటుకుకాస్తా బయటపడ్డప్పుడు మన అవధాన మంతా ఇలాంటిదే అనే అపప్రథకు అది కారణం కావలసివస్తుం దని నాశయం. అతఁడు అప్పటికప్పుడు

దాటుకపోవడమే చూచేవాఁడు కాని, భవిష్యత్తును విచారించేవాఁడే కాఁడు. మాయిద్ద ఱికీ యీవిషయంలో చాలా ప్రభేదం." —కథలు-గాథలు-పుట. 427.

3. "యేదేనా తన్మయత్వం తటస్థిస్తేమాత్రం యిప్పుడు కూడా అన్నాహారాలు తోచకుండా కవితాధార నడుస్తున్నందుకు నిన్నమొన్న రచించిన 'జయంతిన్నీ' 'క్షమాపణమున్నూ' లోకానికి సాక్ష్య మీయడానికి సందేహంలేదు. యిదే నాప్రవృతిలో వున్న విశేషం. ఇట్టి పట్టుదలగాని, తన్మయత్వంగాని అతని ప్రకృతిలో లేదు." —కథలు-గాథలు-I పుట 437.

4. "పరిణతి రవధార్యా యత్నతః పండితేన" అనే భర్తృహరి వాక్యాన్ని ప్రతికవిన్నీ అనుసరించి తీరాలి. అది అతఁడు ఏవిషయంలోనూ పాటించేవాఁడు కాఁడు. గ్రంథారంభం చేసేటప్పటికే ముగింపు మనస్సులో నాటుకపోవాలి కాని ముగింపును గూర్చి యెప్పుడో ఆలోచిద్దామంటే కార్యకారి కాదు.

—కథలు-గాథలు సం. I-438.

5. "సభాముఖంలో వంకరమార్గం త్రొక్కి, ముఖవిధానంచేసి, యెదటివాళ్ళకు నోరాడనివ్వక పోవడంలో అతనికి మంచి శక్తి వుండేది. కాని, అది తావన్మాత్రంలో ఆఁగిపోతే యేం లాభం? మర్నాడు మళ్ళా అడిగితేకూడా నిలిచే పద్ధతి వాదంగాని పనికిరాదనే వాణ్ణినేను. అందుకోసం తాత్కాలిక విజయానికి యెన్నడూ ప్రయత్నించక వొక్కొక్కదానికి యెన్నో ప్రయోగాలు వెదికి వెదికి వేసారి అప్పుడు దాన్ని బయటికి పెట్టడమే అప్పటికీ ఇప్పటికీ నాప్రకృతి. యిందుకోసం అతఁడు నాయందు ఆంతరంగికంగా చాలా కృతజ్ఞత చూపేవాఁడు, నామాటను పరమప్రమాణంగా భావించేవాఁడు." —కథలు—గాథలు. I పుట. 440.

6. "వ్యాకరణం ఇద్దరమూ సమానంగానే చదువుకున్నాం. మధ్యకాలంలో నేను కాశీకి వెళ్ళినా చాలామంది మహాపండితులను సందర్శించడం తప్ప దేశంలో వున్న తిర్పతిశాస్త్రికంటే విశేషం చదివిం దేమీ లేదు. మళ్ళా దేశంలో యిద్దరమూ కలిసే తరువాయి గ్రంథాలు మొదటిగురువుగారి దగ్గిరే అభ్యసించాము. సంస్కృతంలో కావ్యనాటకాలు చదవడంలో నాకన్నా అతని గురు శుశ్రూష హెచ్చు. నాశుశ్రూష ఆవిషయంలో అతనికంటే కొంచెం లొచ్చు. ఈభేదం మేము కలుసుకొన్న కొన్నియేళ్ళవఱకు- అంటే అధమం రెండేళ్లవఱకూ— వుండేది. పిమ్మట సరిసమానంగానే మామాసాహిత్యాలు తయారైనాయి. అతఁడు

తీవ్రమైన బుద్ధిశాలి. అయినా నాలాగ సర్వదా విద్యావ్యాసాంగాన్ని చేస్తూ దాన్నే వక తపస్సుగా పెట్టుకొనే స్వభావం కలవాఁడు కాఁడు. నేనో? సర్వదా దాన్నే మననం చేస్తూ కాలక్షేపం చేసే స్వభావం కలవాణ్ణి. అందుచేత శుశ్రూష విషయంలో తక్కువ అయినా పరినిష్ఠితసాహిత్యంలో అతనికంటేకూడా అంతోఇంతో నాశక్తి అతిశయించిందని పరిశీలకులు గుర్తించవలసివస్తుంది. యీఅతిశయం దేనిలోను? యేవేనా ఖండనమండనాలప్రసక్తిలో మాత్రమే. దేన్నేనా అన్వయించడం వస్తే నాకన్న అతఁడే అన్వయించే వాఁడు. యీలాంటి స్వల్పభేదం వున్నా అతనివాదం "యేయెండ కాగొడుగు"గా వుండే దవడంచేత దురుద్ధరంగా పూర్వపక్షాలు చేయడానికేకాని శాశ్వతమైన సిద్ధాంతకల్పనకు పనికివచ్చేది కాదు. యీవ్రాసిన సోదెవల్ల ముఖ్యఫలితం సంస్కృతసాహిత్యవిషయంలో అతనిది సర్వమూ అంతోఇంతో గురుశుశ్రూషా లబ్ధం; కాని తక్కిన యావత్తూ స్వయంకృషి చేత తోడివిద్యార్థులతో కయికురు బొయికురులాడడం వగయిరా వ్యాసంగంవల్ల సంపాదించుకున్నదనిన్నీ చదువరులు తెలుసుకోవలసి వుంటుంది."—కథలు-గాథలు I-పుట. 464.

7. "తిరుపతిశాస్త్రికీ నాకూ ఉన్నభేదం ఒకస్వయంకృషిలోనే. నేనెప్పుడూ 'చింత కవులందుఁ దపసుల చిత్తమందు' అని మొల్ల వ్రాసిన పద్యపాదానికి వుదాహరణంగా వుంటాను. అతఁడు నావలె కాక యెప్పుడో పని పడ్డప్పుడు రచన చేసినా చాలాకాలం స్నేహితులతో యితర కాలక్షేపంతో వెళ్ళించేవాఁడు. అందుచేతనే నాకంటే అతని ఆరోగ్యం బాగుండేది. నాఆరోగ్యం యెప్పుడూ అంతంతగానే వుండేది. ఆరోగ్యంలో ఉన్నప్పటి కంటే కూడా అనారోగ్యంలో ఉన్నప్పుడే నాకు విశేషించి రచనసాగడం అనుభూతం ...మేమిద్దఱమూ పట్టుదల కలవాళ్ళమే. ... వొప్పు తప్పంటేనే పరాక్రమిస్తాను గాని తప్పుతప్పంటే వప్పుకుంటాను. తప్పు గూడా మార్గాంతరంగా సాధిస్తాను గాని దానితత్త్వం ఇలాంటిది అని వెంటనే కాకపోయినా నిజం మఱికొన్నినాళ్ళకైనా చెప్పేస్తాను. "నాఽమూలం లఖ్యతే కించిత్', అని వ్రాసిన పెద్దిబొట్లుగారి వాక్యం నాకు ప్రాణప్రదం—క. గా. I పుట. 471.

8. 'యద్దేవా' కవిత్వం చెప్పడానికేమి, వీరరసకవిత్వానికేమి తగాయిదాలు తెచ్చేకవిత్వం చెప్పడానికేమి అతఁడు మంచిమొనగాడు. —క. గా. I 484.

9. నాకొక నియమము కలదు.

ఉ. "ఆవలఁ నెవ్వఁడేని కవి యల్లిన పద్యములం బఠించుచో
నీవిధమెల్ల నిశ్చయము; ఈనుతికిన్ దగు నీతఁ డంచు సం

భావన గల్గఁగా వలయు భావమటుల్ పొడగట్టకున్న నా
దేవురుగొట్టు పద్దెముల దీవనలేమిటి కప్పరాట్ప్రభూ !"

—క. గా. I. 542.

10. వీలిచ్చినంతలో శబ్దాలకు ప్రాధాన్యం యివ్వక అర్థానికే యిస్తే 'పండితపామర సాధారణ్యేనా' ఆకవిత్వం ఆనందజనకంగా వుంటుం దని నేను తలుస్తాను.

"బ్రతికిన నాల్గునాళ్ళు ఋతవాది యుధిష్ఠిరుఁ డన్న మేటి కీ
రితి గలవాఁడనై ధరజరించి తుది న్నృపకోటి మెచ్చ దు
ర్గతి గనకుండ స్వర్గమునఁ గాపుర ముండఁ దలంచు నాకు నీ
యతు కొనరించితే కటకటా ! యదునందను పేరుమీదుగన్."

ఆయీపద్యమైతే నారచన కాదు (తి. శా. ది) గాని నాకు యిలాటి రచనే యిష్టం. అయితే లోకంమాత్రం యిది తి. శా. రచన కాదనిన్నీ—

"పటుజంఝానిలధోరణీరణరణత్ప్రాగ్భారనున్నాటవీ
తటశాఖాపటలాంతరుద్గతనితాంతస్ఫారఘోరాగ్నిరు
ఘ్టునాధూపితభస్మసాత్కృతకురుట్కాండమ్ముతో వహ్నికిన్
ఘటియింపం దలపెట్టినారుగద సఖ్యమ్మార్యచూడామణుల్."

యిది తి. శా. గారి రచనన్నీ చెప్పుకుంటారు. "లోకము మూయను మూకు దున్నదే" (క. గా. III పుట. 454). సంస్కృతసమాసాలు వున్న కవిత్వం తి. శా. గారి దనిన్నీ తెలుఁగుజిలుగుపదాలు వేంకటశాస్త్రిగారిదనిన్నీ అనుకొనేవారు చాల అమాయకులు. అలావ్రాసేవారి వ్రాతలు ఆదరించే యెడల తి. శా. గారికి చాలా అన్యాయం జరుగుతుంది.

—కథలు-గాథలు-I పు. 430.

11. వేంకటశాస్త్రిగారికి స్వయముగా నేగ్రంథమును అనువదింపవలెనను అభిప్రాయ ముండెడిదికాదు. ఇతరుల ప్రోద్బలమువలననే మొగమాటము కొఱకు అనువాదము నొనర్చుటకు అంగీకరించెడివాఁడు. తిరుపతిశాస్త్రిగారు అనువాదనాటకములలో చాలభాగము రచించినారు.

12. "బుద్ధికి రెండు శక్తులుగలవు. అందొకటి గ్రహణశక్తి. రెండవది ధారణశక్తి. గ్రహణశక్తిలోఁ దిరుపతికి వేంకటేశ్వరుఁ డించుక లొచ్చు. కావుననే

గురువుగారు శాస్త్రాధ్యయనకాలములోఁ దిరుపతిశాస్త్రి నెక్కుడు మెచ్చుకొనినారు. ధారణాశక్తిలోనో వెంకటేశ్వరునికి తిరుపతిశాస్త్రి ఇంచుకలొొచ్చు. వీరలిరువురకుఁ బ్రధానవిద్య యగు శతావధానమున కీధారణయే ముఖ్య మగుటచే వేంకటశాస్త్రి నతఁడు కొనియాడవలసివచ్చె ననునది యిందలి రహస్యము.''

—దివాకరాస్తమయము. 17 పు.

13. ''తిరుపతిశాస్త్రికన్న వేంకటశాస్త్రి వయస్సున నెంత పెద్దయో వేంకటశాస్త్రికన్నఁ దిరుపతిశాస్త్రి బుద్ధిలో నంత పెద్దయని లోకము విశ్వసించుఁగాక.''

—ది. అస్త. పు. 17.

''లోకోభిన్నరుచిః.'' అన్న న్యాయము ననుసరించి, వ్యక్తిగతములైన అభిరుచులు, అధికారములు, ఆకాంక్షలు, ఆచరణములు వేరువేరుగానున్నను కావ్యనిర్వహణమునందు మాత్రము అట్టివి తమసమైక్యకవిత్వశక్తి కవరోధములు కాకుండ కవితసాగించిన జంటకవులు తిరుపతివేంకటకవులు. విభిన్నత్వము నేకత్వము వీరి కావ్యనిర్మాణప్రతిభ !

తిరుపతివేంకటకవులు తెలుఁగు దేశమునకు ప్రప్రథమమున శతావధానులుగా పరిచయమైరి. శతలేఖిన్యవధానప్రక్రియ 'సంస్కృతాంధ్రములందు వేర్వేరుగా చేఁబట్టి నిర్వహించినవారు ప్రాచీన కవులలో లేకపోలేదు. కాని అట్టివారు నూటికి కోటికి ఒక్కరు. తెలుఁగులో చరికొండ ధర్మన, రామరాజభూషణుఁడు, మాడభూషి వేంకటాచార్యులు మొ॥ వారిటువంటివారే. కాని వారి శతావధాన ప్రక్రియ దేశవ్యాప్తము కాలేదు. ప్రజలలో సాహిత్యచైతన్యము కల్గింపలేదు. కాగా - సంస్కృతాంధ్రములందు నల్లేరుపై బండినడకవలె నాశుకవిత్వమును ధారావాహిగానడిపి' "రెండుబాసలకు మేమె కవీంద్రులమంచు'' శతావధానములే కాక అష్టావధాన సహస్రావధానములుసైతము సల్పి మేటికవు లనిపించుకొన్నవారు తి. వేం. కవులు. పూర్వకవులలో నొక్కొక్క రొక్కొక్క భాషలో నొక్కొక్క అవధానప్రక్రియను ప్రదర్శించియుండ, వీరు జంటకవులుగా అవధానప్రక్రియలన్నియుఁ బ్రదర్శించి చూపినారు. ఇట్టి విశిష్టావధానప్రజ్ఞకు వీరే ఆద్యులు, అనవద్యులు ! ఉభయభాషా కవిత్వ సవ్యసాచులు ! నానారాజ కవిపండితప్రజాపరిషత్తులందు అవధానకవితా కళాసౌందర్యావిష్కార మొనర్చి ఆంధ్రావళికి కవిత్వభిక్ష పెట్టిన అమృతమూర్తులు ! ఆంధ్రసాహిత్య మొకసారి ''శ్రీనాథుండు ప్రోవన్'' సొంపువాటిల్లినది. మఱల తిరుపతివేంకటేశ్వరులు ''సాఁకన్'' ఇంపువాటిల్లినది.

శృంగారరసకావ్యనిర్మాతలుగా తి. వేం. కవులకు తెలుఁగునాఁట నఖండ కీర్తి వచ్చినది. పరభాషాసాహిత్యాచార ప్రభావమువలన జాతిలో దేశీయభాషా సాహిత్యాభిరుచి మందగించి, తత్పఠనపాఠనాదు లస్తినాస్తివిచికిత్సలోఁ బడిన గడ్డు దినములలోఁ 'బ్రజామనఃప్రవృత్తిని అవధానప్రక్రియచే నాకర్షించి, సర్వజనహృదయాహ్లాదియు, రసరాజము నగు శృంగారరస మాత్మగాఁగల కావ్యరచనాప్రక్రియతో మురిపించి, సాహిత్యోపాసనాభ్యాసమును జాతిలోఁ బునరుజ్జీవింపఁజేసినారు. వీరి రసికానందము, శ్రవణానందము, పాణిగృహీత లక్షణాపరిణయము, శుకరంభా సంవాదము జాతిలో సాహిత్యచైతన్యము కల్గించినట్టివే. "శృంగారీ చేత్ కవిః కావ్యే జాతంరసమయం జగత్" అన్నట్లు వీరు రసమయమైన కావ్యజగత్తునే కాక, రసావిష్టమైన సహృదయ జగత్తును కూడ సృష్టింపఁ గల్గిరి.

ఆంధ్రావళికి శ్రవణానందమునే గాక నయనానందము గల్గించు రూపక ప్రక్రియను నిర్వహించి ప్రజాహృదయానంద రససింధువులై ప్రసిద్ధికెక్కినారు జంటకవులు. తెలుఁగువారి అభిమాన కావ్యమైన మహాభారతములోని కథను నాటకములుగాఁ దీర్చిదిద్దిన గౌరవము తిరుపతివేంకటకవులకే తొలిసారి దక్కినది. వీరి పాండవోద్యోగవిజయములు తెలుఁగునాఁట వీరరస విజయయాత్రలు సాగించినవి. వీరిప్రహసనాదులు ప్రజలలోఁ పేరుకొనిన మూఢాచారములను, అర్థములేని పట్టుదలలను, సానుభూతిలేని విమర్శలను, వింతవింత వితండవాదములను. వెక్కిరించి వెలివైచినవి. కందుకూరి వీరేశలింగముపంతులుగారి సాంఘిక సంస్కరణోద్యమము, గిడుగువారి భాషా సంస్కరణోద్యమము పూర్వరంగము సిద్ధము చేయగా తిరుపతి వేంకటకవుల కవిత్వ సంస్కరణోద్యమము రసవంతముగా తెలుఁగునాట నిర్వహింపఁబడినది. ముగ్గురికిని ప్రజాశక్తులే మూలాధారములు. సమకాలీన సాంఘికావసరములను గుర్తించి ప్రాతను సంస్కరించి క్రొత్తనుప్రదర్శించి భావిపురోభివృద్ధికి దోహదమైన నవ్యాలోకమును జాతి కందించుటయే వీరి యుద్యమముల పరమ తాత్పర్యము ! అందు తి. వేం. కవుల ఉద్యమలక్ష్యము సాహిత్యనవ్యాలోకము !

తి. వేం. కవులు కవిత్వము నొక ఆరాధనావిశేషముగను, పారమార్థిక పురుషార్థ సాధకముగను భావించిన మనీషులు. అర్షసంప్రదాయము వీరి యాదర్శ సాహిత్యమున కాయుస్సూత్రమైనను నవ్యత నందగించుకొనియే ముముక్షువులను మురిపించినది. జగదంబ వీరి యుపాస్యదైవము. ఆమెచల్లని చూపులలో నెల్లలు వైచికొన్నది వీరి పురాణస్తోత్రశతక వాఙ్మయసామ్రాజ్యము ! దేవీభాగవతమాము

ష్మిక ఫలప్రదాయి యగు నలౌకిక కావ్యకల్పవృక్షము. కామేశ్వరీశతకాదులు, కామేశ్వరీస్తోత్రాదులు భక్తిబోధసుధానిధులే కాక, అనామయప్రసాద మహిమా గరిమాన్వితములు. శివకేశవసూర్యాదులను వారు స్తుతించినను వారి దద్వైతభక్తి. దైవికమైనశక్తి వీరి యుక్తి నాశ్రయించి భక్తసంతతికి సాహిత్యోపాసనానురక్తిని గల్గించి వీరిని గురుపీఠమునఁ గూర్చుండపెట్టినది !

అధిక్షేపసాహిత్యము వీరియభిమానధననిక్షేపము. సత్యధర్మ సూత్రాచరణ విధికిఁ దొడిగిన కవచము ! పరిశుద్ధ మైన ప్రాచీనగురుశిష్యధర్మము, మహిమాన్వితమైన సత్యవాక్యప్రభావము, సమసామర్థ్యము గల పండితప్రకాండులతోడనే శాస్త్ర చర్చలు సల్పెడి వీరోచితగుణసంపత్తి, ఉన్మార్గవర్తనులైన ఆప్తులను ముఖాముఖి మందలించియు వ్యంగ్యముగా నధిక్షేపించియు సన్మార్గవర్తనులుగా నొనర్చెడి పవిత్రోద్దేశము వీరి యధిక్షేపసాహిత్యమునకుఁ బరమప్రయోజనములు. దీనికి ఫలము విశ్వశ్రేయస్సే !

తిరుపతివేంకటకవుల కఖండకీర్తి వచ్చుటకు వారి శతావధానప్రక్రియ యొక్కటియే కాదు హేతువైనది. దానికితోడు వారు వైవిధ్యముతోఁ గూడుకొనిన సాహిత్యమును సృజించి సమకాలీన కావ్యజగత్తులో లేని నవ్యత నావిష్కరింపవలె ననెడి వారివిశిష్టప్రయత్నము మఱియొక ముఖ్యకారణము. ఈజంటకవులు కావ్య ప్రక్రియలలో నొకసారిపట్టినప్రక్రియ మఱలఁ బట్టలేదు; పట్టినదానిని బంగారము చేయక విడువలేదు. వారికావ్యజాలములో నొక్కొక్కటి ఒక్కొక్క విశిష్టసృష్టి ! మచ్చునకు కొన్ని—

1. శ్రవణానందము : శృంగారరసప్రధానమైన సాంఘికకావ్యము.

2. పాణిగృహీత : ప్రహసనతుల్యమైన శృంగారరసాభాసకావ్యము; మనస్తత్వశాస్త్ర రహస్యప్రతిపాదక పద్యకావ్యము.

3. లక్షణాపరిణయము : ఆశువుగాఁ జెప్పఁబడిన వర్ణనాత్మకకావ్యము.

4. ఏలామాహాత్మ్యము : పుణ్యతీర్థ మాహాత్మ్యము.

5. సుశీల : యుత్రాకావ్యము, సాంఘికవిమర్శయు, పాత్రచిత్రణము ప్రధానమైన పద్యకావ్యము.

6. పూర్వహరిశ్చంద్ర చరిత్రము : పురాణపాత్రల పూర్వకథలను దెల్పెడి కథాకావ్యము.

7. జాతకచర్య : ప్రథమాంధ్ర పద్యాత్మక స్వీయచరిత్ర.

8. పురాణకథలు :

9. వ్రతకథలు : భక్తిరస కథాకావ్యము.

10. స్తోత్రవాఙ్మయము: భక్తిశతక కవిత్వము(Devotional Poetry).

11. పాండవోద్యోగవిజయములు : వీరరసరూపకములు.

12. పాండవ జననాదులు : వస్తురూపకములు.

13. పండితరాజము : ప్రతీకార్థ ప్రధానమైన రూపకము, కవి జీవితగాథ.

14. అనర్ఘనారదము : తత్త్వార్థ ప్రధానమైన రూపకము.

15. సుకన్య : సాంఘిక సంస్కరణోద్దిష్టమైన పౌరాణికరూపకము.

16. ప్రభావతీప్రద్యుమ్నము : ఒక తెలుఁగుప్రబంధమును నాటకీకరించుట.

17. బొబ్బిలి పట్టాభిషేకము : సమకాలీన రాజకీయసంఘటన వర్ణనము.

18. బిడాలోపాఖ్యానాదులు : అన్యాపదేశ కావ్యము (Satirical Poem)

19. గుంటూరు సీమాదులు : వివాదసాహిత్యము (ప్రమాణసహితము.)

20. వచన రచనలలో వ్యాసములు :

(1) సాహిత్యచర్చలకు సంబంధించిన వ్యాసములు.
(2) స్వీయచరిత్రకు ,, ,,
(3) ప్రసిద్ధుల చరిత్రకు ,, ,,
(4) సాంఘిక విమర్శకు ,, ,,

21. కావ్యనాటక శతకానువాదములు : ఆంగ్ల - గీర్వాణభాషలనుండి.

కవిత్వాదులలో నింత వైవిధ్యముతోఁగూడిన నవ్యతాదర్శనముచేసి సాహిత్య సృష్టి యొనర్చినారు కావుననే వీరు నవ్యకవితాపితామహు లనుటకు అర్హులగుచున్నారు. అల్లసానిపెద్దన ప్రబంధనిర్మాణమునకు మూలకర్తయై ఆంధ్రకవితా

పితామహుఁడు కాఁగా తి. వేం. కవులు నవ్యకవిత్వశాఖావిస్తృతికి మూలకందములై నవ్యసాహిత్యపితామహు లగుచున్నారు. తిరుపతివేంకటకవుల సాహిత్యోద్యమము ప్రాచీన మూఢవిశ్వాసముల కెదురుచుక్క! సరస నవ్యకవితాదర్శములకు పొడుపు చుక్క!

ప్రాతపునాదులపై నూతనభవనము కట్టినా రీజంటకవులు. ఒక్కసంస్కృత పాండిత్యముతో నాంధ్రకవిత్వము కరతలామలక మౌనన్న సిద్ధాంతమునకు వీరు బద్ధవిరోధులు:

"తెలుఁగు తెలుఁగని యద్దాన దిగుటె కాని
సంస్కృతమ్మున కన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమ మున్నఁజాలు
దాని, కిద్దానికో రెంటఁ దగులవలయు." —పాణి. పం. 53.

అని వీరి ప్రబోధము. గీర్వాణాంధ్రములఁ దఱచి నిగ్గుఁదేల్చినశబ్దశాస్త్ర పారగు లన్న మాటలివి! శుకరంభాసంవాదముతో సంస్కృతకవనమునకు స్వస్తిచెప్పి ఆంధ్రకావ్యనిర్మాణరంగమునందు దుమికిన మాతృభాషాభక్తులన్నమాట లివి! తెలుఁగునిఘంటువులు, తెలుఁగువ్యాకరణగ్రంథములు, లక్షణగ్రంథములు ఎట్లసమగ్రములై ప్రతిభావంతులగు కవుల ప్రయోగములకు ప్రామాణ్యతను సిద్ధింపఁ జేయఁజాలకపోవుచున్నవో, కల్పనాస్వతంత్రములగు కవులకావ్యప్రక్రియలకు సహృదయపూర్వకమైన లక్షణసూత్రముల నందింపఁజాలకపోవు చున్నవో నిరూపించి, ఇట్టి విషయములలో కవిత్రయప్రామాణ్యము నంగీకరించి పండితప్రకాండులతో వాదులాడి తి. వేం. కవులు భాషాసారస్వతోపాసకుల ఇనుపసంకెళ్ళను పటాపంచలొనర్చి స్వేచ్ఛను ప్రసాదించిరి. దేశస్వాతంత్ర్యముతోపాటు శాస్త్రసాహిత్య ప్రక్రియా స్వాతంత్ర్యమును జోడుకలిపి వీరుచాటించిరి.

చ. "తెలుఁగున కున్న వ్యాకరణ దీపము చిన్నది! గ్రాహ్య మంచుఁ బె
ద్దలు కొనియాడు భారతము తప్పన శక్యము కాదు; దానిలోఁ
గలిగిన లక్ష్యభేదములు కాదన కాదృతి సంగ్రహించి ని
శ్చలగతి నిందుఁ గూర్చెదరు చక్కఁగ దిర్పతివేంకటేశ్వరుల్."
—దేవీభాగ. ప్ర. 35 ప.

కవిత్రయ ప్రయోగములను పాక్షికముగా నంగీకరించి పాక్షికముగా నంగీకరింపని అప్పకవి, బాలవ్యాకరణకర్త, శబ్దార్థరత్నాకరకర్త మొ॥ వారు, వారిని ప్రమాణముగాఁ గొని వాదులాడెడి కవిపండితులకు తి. వేం. కవుల వేడిచూపునకు గురికాక తప్పినది కాదు.

క. వ్యాకరణ మొక్కత్రోవ, మ
హాకవు లొకత్రోవ. కోశ మఖిల మ్మొక త్రో
వై కనుపట్టెడి, నీ భా
షా కావ్యమ్ములను దఱచు చదివిన కొలఁదిన్.

క. కేవల సంస్కృత మర్యా
దావిదులును గేవ లాంధ్ర తత్పరులును గా
కేవార లుభయభాషా
కోవిదు లవ్వారు దీని గురువులు జగతిన్. —దేవీభా. ప్ర. 26, 27.

అని మొగమాటము లేకుండ సత్యము కుండబ్రద్దలగునట్లు చెప్పి—

గీ. కేవల గ్రామ్యపదముల నేవగించి
జనులు వాడెడి పదములు సమ్మతములు
"కలవు లే" వని పెనఁగ శక్యంబె ? భార
తాదులను లేనిపదములు నవనిఁ గలవె ? —దేవీభా. ప్ర.25 ప.

అని సిద్ధాంతీకరించిరి. హేతువాదముతో సరసమైనదని కనుపడినంతవఱకు ఏసిద్ధాంతమైనను కాదని త్రోసివేయలేదు. గిడుగువారి వ్యావహారికవాదమును బరిశీలించి పద్యకవనమునందును, పాఠశాలలలో పఠన పాఠన సాహిత్యమునందును, గ్రాంథికభాష యుండవచ్చు ననియు, వచనరచనకుఁ గచ్ఛత్సాహిత్యమునకు వ్యావహారికభాష యుపాదేయ మనియు కవులంగీకరించిరి. కావ్యములందు రసవంతముగా నుండునట్లు వ్యావహారికపదములు ప్రయోగించినను దోషము లేదని వీరిమతము. అన్యదేశ్యాలను తమరచనలలో విచ్చలవిడిగా వాడిన విశాలహృదయము వీరిది!

ఉ. కాలముఁబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభా
షాలలితాంగి మాఱుటది సత్కవిసమ్మత మౌట నన్యదే
శ్యాలను నాంధ్రభాషఁగలవౌటను నౌచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మని పండితు లేగతి నొప్పుకుందురో.

—పాణి. ప్ర. 19.

అని తమ మతమును సవినయముగను, సహేతుకముగను ప్రపంచించియున్నారు. ఇట్లు స్వాతంత్ర్యము ప్రకటించియు దేశీయభాషామర్యాదకు విరోధములైన ప్రయోగములనుగాని, ఎరువుసొమ్ములవంటి భావములను గాని, తెలుఁగువారి ప్రవృత్తియం దమరని కవిత్వప్రక్రియలను గాని వీరు సమర్థింపలేదు. అనఁగా తాత్కాలికావేశముతో ప్రాతను విరుగఁద్రొక్కి ముందు కనాలోచితముగా దూసుకొని పోయినవారు కారనియు, శాస్త్రసమ్మతములును, ఔచితీసహితములును, విశ్వ శ్రేయోరూపములును, సమకాలీన సాంఘికావసరానుగుణములునైన నవ్యమార్గము లనే వీ రనుసరించి రనియు ఒకసాహిత్యపరిణామ విప్లవమునకు వీరు మూలకారకు లైరనియు ఈచర్చవలని తాత్పర్యము.

తిరుపతివేంకటేశ్వరుల నవ్యాలోకము నలవరించుకొన్న తెలుఁగుకవికి భయము తొలఁగినది, కలము సాగినది. ఉజ్జ్వలమైన భవిష్యత్తు గోచరించినది. ఇఁక కొన్నిశతాబ్దుల వఱకు కవిత్వము చావదను ధైర్యము జనించినది. ఆజంట కవులదృష్టి ప్రాచీనకవితపై నొక దివ్యాలోకము, నవీనకవితపై నొక నవ్యా లోకము !

తిరుపతివేంకటకవులు సమకాలీన కవిలోకములో మకుటములేని మహా రాజులవలె భాసించిరి. ప్రత్యక్షముగనో పరోక్షముగనో వీరిప్రభావము పడని కవి ఇరువదవశతాబ్ది పూర్వార్ధమునందు లేఁడన్నచో సత్యదూరము కాజాలదు !

ఇంత ప్రజాశక్తిని వీరికి సంపాదించిపెట్టిన అంశములలో వారి ప్రసన్న కవితాశైలి ప్రధానమైనది. జాతిలో చైతన్యము కల్పించుట వీరి కవితాలక్ష్యము. అందులకై ప్రసన్నగంభీరమైన శైలిని వీ రెన్నుకొనినారు. వేంకటశాస్త్రిగారొకచో నిట్లనిరి. "రచన అనేది సుబోధంగా వుండా లనునది ముందు జనించిన పిమ్మట నాజనన మని నన్ను మన్నించువారు సంభావింతురుగాక ! ఏమంటే కవిత్వ మనేది తనమనస్సులో వుండే అభిప్రాయాన్ని యితరులకు తెలుపుడు చేయడానికి పుట్టింది కాబట్టిన్నీ, ఆయితరులలో భాషాపాండిత్యం ఎక్కువ ఉన్నవాళ్ళేకాక తక్కుగా ఉన్నవారూ వుంటారు కనుకున్నూ యీఅభిప్రాయం పండితులలో చాలామందికి రుచింపదు. (కథలు – గాథలు I–275 పు,) పండితులకు రుచింపనంతమాత్రమున స్వీయసిద్ధాంతమును మార్చుకొనలేదు తి. వేం. కవులు. మఱొకవిధముగా అన్వ యము చెప్పినచో – వారు పండితుల కొఱకేకాదు కవిత్వముప్రాసినది. "ఆంధ్రావళి

మోదముం బొరయునట్లుగ" "మహాకవిత్వదీక్షావిధి నందినవారు." తెలుఁగు జాతీయత కెత్తిన నవ్యపతాక వీరికవితాశైలీ సిద్ధాంతము!

"రమణీయార్థప్రతిపాదికశబ్దః కావ్య"మ్మనునది వీరి కవిత్వశైలికి మూల సూత్రము! యాంత్రికముగా రోజురోజునకు ప్రపంచజీవితము వేగవంతమగుచున్నది. సామాజికులలోఁ దీరికగాఁ గూర్చుండి బృహత్సంహితలను మననముచేసికొనెడి వ్యవధానము క్రమముగా సన్నగిల్లుచున్నది. ఆశుగవేగము ననుగమించుచున్న జాతిచైతనమును విస్మరింపకుండ ప్రబోధింప నిలిచిన వైతాళికు లీ జంటకవులు, ఒక్కసారి గొంతెత్తి కవన మాలపించుచో శ్రోతహృదయ మట్టె యాకృష్టమై కవితాస్వాదనోన్ముఖము కావలెను! అప్పై నాలోచించినంత మేర అమృతము వాని భావుకత కందీయవలెను. దోబూచులాడు వ్యంగ్యవిలాసము, అరసిచూచిన గాని అంతుదొరకని అర్థగాంభీర్యము వీరికవితకు ప్రధానలక్షణములు. దీనినే ప్రసన్నగంభీరగుణములని జెప్పుకొనవచ్చును. లాక్షణికులు చెప్పు ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, అర్థవ్యక్తి, ఔదార్యము, కాంతి, ఓజస్సు అనుగుణములు రసోచితములుగా కావ్యములందు బ్రయుక్తమైనను ప్రసాదగుణమే వీరి శైలికి నైజము.

"కవుల మున్నటి రూల్సుకు కట్టుపడము
ఘనులు పండితరాయాది కవులు చూపు
త్రోవలం బట్టి పోదుము దేవునైన
లక్ష్య పెట్టము.... .... .... ...."

"తనకు నాల్గు నిఘంటు పదములు వచ్చు
ననుచుఁ బదిమందికినిఁ దెలియంగ మాఱు
మూలపదముల గుప్పిన ముచ్చటగునె?
ప్రతిపదంబున రస ముట్టిపడినఁ గాక" —శ్రీ. ప్ర. 12.

అన్నది వీరి కవితాశైలికిసంబంధించిన ప్రతిజ్ఞ. భరతమహర్షి కవిత్వనిర్వచనము వీరి రూపకకవితాశైలికి చక్కని లక్షణసూత్ర మగు ననుటలో విప్రతిపత్తిలేదు.

"మృదులలిత పదాఢ్యం, గూఢ శబ్దార్థహీనమ్
జనపద సుఖబోధ్యం, యుక్తిమ న్నృత్య యోగ్యమ్

బహుకృతరసమార్గం సంధిసంధానయుక్తమ్
సభవతి శుభకావ్యం నాటకప్రేక్షకాణామ్.''

అని భరతుని నిర్వచనము. దీని నొజ్జబంతిగా గొని రచించిన కవుల కవిత్వరచనము నాటకమున నుండదగినది పద్యమా? గద్యమా? అని వివాదములు రేగిన సమకాలీన పరిస్థితులలో గద్యముకన్న శ్రవణసుభగము, సులభసుగమము నైన పద్యము నాటకమున రసవత్తరముగా నుపయోగింపవచ్చునని నిరూపించి పద్యగద్యాత్మకమైన నాటకరచనాశిల్పమునకు అమృతభిక్ష పెట్టినది. వీరిభారతనాటకములు పెక్కుఱు నటకుల కెనలేని కీర్తిప్రపత్తులను గల్పించినవి. పశులకాపరుల నుండి పండితప్రకాండుల వఱకు ముఖస్థములై వీరికావ్యములలోని పద్యములు వారికి ప్రజాహృదయములలోఁగల గౌరవస్థానమును వేనోళ్ళఁ జాటుచున్నవి.

తిరుపతివేంకటకవుల కవిత్వము వినినతోడనే కల్గునది శ్రవణానందము! వీరి కవిత్వ మాలోచించిన కొలఁది కల్గునది రసప్రవణానందము!!

తిరుపతివేంకటకవులు మహాకవులు, పండితులు, శాస్త్రదృష్టులు, విమర్శకులు, రసజ్ఞులు, తాత్త్వికులు, దేవీభక్తులు. లోకజ్ఞులు, సంస్కర్తలు, విప్లవజ్యోతులు !!

వీరికి కింకవీంద్రఘటాపంచానన, విద్వత్కవి, బాలకళానిధి. బాలసరస్వతి, శతావధాని, కళాప్రపూర్ణ, మహాకవి చక్రవర్తి! ఇత్యాది బిరుదములు సార్థకములై యొప్పారుచున్నవి. ఇందులో 'కింకవీంద్రఘటాపంచానన' బిరుదము స్వదత్తాంకము గాని తదితరము లితరు లిచ్చినవే! తిరుపతిశాస్త్రిగారు గతించిన తరువాత వేంకటశాస్త్రిగారికి మహాకవిచక్రవర్తిబిరుదమును, కళాప్రపూర్ణ అనెడి ఆంధ్రవిశ్వవిద్యాలయ గౌరవబిరుదమును లభించినవి. మద్రాసురాష్ట్ర ఆస్థానకవిపీఠము వేంకటకవిగారు మొదటిసారి అధిష్ఠించినారు. ఇట్లొక్కరికి ప్రత్యేకగౌరవములు జరిగినను—అది ''తిరుపతివేంకట కవులకు'' జరిగినట్లే వేంకటశాస్త్రిగారు భావించిరి; అట్లే తెలుఁగుదేశము కూడ భావించినది!

తిరుపతివేంకటకవుల కవిత ప్రాచీనకవితకు భరతవాక్య మనియు, నవీన కవితకు నాందీవాక్య మనియు బ్రసిద్ధిఁ గాంచినది. అనఁగా ప్రాచీనకవిత వీరితో ముగిసిన దనియు, నవ్యకవిత వీరితో నారంభమైనదనియు, స్థూలమైన అర్థము. పై ప్రసిద్ధవాక్యములో చమత్కారమైన అర్థప్రతీతి గలదు. వీరికవిత ఒకవైపు భరత

వాక్యముగను, ఒకవైపు నాందీవాక్యముగను ఉన్నదట. లోకమున సామాన్యముగా భరతవాక్యముగా నున్న వాక్యము నాందీవాక్యముగా నుండఁజాలదు. అచ్చట వాచ్యార్థము బాధిత మగుచున్నది. ఇఁక లక్ష్యవ్యంగ్యముల నాశ్రయించి, గుణప్రాధాన్య వివక్షతో నన్వయము కుదుర్పవలెను. భరతవాక్యము విశ్వశ్రేయోరూపమై పూర్వకావ్యార్థసంపుటి కౌక సమన్వయసిద్ధిని ధ్వనింపఁజేయుచుండును. నాందీవాక్యము అశీర్నమస్క్రియారూపమై భావికావ్యార్థములసంపుటిని తనయందు వ్యంగ్యముగా భాసింపఁజేయుచుండును. ఇట్టిదృష్టితోనన్వయించుచో నీజంటకవుల కవిత్వమునందు ప్రాచీనప్రసిద్ధ కవిత్వ మర్యాదలన్నియు నొకవిశిష్టసమన్వయము పొంది యిందొదిగి నిల్చినవనియు, భావికాల కవితామర్యాదలు ఇందు బీజప్రాయముగా నాటఁబడియుండి మంగళారంభమును సూచించుచున్న వనియు తాత్పర్యము కాఁగలదు. మఱియు ప్రాచీనకవిత్వమునందు గోచరించు ధారాళమైన ప్రవాహశైలి, సౌకుమార్యముతోకూడిన ప్రసన్నత, అర్థపుష్టి అనెడి లక్షణములు తిరుపతివేంకట కవులయందు సమకాలీనులు సాధింపలేని విశిష్టస్వాతంత్ర్యభావములతో ప్రజాశక్తిని పుంజించుకొని నీటిబుగ్గలవలె పునరావిర్భవించి సారస్వతరంగము నావరించినవి.

"వానలోఁ దడియనివారు మధురవధానమృదూక్తిమరందధారలోఁ గడుగని వారు మా కెచట కానఁగరా రిలఁ దెల్గునాఁడునన్" అని ప్రశంసించిన శ్రీవిశ్వనాథ వారి వాక్కులో సమకాలీనకవులపైఁబడిన కవుల కవితాప్రభావము వర్ణితమైనది. అవధానకళ, మృదూక్తి, మరందమాధుర్యము, అవిచ్ఛిన్నధార, కల్మషక్షాళనము అనునవియే వీరికవితాలక్షణములఁట! వానలోఁ దడియనివాఁడు లోకమున గానఁబడనియట్లే ఈకవుల కవిత్వధారలో మునుఁగని వాఁడే తెలుఁగునాఁట లేఁడఁట! ప్రజా హృదయములందు కవులకవితకు కట్టఁబడిన పట్టమును నుట్టంకించు వాక్యములివి!

"జగద్ధితముగను," "ఆంధ్రావళిమోదముం బొరయునట్లుగను," "అలకించిన సొగసుకోర్కులు వచ్చునట్లును," "విరిపొట్లము విప్పినగతి" "వ్యంగ్యరస భావములు గుబాళించునట్లును," "రసాభ్యుదయోల్లాసి"యగు సాహిత్యమును సృజింప "మహాకవిత్వదీక్షావిధి"నొందినవారు తిరుపతివేంకట కవులు. కవిత్రయ కవిత్వము వీరికొజ్జబంతి. వారితోపాటు మఱికొందరి ప్రభావము వీరిపైఁబడినది. నిరంకుశులైన ఈజంటకవు లాప్రభావమును తమస్వాతంత్ర్యశక్తితో జీర్ణించుకొని వినూత్నవ్యక్తిత్వమును ప్రకటించిరి. ఆవ్యక్తిత్వమే సమకాలీనులకు ఒకచైతన్య శక్తిగా గోచరించినది. నాఁటికిని నేఁటికిని దానిమహత్తుకు తరుగులేదు!

"కవిబ్రహ్మ"వలె తిరుపతివేంకటకవులు కావ్యకర్తలే కాక కావ్యభర్తలునై కవిలోకభక్తి నీరాజనములకుఁ బాత్రులైరి. పింగళి కాటూరుల సౌందరనందము, సర్వా శేషయ్యగారి సుదర్శనోపాఖ్యానమనెడి శశికళాస్వయంవరము మొదలగునవి వీరిని వరించిన కావ్యకన్యలు.

తిరుపతివేంకటకవులను చూచి దేశమున కవులు శతసంఖ్యలలో అవధాన కళను చేపట్టి అవధాని బిరుదాంకితులై వారి ప్రతిబింబసౌభాగ్యమును సాధించిరి. అవధానమును వారికన్న వేగముగ చేసినవారు, అధిక చమత్కారములు ప్రదర్శించిన వారు వీరితర్వాత కనవత్తురు కాని వీరివలెశాస్త్ర పాండిత్య ప్రాభవముతో వాదు లలో జయపత్రములు పొంది, సభారంజకముగా గీర్వాణాంధ్రములలో నవధానము నడపినవా రరుదు; వీరివలె తోడ్తోడ బహుళసాహిత్యప్రక్రియలు నిర్వహించిన వారును కానరారు.

వీరి భారతనాటకములు పెక్కురు కవులకు సంపూర్ణ భారతనాటకములు రచించుట కుత్తేజము కల్పించినవి. వీరి బుద్ధచరిత్రము బుద్ధదేవుని జీవితచరిత్రము నితివృత్తముగాఁ గైకొన్న పెక్కుకావ్యములకు మార్గదర్శకమైనది. వీరి జాతకచర్య పద్యాత్మక స్వీయచరిత్రలకు త్రోవచూపినది. వీరి జీవితరసఘట్టములు దర్శించి భావించిన సమకాలీనులకు కవిత్వముపై రక్తి కల్గినది; నవ్యతపై భక్తి కుదిరినది; కలముపట్టు శక్తి కలిగినది : తెలుఁగు కవితకు బంధవిముక్తి సిద్ధించినది.

తి. వేం. కవుల కవిత్వ వ్యక్తిత్వప్రభావము భావకవిత్వముపైఁ బ్రస్ఫుట ముగా గోచరించుచున్నది. ఆకాశపురాణాదులరూపమున నొక సంగ్రహకథావస్తువును లఘుకావ్యముగా రచించువైఖరి అష్టావధానప్రక్రియయందును, ఒకనిర్దిష్టమైన అంశముపై గిలిగింతలువెట్టు చమత్కారభావములతో సంగ్రహము, రసవంతము నైన కావ్యఖండికను సృజించుతీరు శతావధానప్రక్రియలందును పొడకట్టి కవుల కొక క్రొత్తచూపును ప్రసాదించెను. వానిలో నిబద్ధమైన కవితాశైలి సహజభావావేము యొక్క సరళావిష్కారమున కుపయుక్తమగు ధారామాధుర్యస్వరూపము నందించినది తి. వేం. కవులు తమరచనాప్రక్రియ లన్నిఁటియందును ప్రస్ఫుటముగాఁ బ్రపంచించిన ఆత్మాశ్రయవస్తుశిల్పము భావికవులకు స్వీయభావానుభూతిని అత్మనాయకమైన కవితగా జెప్పుటకు ప్రోత్సహించినది. దీనికిఁదోడు ఆంగ్లసాహిత్య పరిచయముచేఁ గల్గిన నూతనభావోత్తేజమును తమకవితారీతులలోఁ బ్రవేశపెట్టి ప్రయోగాత్మకముగా

కావ్యరచన మొనరించెడి నిర్భయస్వాతంత్ర్యము వీరి సహజప్రవృత్తినుండి కవులు గ్రహించిరి. ఇట్టి స్వాతంత్ర్యప్రవృత్తికి వీరేశలింగము పంతులుగారు సూత్రదారులుకాగా, తిరుపతివేంకటకవులు స్థాపకులై సామాజికులలో నున్ముఖీకరణము నిర్వహించిరి.

తెలుఁగులో భావకవిత్వమునఁ బైలక్షణములన్నియు ప్రతిబింబించినవి. లఘుకావ్యములు, ఖండకావ్యములు, ఆత్మాశ్రయకవిత్వము, వాస్తవికవాదము-మొ. వాని బాహ్యకృతులుకొన్ని పాశ్చాత్యప్రభావముద్రితములై యున్నను అంతరాకృతులన్నియు తి. వేం. కవుల విశిష్ట కవిత్వప్రసాదవ్యక్తిత్వము నందగించుకొని అవతరించినవే. ఇట్టి కవితాప్రసాదమును భక్తిమై సేవించిన భావకవులు తిరుపతివేంకటేశ్వరులకు కృతజ్ఞతాంజలులఁబట్టి వేనోళ్ళఁ గీర్తించియున్నారు.

—!—

# ద్రుతస్వరూపము

ఆంధ్రభాషలో ద్రుత(ప్రకృతిక)విచారమునకుఁ బ్రత్యేకస్థాన మున్నది. తత్స్వరూపము సమగ్రముగాఁ దెలిసినఁ గాని తదీయములగు కొన్నిసమస్యలు పరిష్కరింపఁబడినట్లు కావు.

''ద్రుతాంతము లయిన పదములు ద్రుతప్రకృతికము'' లని బాలవ్యాకరణము. ద్రుతప్రకృతికములనుగూర్చి 'ద్రుతప్రకృతయో, యే స్యు ర్హ్యానుజీవితద్రుతా నిత్య' మ్మని ఆంధ్రశబ్దచింతామణి. 'యే= ఏవి, నిత్యం= నిత్యమును, అనుజీవిత= అనువర్తించియున్న, ద్రుతాః= నకారము గలవి, స్యుః= అగునో, అవి ద్రుతప్రకృతు లనఁబడునను. 'సూత్రప్రాప్తులచేత లోపములు వచ్చిన వచ్చునే కాని యవి పొల్లునకారముచేఁ గూడియుండునవే యనుట' యని బాలసరస్వతీయము. 'నదానాంతౌ' అని అథర్వణకారికావళి. 'నాంతంబైన పదంబు' లని ఆంధ్రభాషాభూషణము. 'ద్రుతప్రకృతు లనఁబరగున్, లలిఁ బొల్లునకారముపైఁ, గలిగించుట' నని సర్వలక్షణసారసంగ్రహము. పైవ్యాకరణగ్రంథములందలి నిర్వచనములవలన పొల్లునకారము నంతమునందుఁ గలపదములు ద్రుతప్రకృతికము లని యేర్పడు చున్నది.

''నకారంబు ద్రుతం' బని బాలవ్యాకరణము ద్రుతస్వరూపమును నిర్దేశించినది. అందుకు 'ద్రుతాఖ్యో నః' అనుచింతామణిసూత్రము మూల మనఁదగి యున్నది. 'కారప్రత్యయము చేర్చిన హల్లు పొల్లుమాత్రమే యగును' అను ఆంధ్రభాషానుశాసనసూత్రముచే 'నకారంబు ద్రుతం' బను సూత్రమునందలి నకారము పొల్లునకారమే యగుచున్నది. 'నాంతాదియోఽపి' (ఆం. శ. చిం.), 'నాంతౌ' (అ. కా.), 'నాతంబైన' (ఆం. భా. భూ.), 'నుడువులపై నకారంపుఁబొల్లుల్ నిలుచుఁ బోవు' (ఆంధ్రకౌముది) 'పొల్లునకారము ద్రుతసంజ్ఞ కల దని పైసూత్రముల కర్థము (చింతామణివిషయపరిశోధనము)- మొదలగు నిరుక్తులనుబట్టి సాధారణదృష్టితో నకారపుఁబొల్లు ద్రుతముగాఁ బెక్కురువైయాకరణులచే నంగీకరింపఁబడియున్నది.

చిన్నయసూరి పైరీతిగా ద్రుతస్వరూపమును దెల్పి, యందుల కుదాహరణములుగా 'నన్నున్ - నాచేతన్ - నాతోడన్ - నాకొఱకున్ - నావలనన్ - నాకంటెన్ - నాకున్ - మాలోపలన్ - మాయందున్ - వత్తున్ - వచ్చెదన్ - వచ్చెన్ - వచ్చున్ - వచ్చెడున్ - ప్రసన్నులయ్యెడున్ - కావుతన్ - కొట్టుచున్ - కొట్టన్ - కొట్టఁగన్ - కొట్టుడున్ - కొట్టినన్ - వలెన్ - ఎంతయున్ - పోలెన్ - అయ్యున్ - ఇత్యాదు లూహ్యంబు' లని నిబంధించియున్నాఁడు. ఆసందర్భముననే 'నేను-తాను పదంబులును ద్రుతప్రకృతికంబు' లని చెప్పి పైయుదాహరణపట్టికలో 'నేన్ - తాన్' అని చేర్చుటకు మఱచినవాఁ డయ్యెను. పైయుదాహరణములనుబట్టి చిన్నయసూరిభావమున ద్రుత మనఁగా నకారపుఁబొల్లే యని స్పష్టమగుచున్నది.

కాని పైద్రుతప్రకృతికముల నాయాపరిచ్ఛేదములలో సూత్రములచే నిరూపించు సందర్భములలో- 'నన్నున్ + అడిగెన్); నాకొఱకున్ + ఇచ్చె(న్); వచ్చుచున్ + ఉండెను; చూచుచున్ + ఏగెను; అమ్మ + ఇచ్చెను; వచ్చున్ + ఇప్పుడు; పూచెను + కలువలు; తోఁచెను + చుక్కలు; మొగిడెను + పద్మము; వచ్చెను + గోవులు; కన్ + దోయి; వాఁడు వచ్చెన్ - వాఁడువచ్చె- వాఁడువచ్చెను; తాఁజదివె తానుజదివె'-అని ద్రుతమును హల్మాత్రనకారముగనే కాక, ఉత్వవిశిష్టమగు నకారముగాఁ గూడ చిన్నయసూరి నిబంధించియున్నాఁడు. కావుననే 'చింతామణి పక్షమున ద్రుతము పొల్లునకారస్వరూపము గలది. సూరిపక్షమున 'ను'స్వరూపము గలది' యని ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వకారులు వక్కాణించుట జరిగియుండును.

బాలవ్యాకరణమునకు వ్యాఖ్యానమగు 'గుప్తార్థప్రకాశిక'లో 'కేవలనకారంబు ద్రుతనామంబున సామాన్యంబుగా వాడఁబడుచున్నను, ప్రత్యయంబును....ఆగమంబును అన్వయంబునునైన యుకారాంతనకారంబే ద్రుతసంజ్ఞ గలది యని చెప్పుట యుక్త' మని చెప్పఁబడినది. అట్లే బాలవ్యాకరణసారస్యసర్వస్వ పేటికలో 'నాకారంబు ద్రుతంబు' అనుసూత్ర ముత్వవిశిష్టమును బొల్లురూపమునునైన నకారములను రెండిటిని బోధించు నని నిబంధింపఁబడి, తత్స్వరూపము నిర్దేశింపఁబడియున్నది. త్రిలింగలక్షణశేష (ప్రౌఢవ్యాకరణ) కర్తయు 'నకారంబసాధారణంబు ద్రుతంబు- ప్రత్యయాగమాన్వయాత్మక మయి యుత్వవిశిష్ట మయిన నకారంబు ద్రుతసంజ్ఞకంబని యర్థము' అని కంఠోక్తిగాఁ జెప్పివైచెను. అట్లేఆంధ్రభాషానుశాసనకర్తయు 'ఇకారఉకారముతోఁ గూడినదియు' పొల్లుగా నుండునదియు నయిన నకారమునకు

ద్రుత మని పే' రనియు, 'సంధి' గ్రంథకర్తయు 'ఆంధ్రమునఁ గూడ దుది నుకారము లేక హల్మాత్రనకారముతోఁ గూడిన రూపములే ప్రాచుర్యమును వహించి యున్న' వనియు, ఆంధ్రభాషావికాసకర్తయు 'న్, ను, ని అనునవి యన్ని యును ద్రుతస్వరూపములే' యనియు, ద్రుతమును ద్విస్వభావవిశిష్టముగా సంభా వించియున్నారు. 'ఇకారంబుమీఁది కు-ను-వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు (బా. వ్యా, తత్స. 26. సూ.) నను సూత్రముచే ద్రుత-ను-వర్ణము ని-వర్ణ మయి. దానికిఁ దత్తృతీయరూప మేర్పడుటయు సంభవించును. ఈవిధ ముగా ద్రుతస్వరూపనిరూపణమునుగూర్చి మతభేదము లున్నట్లు గోచరింపఁగలదు !

కాని, సాధారణదృష్టితోఁ జూచినయెడల 'ద్రుతాఖ్యో నః' అన్న చింతామణి కిని, 'నకారంబు ద్రుతం' బనిన బాలవ్యాకరణమునకును మతభేద ముండుట కవ కాశ ముండఁగూడదు. 'కళాద్రుతో న యేషాం స్యాత్, అన్యే ద్రుతప్రకృతయో, యేష్వ ర్థ్యానుజీవితా నిత్య' మ్మని చింతామణి పొల్లునకారము గలశబ్దములను ద్రుతప్రకృతికములుగాఁ జెప్పి, 'దేశ్యా దస్మ ద్యుష్మ చ్ఛబ్దాత్సు జసో ర్మమూవు రూచన్తః' అనియు, 'హ్రస్వే టాదౌ నమవాణ్, ద్వయవ ద్వవచనద్వయేఽన్యయో రాత్మా' అనియుఁ దెల్పి 'నేను- తాను' లకు 'ను'వర్ణకములను విధించి, ఆ'ను' వర్ణకమునందలి యుకారమును 'కవిభల్లభైః క్రియాణాం. నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు' అను సూత్రముచే లుప్తపఱచి, వానిని 'నాంతాదయోఽపి గృహ్యతే' యన్నట్లు ద్రుతప్రకృతికములుగా మలఁచినట్లు తేటపడుచున్నది. బాలవ్యాకరణము గూడ 'నేనుతాను' పదంబులును, వలెప్రభృతులును ద్రుతప్రకృతికంబు' లని చెప్పి, 'వలెన్- ఎంతయున్- పోలెన్' అని యుదాహరించుటచే, 'వలె' కెట్లు ద్రుతము చేరెనో, అట్లే 'నేను'తాను'లకుఁ గూడ ద్రుతము చేరి 'నేనున్- తానున్' అని యేర్పడుట కవకాశ మేర్పడినది. చింతామణి యట్లుగాక 'నేను- తాను'లలోని 'ను'వర్ణమునందలి యుత్వమునుండి తల్లోపముచే తద్ద్రుతమును సాధించుకొని. వానిని ద్రుతప్రకృతికములుగాఁ జేసికొన్నది. బాలవ్యాకరణము 'తాను-నేను' పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబులేదు (బా. వ్యా. సం. 23 సూ.), (ఉదా : తాఁజదివె; తానుజదివె) అని యందలి నువర్ణమునే ద్రుతముగాఁ బేర్కొని, దానికి సంశ్లేషము లేదని చెప్పుటయు. 'తాను-నేను'లు పైనఁ జూపినట్లు 'తానున్— నేనున్' అని యేర్పడుట కవకాశము గల్పించుటయు, వచ్చున్-వచ్చెన్-వచ్చెదన్' మొదలగు క్రియారూపములకు 'పూచెను + కలువలు (సంధి. 16 సూ.) వచ్చు

చున్ + ఉండెను (సంధి. సూ. 2.) అనునప్పుడు ద్రుతప్రకృతికముల పట్టికలో 'పొల్లునకారముగా నుండు ద్రుతమునకు 'ఉత్వ'విధాయక మగు సూత్రమును నిబంధింపక 'అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు నని సూత్రించి వాక్య(పాదా)వసానములందలి యుత్వవిశిష్ట ద్రుత- కేవలద్రుత- ప్రకృతికములకుఁ దదుత్వ-తద్ద్రుతలోపమును మాత్రమే సాధించి, తదనురూపముగానే 'వాఁడువచ్చెన్- వాఁడువచ్చె- వాఁడువచ్చెను' అనియు, 'అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్' అనియు నుదాహరణము లిచ్చుటయుఁ బట్టి ద్రుతస్వరూపనిరూపణవిషయమున నం దెంతయుఁ బ్రక్రమ భంగము గోచరించుచున్నది. అందువలననే ప్రౌఢవ్యాకరణ, ఆంధ్రభాషాను శాసనకర్తలును, బా. వ్యా. గుప్తార్థప్రకాశికా,సారస్యసర్వస్వపేటికా- ఆంధ్ర వ్యాకరణసంహితాసర్వస్వకర్తలును 'ను'వర్ణాత్మకద్రుతమునకే ప్రాధాన్య మిచ్చినట్లు గుర్తింపవచ్చును. ఆంధ్రభాషాచరిత్రకారులు 'ఈరీతిగ సంపూర్ణముగా లోపింపఁ గల నకారమే అనఁగా 'న్' అనుపొల్లే ద్రుత మనియు, నీపొల్లుపైఁ గొన్నియెడల అఇఉలు చేరుటయు లోపించుటయుఁ గలుగు ననియు, పదములందు సిద్ధము లగు నని నులు ద్రుతములు కావనియు, నయినను నట్టి సిద్ధములగు ననినులకు ద్రుతము నకువలె వ్యాకరణకార్యములు గలుగుననియుఁ జెప్పఁబడియున్నది' యని నిర్దేశించి, పొల్లునకారరూప మగు ద్రుతమునకు 'అఇఉ'లు చేరి 'నని'లుగా రూపొందుట కవకాశమును జూపెట్టియున్నారు.

కాని నాయభిప్రాయమున చిన్నయసూరి ద్రుతస్వరూపము పొల్లునకారమే కాని, నువర్ణము గాదు. చింతామణి' ద్రుతాఖ్యోనః' అను సూత్రమున కనువాదరూప మగు 'నకారంబు ద్రుతం' బను సూత్రమునుబట్టియు, దానిక్రింద నీయఁబడిన 'నన్నున్— నాచేతన్.... పోలెన్' వంటి యుదాహరణములనుబట్టియు, చిన్నయ సూరిదృష్టిలో 'నకారమే (పొల్లునకారమే) ద్రుత మని స్పష్టపడుచున్నది. ఇంక 'తాను—నేను' అనుపదములవిషయమునఁ గూడ 'తాఁజదివె; తాను జదివె' వంటి యుదాహరణములనుబట్టి, తద్గత నువర్ణమున కుత్వలోపము కల్గుటయు సూచింపఁ బడినది. కాని, యది సూత్రింపఁబడకపోయినంతమాత్రమునఁ దత్స్వరూపతత్త్వ మన్యథా గ్రహించుట న్యాయముగాదు కదా! మఱియు 'అవసానంబునందు ద్రుత స్వరంబున కేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు' (సంధి. 20 సూ.) నను సూత్రమునందలి 'అవసాన' మను పదముచే నది వాక్య-పదావసానము లని

యర్థము చెప్పుకొన వీలు గల్గించుకొనిన యెడల, తాను—నేనుల‘ను’ వర్ణోత్వ లోపమునుబట్టి వానికి ‘తాన్-నేన్’ అని ద్రుతప్రకృతికత్వము సిద్ధించుచున్నది. కాని, యాసూత్రమునందలి ‘వాఁడువచ్చెఁ— వాఁడువచ్చె— వాఁడువచ్చెను; ....బుధసేవన్’ అనునుదాహరణస్వారస్యమునుబట్టియు, తద్గత ‘అవసాన’ మనఁగా ‘వాక్యాంతగతపదానాం చ’ (చింతామణి) అనుసూత్రపు మూలమునుబట్టియు వాక్యాంత మని చెప్పవలసియున్నను కేవలసూత్రమునుబట్టి అవసానమును బదాంత ముగాఁ గూడఁ జెప్పి, తాను—నేనులను బయివిధముగాఁ గూడ సాధించుకొనవచ్చును గదా! అట్లు చేయుట సాంప్రదాయికముగా లేదనుకొన్నయెడల ‘నన్నుఁ—నాచేతఁ’ వంటి యుదాహరణములనుబట్టి ‘కందోయి— ముంగొంగు— క్రొంబసిడి-’ వంటి వానియందలి బిందురూపమునకు తద్ద్రుతత్వవిధాయకసూత్రములు లేవుగనుక ద్రుతత్వము సిద్ధింపదుగదా! అందుచే వ్యాకరణ-సూత్రోదాహరణములను ‘స్థితస్య గతి శ్చింతనీయా’ అను న్యాయముచొప్పున సమన్వయించుకొనినయెడల నట్టిది సాధ్యము కాకపోదు. అప్పుడు సాంప్రదాయకము గాకపోదు! అందుచే తాఁజదివె, తానుజదివె’ వంటి యుదాహరణములనుబట్టి ‘తానునేనులు’ ద్రుతప్రకృతికములే కాక తప్పదు. అట్టిచో తానునేనుపదములు వలె ప్రభృతులలోఁ జేర్చి నిబంధించుట ప్రామాదిక మనక తీరదు! చిన్నయసూరి ‘వచ్చెఁ— వచ్చుఁ; వచ్చెను— వచ్చును’ అని యుదాహరణముల నిచ్చుచో, మొట్టమొదటి ద్రుతప్రకృతికవర్గమునఁ గేవలనామాంతరరూపములను, దరువాత నువర్ణాంతరూపములను నిబంధించి. అతరువాత ‘అవసానంబునందు ద్రుత....బహుళంబుగ నగు’ (సంధి. సూ. 20) నని చెప్పుటనుబట్టియు, నకారంబు ద్రుత మనుటను బట్టియు, నాయనదృష్టిలోఁ గేవలనకారమే- పొల్లునకారమే— ద్రుత మని నిశ్చయింపవచ్చును. నకారపుఁ బొల్లు ద్రుత మగుచో ‘ను’వర్ణద్రుతము, దాని కుత్వసంయోగముచే నేర్పడునట్టిదే యనియు, మొదట నకారపుఁబొ ల్లుండి, దాని కుత్వము పిదపఁ జేరినదే గాని స్వతస్సిద్ధము గాదనియుఁ, గావుననే ‘అవసానంబునందు ద్రుతస్వరంబేని....లోపంబు బహుళంబుగ నగు’ నసుట కవకాశము చిక్కె నని యుఁ దల్లోపవిధాయకసూత్ర స్వారస్యబలముచే నుత్వము ద్రుతముపై దాని ‘ప్రకృతిభావ(స్వత్వ)నివారణమునకై దానిస్థిరత్వమునకై— చేరినట్లు గ్రహింపఁదగుననియు, నందుచే నువర్ణద్రుతము బాల వ్యాకరణమున నెక్కడఁ గానవచ్చుచున్నను. నది నకారపుఁబొల్లు రూపమే ననియు, నదియే చిన్నయసూరి హృదయ మనియు మనము నిర్బాధముగా నిశ్చయింప వచ్చును. అప్పు డాంధ్రవ్యాకరణసంహితాసర్వస్వకారు లన్నట్లు ‘చింతామణిపక్ష

మున ద్రుతము పొల్లునకారపురూపము గలది- సూరిపక్షమున 'ను'స్వరూపము గలది' యని తద్భేదనిరూపణమున కవసరము లేకుండగనే, బాలవ్యాకరణము ద్రుతము నకారపుఁబొల్లే యను నిరుక్తివిషయమునఁ జింతామణితో నేకీభవించు నని సిద్ధాంతరూపమునఁ జెప్పవచ్చును.

నకారపుఁబొ ల్లయిన ద్రుతమునకు 'ను'స్వరూప మేర్పడుటకై చిన్నయ సూరి ప్రత్యేకముగా నొకసూత్రము రచింపకున్నను, తత్పూర్వపరానువృత్తి కవ కాశము గల్గునట్లు సంధి - 17వసూత్రాంతర్భాగముగా 'పూచెను + గలువలు' వంటి యుదాహరణములయందలి 'ను'వర్ణంబునకు' పక్షంబున స్వత్వం బగు; స్వత్వం బనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావ' మని నిబంధించెను. ఇం దప్పకవి 'కూర్చుం డిరి యొండొరు నని కానక, పరపురుషక్రియలఁ బ్రకృతిభావము గలదే ? (అప్పక.) యని చెప్పి 'అజ్విశిష్టత'నే ప్రకృతిభావముగాఁ జెప్పినట్లయ్యెను. ఇట్లజ్విశిష్టతయే 'ప్రకృతిభావము కాఁగా, నదియే 'స్వత్వము'ను గాఁగా ద్రుతమునకు 'స్వత్వం బగు' నన్నప్పుడు దానికి 'అజ్విశిష్టత' గల్గునని యేర్పడును. 'పక్షంబున స్వత్వం బగు నన్నప్పుడు ఆయజ్విష్టత పాక్షిక మని భావము. ఇచ్చట ద్రుతమున కజ్వి శిష్టత యనఁగా 'ఉకారముతోఁ గూడియుండుట' యని చెప్పనగును. అట్లేర్పడిన ద్రుతము 'ను'స్వరూపము గలది కాఁగా, 'ఇకారంబుమీఁది కునువు.... ఇత్వం బగు (తత్స. 26)' ననుసూత్రముచే దానికి 'ఇ'త్వము ప్రాప్తించి, 'ని'స్వరూప మగును. ఇట్లు ద్రుతముయొక్క న్—ను—ని స్వరూపత్రయమున కాకరములు లభించుచున్నవి. 'పరపురుషక్రియలఁ బ్రకృతిభావము గలదే ?' అను నప్పకవిని బట్టి యజంతభాష యగు నాంధ్రభాషాశబ్దముల కజ్విశిష్టతయే స్వరూప మనియు, అట్టి తత్స్వరూపమే 'స్వత్వ'మనఁదగు ననియు. నజ్విష్టతాస్వత్వము ద్రుతమునకుఁ గల్గి, 'ను'స్వరూపము ధరించు ననియుఁ జెప్పవచ్చును. నన్నయభట్టారకుఁడు 'తిజ్మధ్యశేషషష్ఠీ....తూష్ణీమాద్యాః నభిదధతి కళాద్రుతౌ నయేషాం స్యాత్' తని ముందుగాఁ గళాపదనిరూపణము చేయుటమూలమున ఆంధ్రభాష యజంతభాష యని వ్యంగ్యముగా స్థాపించి, ద్రుతసంబంధమాత్రముచేతనే దానికి హలంతత్వము ప్రాప్తించునట్లు సూచించినవాఁ డయ్యెను. కావున నజ్విశిష్టతయే కళాపదములకుఁ దోఁచు ప్రకృతిభావము- స్వరూపత్వము- స్వత్వము ననవచ్చునుగదా ! అట్టి స్వత్వమే ద్రుతమునకు స్థిరత్వమును, ఆంధ్రభాషాస్వాభావ్యమును సంపాదించి యిచ్చుచున్నది ! ఈస్వత్వ మనునది భాషానహజ మైనట్టిదిగా సంభావ్యము గాని, కేవలద్రుతమాత్రసిద్ధముగా భావింపరాదు. ఈదృష్టితోఁ జూచినయెడల హల్మాత్ర

సకారస్వరూప మగు ద్రుతమునకు 'పక్షంబున స్వత్వం బగు' నను స్వత్వవిధాయక సూత్రాంశము అజ్యోగమున కవకాశ మొసఁగునట్టిది కాఁగా, దానికి తరువాతి 'అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు' నను తల్లోప విధాయకసూత్రము శేషభూతమై, ద్రుతనకారపుఁబొల్లునకుఁ బ్రాప్తించిన యచ్చునకుఁ దల్లోపము సాధించుటకుఁ దోడ్పడఁగలదు ! ఈసూత్రద్వయపర్యాలోచనచేఁగూడ ద్రుతస్వరూపము నకారపుఁబొల్లే యని నిరుపద్రవముగా నిరూపిత మగుచున్నది. ద్రుతమున కీస్వత్వవిధానమును అధర్వణుఁడు 'ద్రుతస్య హాలి బిందుస్సాన్య శ్లిష్టత్వం చ క్వచి త్స్వతా' యను సూత్రముచే సంపాదించెను.

ద్రుతస్వభావము :

ద్రుతస్వభావమునుగూర్చి సూచించుచు 'ఉగ్వా ద్రుతప్రకృతికా, త్పరత స్సరశే స్థిరే చ నస్యస్యాత్— నస్యా త్తద్ధర్మేతః— అనాదిషు విభ క్తిషూతోవా' అను ద్రుతసంబంధము గల శబ్దములయందలి కొన్నియెడల లోపము చెందునట్లును, గొన్నియెడల లోపము చెందునట్లును చింతామణిలోఁ జెప్పఁబడియున్నది. ఆభావమునే 'అచాం సంధౌ ద్రుతోఽదృశ్యః స్థితోఽపి చ భవే త్సదా' యను సూత్రమున నిబంధించి అధర్వణుఁడు ద్రుతమున కదృశ్యతయు స్థితిని సాధించెను. ద్రుతస్వభావమును చిన్నయసూరి స్పష్టముగా నిరూపింపకున్నను, ప్రౌఢవ్యాకరణకర్త 'ద్రుత మనఁగా నొల్లనియెడ మఱఁగిపోవు నది యనుట' యని నిర్దేశించి, తత్స్వభావమును వివరించెను. పద్యాంధ్రవ్యాకరణకర్త (మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి–1897) 'ద్రుతము చలభావము గలది' యనియు, గుప్తార్థప్రకాశికాకారుఁడు 'నకారంబునకు ద్రుతం (చలనభావము గలది) బని పే' రనియు, 'ద్రుత మనఁగా జాఱిపోవునది, లేక కరఁగిపోవునది యని యర్థ' మనియు, ఆంధ్రభాషాచరిత్రకర్త 'కావలసినప్పుడు వచ్చి యక్కఱలేనప్పుడు లోపించునది ద్రుత' మనియు, ఆంధ్రవ్యాకరణసంహితా సర్వస్వకారులు "ద్రుతః, పుం—త్రి. జాతద్రవీభావే ఘృతసువర్ణాదౌ" (శబ్దార్థచింతామణి) అనుచొప్పున ద్రుతిని బొందు స్వభావము గలది యనఁగా నొల్లనియెడల లోపించుస్వభావము గలది కాన నీపేరు ద్రుతమునకు సార్థక మగుచున్న" దనియు; దెల్పి తత్స్వభావమును నిరూపించియున్నారు. పైవాక్యములచే ద్రుతమునకు దృశ్యాదృశ్యస్థితులు రెండు గల వనియు, నవి 'తత్ర వక్తా చ కవిః కవి నిబద్ధోవా' (ధ్వన్యాలోకము) అన్నట్లు వక్త్రధీనము లయినట్లును దెలియఁగలము. ఉదా : పూచెన్ + జలజము = పూచెన్ జలజము; పూచెను జలజము; పూచె జలజము— ఇంకన్ +

ఎప్పుడు= ఇంకెప్పుడు- ఇంకనెప్పుడు మొ॥నవి. కాని, 'అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడితొలిహ్రస్వంబుమీఁద ఖండబిందువును, ద్రుతంబునకు లోపంబును లేవు' (సంధి - సూ. 22) అను సూత్రముక్రిందను, వర్గయుక్సరళములు పరము లగునపు డొకానొకచో ద్రుతంబునకుఁ బూర్ణబిందువు గానంబడియెడి (సంధి సూ. 19) అనుసూత్రము క్రిందను నియ్యఁబడిన 'కన్దోయి–కందోయి (కన్ + దోయి)' అను నుదాహరణములందు ద్రుతప్రకృతిక మగు 'కన్'శబ్దమునందలి ద్రుతమునకు సహజధోరణిలో లోపము గలుగవలసియున్నను నది పైసూత్రముచేఁ బ్రత్యేకముగా నపవాదరూపమున నివారింపఁబడి, ద్రుతమునకు ద్రుతత్వమే లుప్తపఱిచిన ట్లయినది! అనఁగా నిట్టి ప్రత్యేకస్థలములలో ద్రుతము సర్వాంగముగా లోపింప దనియుఁ దేలుచున్నది. ఇట్లు 'అవసానంబునందు.... బహుళంబుగా నగు' మొ॥ సూత్రములచే ద్రుతపుద్రుతత్వము సమాస-వాక్యావసానములలో, దృశ్యాదృశ్యమై వక్త్రధీనమై యున్నట్లు గోచరించును.

ద్రుతస్వభావమునుగూర్చి వ్రాయుచు ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వకారులు "తుదిని బ్రకృతిచేతనే నిల్చియుండునది యనఁగ నయ్యది యర్థవిశేషబోధకము గాదు. అట్టిపదము ద్రుతప్రకృతిక మనఁబడును. ఇట్లగుటచే 'రాముఁడును గృష్ణుఁడును వచ్చిరి' మున్నగుచోట్ల 'రాముఁడును గృష్ణుఁడును' మున్నగునవి ద్రుతప్రకృతికము లనిపించుకొనవు. అవి ద్రుతాంతము లనిపించుకొనును. ద్రుతప్రకృతికముల ద్రుత మవసానాదులలో సంధిసూత్రములచొప్పున లోపించునపుడును వాని కవయవార్థభంగము గలుగదు. ఉదా: రామునిచేతను, రామునిచేత మొ॥ పదాంతేతరస్థలస్థితనకారము ద్రుతము కాదు.... ఎద్దానికి ద్రుతవిరహితముగాఁ బ్రయోగముండదో యది ద్రుతప్రకృతిక మనియు, నెయ్యది ద్రుతవిరహితమె యై యుండి యర్థవిశేషకబోధక మగు 'ను'శబ్దముతోఁ జేరుటచే ద్రుతాంతమగుచు నుండునో యది ప్రకృతిక మనిపించుకొనక ద్రుతాంత మనిపించుకొను ననియు గ్రహింపవలయు' నని నిర్ధారించియున్నారు. ఈదృష్టితో నర్థవిశేషబోధకత్వము ద్రుతమునకుఁ గలుగ దని భావింపఁబడినది! కాని బాలవ్యాకరణదృష్టితో 'ద్రుతాంతము లయిన పదంబులు ద్రుతప్రకృతికంబు లనఁబడుటచే ద్రుతాంతములకును ద్రుతప్రకృతికములకును భేదము సాధింపఁబడలే దని చెప్పవచ్చును. పైవ్రాతచే నర్థవిశేషబోధకతారాహిత్యమే ద్రుతస్వభావ మని యేర్పడుచున్నది. కాని, ద్రుతాంతములయందును, ద్రుతప్రకృతికములయందును నుండునది ద్రుతమే

యగుటచేఁ బై వ్రాతనుబట్టికూడ ద్రుతమున కర్థవిశేషబోధకత్వము నివారింప వీలు లేకపోవుచున్నదిగదా! అట్లుగాక ప్రకృతులయం దున్నను, బదాంతములయం దున్నను ద్రుతమున కర్థవిశేషబోధకత్వము కలుగ దని నిష్కర్షింపఁబడుచో సముచ్చయార్థక 'ను'వర్ణసిద్ధద్రుతమునకు ద్రుతత్వమే లేకపోవలసివచ్చును! అట్టిది ఆంధ్రవైయాకరణుల కభిప్రేతము గాక పోవుటవలన ద్రుతస్వభావము నట్లు నిశ్చయించుటకు వీలుగాదేమో!

ద్రుతభేదములు :

ఆంధ్రవ్యాకరణములలో నెచ్చటను ద్రుతభేదము ప్రస్తావింపఁబడలేదు. తొలిసారిగ ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వకారులే ద్రుతాంతము లనియు, ద్రుత ప్రకృతికము లనియు ద్రుతవిశిష్టపదములలో భేదము సాధించుటకుఁ బ్రయత్నించి యున్నారు. అవి ద్రుతతత్త్వమున నవిశిష్టము లగుటచేఁ దద్భేదకరణ మంత సాధకముకాదు. కాని నాయభిప్రాయమున "సిద్ధస్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధ భేదతో ద్వివిధః (ఆం. శ. చిం.)" అని నన్నయభట్టారకుఁ డుపదేశించినట్లు కేవలము పొల్లునకారపురూపము గల ద్రుతమునకు 'తద్ద్రుతం చ బిందుః స్యాత్' అని బిందుత్వముగూడ వ్యపదేశింపఁబడుట వలన ద్రుతముగూడఁ- దత్స్థానీయ మగు బిందువువలెనే- సిద్ధసాధ్యభేదముచే ద్వివిధ మని చెప్పుట యుక్తము. అనఁగా నేద్రుతము వ్యాకరణసూత్రములచే సాధ్యము గాక ప్రకృతియందే గోచరించునో, అది సిద్ధద్రుతము; తదన్యము సాధ్యద్రుత మని భేదింపవచ్చును.

సిద్ధద్రుతము :- బాలవ్యాకరణమునుబట్టి 'వలెన్‌—పోలెన్- (కదున్)' మొదలగు వానియందలి వ్యాకరణసూత్రసాధ్యము గాక పదసిద్ధముగా నుండుటచే, నట్టి ద్రుతము సిద్ధద్రుతమే యనఁదగును. అది- ఆం. వ్యా. సం. సర్వస్వకారు లన్నట్లు అర్థవిశేషబోధక మైనను గాకున్నను, పదమునుండి విడఁదీయరాకుండుటచే సిద్ధమే యనక తప్పదు. దానిస్వరూపమును శబ్దశాస్త్రదృష్టితోఁ గాని, యన్యథా గాని సాధించు ననవలసియుండును!

సాధ్యద్రుతము :- ద్రుతప్రకృతికక్షేత్రమున సాధ్యద్రుతమున కున్న ప్రాచుర్యము సిద్ధద్రుతమునకుఁ గనఁబడదు. చిన్నయసూరి యిచ్చిన ద్రుతప్రకృతిక వర్గమునందలి 'నన్నున్' నుండి కొట్టినన్.... ఎంతయున్- అయ్యన్' వఱకుఁ గల పదములయందలిద్రుతము సంధి-సమాస-తత్సమాదిపరిచ్ఛేదములయందలి వివిధసూత్రములచే సాధ్యపడి యీవిభాగమునఁ జేరుచున్నది.

ఈసాధ్యద్రుతముగూడ ఆగమ—లోపవిధానప్రక్రియల ననుసరించి ద్వివిధముగాఁ గనఁబడుచున్నది. బాలవ్యాకరణమునందలి—

"సమాసంబుల నుదంతంబు లగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు."

"తలఁద్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపము లేదు" (తలఁద్రాలు, సేసఁద్రాలు మొ॥).

"ఉదంత మగు తద్ధర్మార్థవిశేషణంబున కచ్చు పరంబగునపుడు నుగాగమం బగు." (చేయునతఁడు మొ॥)

మొదలగుసూత్రములచే నజంత మగు పూర్వపదముపై 'ను'గాగమము(న్) విధింపఁబడి, ఆ 'నుక్కు'నందలి నకారపుఁబొల్లు ద్రుతరూపమును ధరించి, పూర్వపదమున కంటుకొనియుండి పరపదముమీఁద ద్రుతకార్యములు జరుపుటచే, నది సాధ్యద్రుతమే యనఁదగి యున్నది. ద్రుతకార్యములస్వరూప మిప్పుడే విచారింపఁబడును. కొన్నియెడల 'ఆగమ ముపు వర్ణంబుల కందు వర్ణంబు పరం బగునపుడు నుగాగమం బగు' (తత్స. 29) ననుసూత్రముచే 'వనమునందు' మొదలగుచోట్ల ద్రుతము కలిగి పదప్రత్యయముల కనుసంధాయక మగుచున్నది. 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి (సంధి. సూ. 21) (ఉదా; అదియునున్గాక, దివంబునుంబోలె) ననుసూత్రముచే సముచ్చయార్థక 'ను'వరము ద్రుతీకరింపఁబడి, అట్టి ద్రుతముపై మఱియొక (నకారరూప) ద్రుతము వచ్చి ద్రుతకార్యములు నిర్వహింపఁబడుటయుఁ గలదు! ప్రౌఢవ్యాకరణమునఁ 'గొన్నియెడలఁ బ్రామాణికప్రయోగములం ద్రుతంబుల కచ్చు పరంబగునపుడు ద్విత్వము చూపట్టెడి (సంధి. సూ. 3) నను సూత్రముచే 'సర్వమున్ + అతని= సర్వమున్ + న్ + అతని= సర్వమున్నతని' అని యేర్పడుట కాకర మేర్పడుచున్నది. కాని, ద్రుతముపై నకారము కలుగుట సాధ్యపడిన పై బాలవ్యాకరణసూత్రమునందలి నకారమును ప్రౌఢవ్యాకరణము ద్విత్వ మని నిబంధించెను గాని, బాల-ప్రౌఢ వ్యాకరణముల కీవిషయమున వస్తుతః భేద మున్నట్లు కన్పట్టదు! చిన్నయసూరి 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి' నను సూత్రమునందలి 'కొన్నియెడల' నను పదము పరమగు పదము నచ్చునిగాని హల్లునిగాని నిర్దేశింపక పోవుటచే 'సర్వము న్నతని' యను నుదాహరణము దానిచేతనే సాధ్య మగుటకు

వీలుగలుగకపోదు ! సూరి యిచ్చినయు త్తరపదపు హలాదిత్వమునుబట్టి (అది యను + గాక; దివంబును + బోలె) యాసూత్రము హలాదిపద మని ప్రౌఢ వ్యాకరణక ర్త భావించుకొని తనసూత్రమును నిర్మించియున్నాఁ డనవచ్చును. ఈ విధముగా నీసాధ్యద్రుతము నామ-క్రియావిభ క్తి-ప్రత్యయములందే గాక, సమాసమునను లేక పదద్వయమధ్యమునను నాగమించి ద్రుతకార్యములు నిర్వహించుచున్నది. ఇట్లే యాలోచించి యాగమసాధ్యద్రుతస్వరూపస్వభావములను సాధించు కొనవచ్చును !

ఇఁక లోపవిధానప్రక్రియనుబట్టి సాధ్యద్రుతస్వరూపము పరికింతము. బాల వ్యాకరణమునందలి- "అవసానంబునందు ద్రుతస్వరంబునకేని లోపంబు బహుళంబుగా నగు- వాఁడు వచ్చెన్- వాఁడు వచ్చె" మొదలగునవి. అట్లే తాను + జదివె' వంటి చోట్ల 'తాను'నందలి యుత్వము లోపించినచో 'తాన్' అయి, 'తాఁ జదివె' నని యగుట సుకరము; లేదా యందలి 'ను'వర్ణ ద్రుతమునే స్వరసహితముగా లోపింపఁజేయవలసిన పరిస్థితి యేర్పడును. సంధిసూత్రము 19చే నకార మాత్రద్రుతమున కేర్పడు నవ్యాశిష్టత యీసూత్రముచే వారింపఁబడుటయే గాక, ప్రధానద్రుతముగూడ లోపించుట కవకాశము సంభవించును. ఇట్టిది యీసాధ్య ద్రుతమునకుఁ గల సామాన్యప్రక్రియ !

కావి ద్రుతాంతములు గాక యజంతము లగు కొన్నిశబ్దములను సమాస విషయమునను, దదితరత్రను, ద్రుతాంతములుగా మలఁచుటకై లోపప్రక్రియ యాశ్రయింపఁబడి, అట్లు సాధింపఁబడి పదావయవరూపముగా నుండు నకారము గూడ 'ద్రుతమే' యని పారిభాషికముగా సంభావింపఁబడినది. ఉదాహరణార్థము ; 'కన్ను + దోయి' అను సమాస—సంధి సందర్భమున— 'అకారంబుల క్రింది అకారంబులకుం దుది ములుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగా నగు, (ప్రకీ. ప. సూ. 7)- అను సూత్రముచే పైసమాసము 'కను + దోయి' యని కాఁగా, 'పదాంతంబు లయి యసంయు క్తంబు లయిన ను-లు-రుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు (మాను + పడె= మాన్పడె; మిను + వడె = మిన్వడె)' (ప్రకీ. ప. సూ. 16) నను సూత్రముచే, కన్ + దోయి = కన్దోయి' యని కాఁగా అఁట యికఁ చుఁడు శబ్దంబులం దప్ప నుడితొలిహ్రస్వంబుమీఁది ఖండబిందువును, ద్రుతంబునకు లోపంబును లేవు' '(ఉదా ; కన్దోయి)' (సంధి. సూ. 22) అను సూత్రముచే నిందలి 'కన్'శబ్దమునందలి యవయవరూపనకారము

ద్రుతముగానే చిన్నయసూరికి భావించినట్లును, అదినుడితొలిహ్రస్వంబుపై నుండు టచే 17వసూత్రముచేఁ గల్గఁదగినట్లు, దానికి లోపము లేనట్లును గ్రహింపవచ్చును. అనఁగా నిచ్చటి 'కన్'సందలి ద్రుతము పదావయవరూప మనియే బాల వ్యాకరణమునుబట్టి తెలియుచున్నది. అనఁగాఁ బదావయవరూప నకారముగూడ నిట్లు ద్రుతముగా భావింపఁబడుట ఆంధ్రవ్యాకరణసంప్రదాయ మనియు, నది బాహుళక మగుటచే నన్నియెడల గానరా దనియు గ్రహింపవచ్చును. ఇట్లే- ఏఁబది (ప్రౌఢ. వ్యా. సమా. 24) అనుదానియందలి యవయవరూపనకారము ద్రుతముగా గ్రహింపఁబడి, ద్రుతకార్యములు నిర్వర్తించినది! గుప్తార్థప్రకాశికాకారుఁడు 'కన్దోయి'యందలి ద్రుతసాధనము నిట్లే గావించెను. సారస్యసర్వస్వపేటికా కర్తయు నట్లే తెల్పి, 'యిందలి పొల్లునకారము శబ్దసహజమే యనక తీరదు ... గత్యంతరము లేమి నిచ్చోమాత్రము 'కన్'అను నవయవనకారమే సూరి ద్రుత మని వ్యవహరించి బిందువిధానముం జేసి 'కందోయి' రూపసిద్ధి యొనర్చె ననియుఁ, గొంద ఱంద్రు. సూరి యిచ్చోఁ దన ద్రుతసంజ్ఞ గుదురమిని, ప్రౌఢవ్యాకర్త ఏఁబది యిత్యాదులయందుఁ బలె (చూ. ప్రౌ. సమా. 24) నేమియు నెఱుంగని వానివలె బిందువు నవయవనకారమునకు విధించె నని మాత్ర మనకతీరదని 'కన్' నందలి నకారపుఁబొల్లున కిష్టములేకయే సూరిమతము ననుసరించి ద్రుతత్వము చెప్పుకొనుట జరిగినది. ఈసందర్భమున ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వకారు లిచ్చటి నకారపు టావయవిత్వమును నివారించి యది యాగమనకారమే యని నిరూపించుటకై యిట్లు మఱొకవిధముగాఁ బ్రక్రియను జూపియున్నారు. "కన్ను యొక్క + దోయి = కన్ను + దోయి' యను షష్ఠీసమాసమున బా. వ్యా. సంధి. 25వసూత్రము చొప్పున నుక్కు రాగా 'కన్ను + ను + దోయి' అని యేర్పడును. ఇఁట నిక్కలాదిసూత్రముచొప్పున (బా. సమా. 20 సూ. దీని వివరణము ప్రౌఢ సమా. 36 సూ.) 'కన్ను' అను దానిలోని 'న్ను' అనుభాగము లోపింపఁగా, 'క + ను + దోయి' అని యేర్పడును. ఇందలి నుగాగమద్రుతము ప్రకృత సూత్రము (19సూ.)చే నిండుసున్న కాఁగా 'కందోయి' అనురూపము సిద్ధించు" నని సాధింపఁబడినది. కాని యిట్టిప్రక్రియగూడఁ 'గృతక మగుచు' శబ్దతత్త్వ శాస్త్రపద్ధతికి విలక్షణ మగుచు' న్నట్లు చింతామణివిషయపరిశోధనమున వారే వ్రాక్రుచ్చియున్నారు. ఏది యెట్లున్నను 'కన్'అందలి నకారమునకు ద్రుతత్వము మాత్ర మంగీకరింపఁబడుటచే నది సాధ్యద్రుతముక్రిందికి వచ్చునని చెప్పవచ్చును.

ద్రుతపరిణతు (వికారము)లు :

స్వరూపముచే ద్రుతము నకారపుఁబోల్లే యైనను, నది పదమధ్యమునఁ గాని, పదాంతమునఁ గాని, వాక్యాంతమునఁ గాని యట్లే యుండక కొన్నిపరిణతులను బొందుచున్నది. ఈవిషయమున సర్వాంధ్రవ్యాకరణములును దమసమ్మతిని జూపుచునే యున్నవి.

ద్రుతమునకు స్వత్వ-బిందు- సంశ్లేష- లోపములు— అను చతుర్విధపరిణతులు గలవు. ఇవి ద్రుతము యొక్క పరిణతులు. ద్రుతముమీఁది పరుషములను సరళములుగాఁ జేయుట ద్రుతమువలని పరిణతి యని చెప్పవచ్చును. ఈవిధముగా ద్రుతముయొక్క ద్రుతమువలని పరిణతి యని యది ముందు ద్వివిధ మగుచున్నది. ఆతరువాత ద్రుతముయొక్క పరిణతి చతుర్విధ మగుచున్నది. అందు స్వత్వ మనఁగా ద్రుతముపయి 'ఉ, ఇ, అ'లచే దాని కుచ్చారణ స్థిరత్వము గల్పించుట యగును. బిందువు పూర్ణార్థబిందురూపమున ద్వివిధము, సంశ్లేషము 'మీఁది హల్లుతోఁ గూడికొనుట' యని బాలవ్యాకరణము; లోపము ద్రుతలోపము, ద్రుత స్వరలోపము నని ద్వివిధముగాఁ గానవచ్చుచున్నది. ఇట్లు ద్రుతముయొక్క పరిణతి వివరముగా షడ్విధముగాఁ నున్నట్లు తెలియవచ్చును. బాలవ్యాకరణసూత్రములనుబట్టి యీవిషయ మిచ్చట నిరూపింపఁబడును.

(1) "ద్రుతప్రకృతికములమీఁది పరుషములకు సరళము లగు" (సంధి. సూ. 16)

ఇది ద్రుతమువలని పరిణతి యనఁ దగును.

(2) "ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషలు విభాష నగు. పక్షంబున స్వత్వం బగు" (సూ. 17)

పూచెను గలువలు; పూచెఁ గలువలు; పూచెం గలువలు; పూచె న్గలువలు.

(3) "అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు" (సూ. 20)

(వాఁడు వచ్చెను) వాఁడు వచ్చెన్- వాఁడు వచ్చె.

(4) "సమాసంబునయందు ద్రుతంబునకు లోపంబగు." (సూ. 24)

(5) "సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు." (సూ. 26)

ఇట్టి పైసూత్రములచే ద్రుత మెట్టిపరిణతులను బొందుచుండునో నిరూపిత మైనది.

కాని 'సంశ్లేషపరిణతి'నిగూర్చి వ్యాకర్తలలో నభిప్రాయభేదము గానవచ్చుచున్నది. 'సంశ్లేషం బనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట' యని బాలవ్యాకరణము నిర్దేశించి; 'పూచెన్గలువలు' వంటి యుదాహరణముల నిచ్చినది. కాని, ఆంధ్ర శబ్దచింతామణి వ్యాఖ్యాత యగు బాలసరస్వతి 'అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సంతి తే పరతః- అలుకిచ సంశ్లేష స్స్యాత్' ఆను సూత్రములకు వ్యాఖ్య వ్రాయుచు—

(అ) తస్మిన్నపి = అద్రుతమును, అవికారగతే సతి = బింద్వాదివికారమును బొందక పోవుచుండఁగా, తే = ఆపరుషవర్ణములు, పరతః = పరమందున్నప్పుడు, సరళావివ = గజడదబలే యగును. అంబన్ గొలిచెద; శుభమున్ బడసెద, నిన్ గనియెద; తన్ గొలుతురు.

(ఆ) అలుకిచ = లోపములేని పక్షమందు, సంశ్లేషః = పూర్వవర్ణముతో సంయోగము, స్యాత్ = అగును. ఉ; కాంచెన్ బావ; రక్షించెన్ మాధవుఁడు" అని చెప్పెను. ఈభాగమును వివరించుచు ఆంధ్రవ్యాకరణసంహితాసర్వస్వకారులు- "దీనినిబట్టి ద్రుతము నకారవ్యంజనముతో నుండి పరహల్లులో సంయోగించి యుండుట చింతామణిమతమున స్వత్వ మని విశదమగుచున్నది. 'లుక్సంశ్లేషౌ నాఽచిద్రుతస్య' అనుసూత్రముదొప్పున నకారవ్యంజ్యనరూపద్రుతము పూర్వాచ్చున త్తియుండుట చింతామణిమతమున సంశ్లేషము. 'వచ్చెన్ వాఁడు' మున్నగుచోటులందు ద్రుతమునకు వకారముతోఁ గల సంయోగములో నట్టిసంయోగాది నున్న ద్రుతము పూర్వస్వరమునకుఁగాని పరస్వరమునకుఁగాని యంగముగాఁ బల్కనగును గాన నందుఁ బూర్వస్వరాంగ మగుట సంశ్లేష మనఁబడును! పరస్వరాంగ మగుట స్వత్వ మనిపించుకొనును. సంశ్లేషము- వచ్చెన్ వాఁడు. స్వత్వము— వచ్చెన్వాఁడు." అని నిరూపించియున్నారు. ఇదే భావము చింతామణివిషయ పరిశోధన (131-132 పేరాల) లో సాధింపఁబడినది.

అహోబలపత్యాదులు 'లుగభావే నస్య పరవర్ణే నసాకం సంశ్లేష శ్చ భవేత్ చకారేణ స్వరూపేణావస్థితిః' అనినట్లు అధర్వణకారికావళి టీకాకారుఁడగు ద్వితింత్రిణీ సీతారామకవి 'ద్రుతస్య హలి బిందుస్స్యాత్, శ్లిష్టత్వం చ క్వచిత్స్వతా'

అను సూత్రమునకు టీక వ్రాసి యుదాహరణము లిచ్చుచు 'ఉదా : వచ్చెం గమలాక్షుఁడు, ఎచ్చె న్గమలాక్షుఁడు, వచ్చెను గమలాక్షుఁడు- వచ్చె గదాధరుఁడు ఇవి మొ.' అని చూపెను. బాలవ్యాకరణపు సంశ్లేషస్వరూపము లహోబలపత్యాదుల యను సరణరూపము లని ఆం. వ్యా. సం. సర్వస్వకారు లనుచున్నారు. ఔను గూడ.

కాని, ఆం. వ్యా. సం. సర్వస్వకారులు బహుశః బాలసరస్వతీయమునుండి సంశ్లేషస్వరూపమును గ్రహించి, దానిని 'సంయోగాది ర్వా (ఋ. ప్రాతిశాఖ్య)' అను ప్రాతిశాఖ్యయొక్క పార్షదవ్యాఖ్య (సంయోగాదిభూతో వర్ణః స్వరాంతరే వర్తమానః పూర్వస్య వా స్వరస్యాంగం భవతి పరస్య వా) తో సమర్థించి యున్నారు. వారినిబట్టి 'వచ్చెఀ వాఁడు' అనుదానియందలి ద్రుతము పూర్వస్వరాంగముగను, 'వచ్చెన్వాఁడు' అను దానియందలి ద్రుతము పరస్వరాంగముగను బలుకుటయే ద్రుత–సంశ్లేషస్వత్వములకు హేతు వగును. అదియే చింతామణికారుని యభిప్రాయ మైనచో, రెండుదాహరణములలోని ద్రుతము బింద్వాది వికారములను బొందక నకారవ్యంజనరూపముతో నున్న దని మాత్రము చెప్పవచ్చును. ద్రుతమును 'వచ్చెఀవాఁడు' అని యత్యంతసూక్ష్మ మగు వ్యవధానముతో నైనను ద్రుతము నుచ్చరించినపుడే యది పూర్వస్వరాంగము గాఁ గలదు గాని యన్యథా కానేరదు గదా ! ద్రుతముమీఁది ప్రత్యేకదృష్టితో న ట్లుచ్చరించునప్పుడు పూర్వస్వరమున కూఁత (accent) యేర్పడును గదా ! అట్లూతతోఁ గూడిన పూర్వస్వరము నత్తియుండు నట్లును, బరపదముతోడి స్వల్పవ్యవధానము గల్గునట్లును నుచ్చరించినయెడల నట్టి ద్రుతస్థితికి సంశ్లేష మని పేరనఁబడినది. ఇది బాలసరస్వతీయకర్త ననుసరించిన ఆం. వ్యా. సం. సర్వస్వకారుల వ్యాఖ్యానము గాని నన్నయభట్టుహృదయ మగునో కాదో తెలియదు. తత్స్వరూప నిర్దేశ మాయనచే స్పష్టముగాఁ జేయఁబడలేదు. అవికారగతే తస్మి న్నపి సరళా ఏవ సంతి తే పరతః' అను సూత్రసందర్భమునుబట్టి ద్రుతస్పర్శచేఁ బరుషములు సరళములగుటయుఁ దద్ద్రుతము బిందు వగుటయుఁ దత్సూత్రపూర్వభాగముననే నిర్దేశింపఁబడినది గనుక- ద్రుతము బింద్వాదివికారము పొందక ద్రుత (నకార వ్యంజన) రూపముననే నిల్చియుఁ బరుషసరళీకరణరూపద్రుతకార్యము నిర్వహించు స్థలము లెట్టివో, తత్ప్రయోజన మేమో నిష్కృష్టముగా నిర్ణయింపఁబడలేదు ! 'అంబన్ గొలిచెద' 'శుభమున్ బడసెద' (బాలసరస్వతీయము) వంటి యుదాహరణములచే నిందలి ద్రుతాంతపూర్వపదము పూర్వపాదాంతముననను, బరపదము పరపదాదియందును నుండుచోఁ దదుచ్చారణకుఁ గావలసినంత స్వల్పవ్యవధానము

లభించి, యట్టి ద్రుతస్థితికిఁ గొంతయాకర మేర్పడును. మఱియు బాలసరస్వతీ యాదులనుబట్టి ద్రుతము పూర్వస్వరము నత్తియుండుట యనఁగా నేమి ? పదాంత మందలి ద్రుతమునకుఁ బూర్వ మెప్పుడును స్వరమే యుండునుగాని వ్యంజన ముండదు గదా ! అప్పు డాద్రుతము పూర్వస్వరము నంటి (యత్తి) యుండక యన్యథా యెట్లుండఁగలదు ? అట్లున్నను ద్రుతము స్వస్వరూపమున- నకార వ్యంజనరూపమున నున్నదే గనుక. దానిని మఱల ననవసరముగా 'సంశ్లేష' మని మఱియొకపేరు పెట్టనేల ? అనఁగా ద్రుత మెక్కడ- నెప్పు- డున్నను స్వరాశ్ర యము లేక యుండదు గనుక, అట్టి స్వరాశ్రయమునే 'సంశ్లేష' మనునెడల, ద్రుతము యొక్క సహజస్థితియే సంశ్లేషము కాఁగలదుగదా ! అట్టిదానికి- అనఁగాఁ దత్సం శ్లేషరూపమునకు అథర్వణాదులు 'సత్వ' మని పిల్చుటలో విశేషమేమి గలదు ?

మఱియుఁ బరస్వరాంగ మయి దాని నత్తియుండు ద్రుతముయొక్కస్థితి- 'వచ్చెన్వాఁడు' వంటి యుదాహరణములలో వలె స్వత్వ మనఁబడుట యెట్లో తెలియకున్నది. 'వచ్చెన్వాడు'లోని ద్రుతము తర్వాత వ్యంజన మగు వకార మున్నది గాని స్వరము లేకపోవుట వలన నది పరస్వరాంగ మగుట యెట్లు ? తరువాతి వకారముమీఁది 'అ'కారమున కది యంగ మని చెప్పుచో, నప్పుడు ద్రుతము ప్రథమమున వకారముతోఁ గూడి- అనఁగా సంశ్లిష్టపడి- అప్పు డా సంశ్లిష్ట (సంయుక్త) వర్ణ మాకారాంగ మగుచోఁ గానవచ్చును గాని, ద్రుతమే తదాకారాంగ మగు నని చెప్పవలసిన యవసర మేమి కలిగినట్లు ? అట్టిది దూరా న్వయము కాదా ? అందుచే 'సంయోగాదిర్వా' యను ప్రాతిశాఖ్య 'పార్షద'వ్యాఖ్య యిచ్చిన పరస్వరాంగత్వవ్యవహారము ఆంధ్రభాషయందలి ద్రుతస్వత్వనిర్ణాయకము కాఁజాలదు. పైఁగా నిచ్చిన యుదాహరణమున ద్రుతమునకుఁ బరముగా స్వరమును లేదు. ఉన్న 'ఆ'కారస్వరమునకుఁ బ్రథమాంగము వకారము గాని నకారము గాదు. ద్రుతస్వత్వదృష్టితోఁ జూచినయెడల నది రెండుదాహరణములలోను నొక్క రూపముతో నున్న దగుటచే- నయిన నది సంశ్లేషమైనఁ గావలయును; స్వత్వ మైనఁ గావలయును గాని రెండును గానేరదు ! ఒక్కొక్కప్పుడు కవి 'వచ్చె, న్వాఁడు' అని పద్యపాదమును బ్రారంభించి, యతిస్థానమున వకారమునకు యతి వేయక నకారమునకు యతివేయఁ దలఁచినప్పు డిట్టి సంశ్లిష్టద్రుతనిబంధనమున కవసర మేర్పడవచ్చునుగదా ! అట్టియెడల నిట్టి ద్రుతసంశ్లేషపరిణతి సప్రయోజ నము కాఁగలఁదు ! సాధారణదృష్టితో రెండుమూఁడువ్యంజనముల సంయుక్తతను

బట్టి యది 'సంయుక్తవర్ణ' మనఁబడినట్లు, ద్రుతపరిణతిస్థలమునఁ బారిభాషికముగా ద్రుతసంయుక్త వర్ణము 'సంశ్లిష్ట' మనియు. అట్టి ద్రుతపరిణతికి 'సంశ్లేష' మనియుఁ జెప్పినఁ జాల సమంజసముగా నుండునుగదా ! ద్రుతస్వత్వ మనఁగా నాంధ్రభాషాపవసాధారణ మగు నజ్విశిష్టత యని యీవ్యాసముననే ముందు సూచించినవిధముగా గ్రహించుచో ద్రుతపరిణతినిగూర్చి స్పష్టనిర్దేశములు లభించుట కవకాశ మున్నది.

ద్రుతపరిణతిసందర్భమున 'ఎదు త-ల ద్రుతంబున కచ్చు పరంబగు నపుడు మకారం బగు' (బాల. వ్యా. క్రియా. 28) నను సూత్రముచేతను, 'ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు (ప్రౌఢ. వ్యా. సంధి. సూ. 22) అను సూత్రముచేతను, ద్రుతమునకు బింద్వాదిపూర్వోక్తవికారములే గాక, మకారాదేశముచేఁ దాద్రూప్యమును బొందుటయుఁ గలదు ! అట్టి పరిణతియు మహాకవిప్రయోగసిద్ధ మయియున్నది.

ఈచిన్నవ్యాసమున ద్రుతస్వరూపనిరూపణమును గూర్చి యథాశక్తి వ్రాయఁబడినది. ద్రుత మనఁగా ఆం. వ్యా. సం. సర్వస్వకారులు నన్నయభట్టారక హృదయముగా నిశ్చయించినట్లు నకారవ్యంజనరూపమే ననియు, దాని కాంధ్రభాషా సంప్రదాయానురోధముగా- అది హల్మాత్రము గనుక- తత్స్థిరత్వసిద్ధికై ఇ-ఉ-అకారములు చేరుట యను యజ్విశిష్టతయే స్వత్వము గల్గుట యనియు నేర్పడు చున్నవి. స్వాభావికదృష్టితో ద్రుతము వక్త్రభిప్రాయానుసారముగా దృశ్యాదృశ్య వికృత(పరిణత)స్థితులు గల దనియుఁ జెప్పఁబడుచున్నది. అట్లే ద్రుతము విభేద దృష్టితో సిద్ధ-సాధ్యము లని ద్వివిధముగా వెలయుచున్నది. అది మఱియుఁ బరిణతిదృష్టితో బిందు-లోప-సంశ్లేష-స్వత్వా-న్యధారూపములుగా గోచరించుచున్నది. ఇంతటి స్వరూపప్రభావము గల ద్రుతమునకు భాషాశాస్త్రదృష్టితోఁ జూచినయెడలఁ దచ్చరిత్ర మింకను లభించును !

# బుద్ధ చరిత్రము

పరమదయావిదగ్ధుఁ డగు బుద్ధుఁడు జగత్ప్రసిద్ధుఁడు. భరతఖండమునందు ప్రభవించి అసియాఖండమంతటను తన దివ్యప్రబోధప్రకాశముచే వెలుగులు నింపిన దివ్యజ్యోతి యాదయామయుఁడు. అట్టివిశిష్టమతప్రవర్తక యగు బుద్ధుఁడు ప్రాచ్య పాశ్చాత్య కావ్యములందుఁ గీర్తింపఁబడియున్నాఁడు. అందు గీర్వాణసాహిత్యము నందలి అశ్వఘోషుని బుద్ధచరిత్రకును, పాశ్చాత్యసాహిత్యములలో నెడ్విన్ ఆర్నాల్డ్ ఆంగ్లమున రచించిన 'లైట్ ఆఫ్ ఏసియా' (Light of Asia) కును ప్రపంచమున నధికమైన ప్రఖ్యాతి కలదు. ఆరెండుకావ్యముల నాధారముగాఁగొని తిరుపతివేంకటకవులచే తెలుఁగున రచింపఁబడిన కావ్యము 'బుద్ధచరిత్రము.' ఏతద్రచనకు పోలవరముజమీందా రగు శ్రీవేంకటకృష్ణరావుభూపతిగారి యాదర ప్రోత్సాహములు లభించినవి

బుద్ధచరిత్ర మొక విచిత్రమైన అనువాదము. అడ్విన్ ఆర్నాల్డు వ్రాసిన Light of Asia ను బుద్ధచరిత్రగా మొదట కవు లనువదించిరి. కవుల కాంగ్లము రామి బ్ర. శ్రీ. చావలి సూర్యప్రకాశరావుగారిచే మూలమునందలిభావము వ్రాయించుకొని దాని నాధారముగాఁ గొని వారు కావ్యరచన మొనర్చియుండిరి. కావున నిందు శబ్దానుకరణ మంత యుండక భావానువాద ముండుటకే అధికావకాశము కలదు. అటుతరువాత కవులు అశ్వఘోషుని "బుద్ధచరితము" నుండి కొన్ని శ్లోకముల ననువదించి యిందుఁ జొప్పించియుండుటచే [1]నీకావ్యమునకు మూలద్వయ మేర్పడినది. సంస్కృతశ్లోకముల ననువదించుపట్లయు భావానువాదప్రక్రియయే కవులచే ననుసరింపఁబడినది.

బుద్ధచరిత్రమునందలి యంగిరసము దయావీరము. దయాసముద్రుఁడగు సిద్ధార్థుఁడు వార్ధకరుజామరణాదులచే వ్యథచెందు జగత్తును గాంచి, జాలిఁజెంది తత్తరణోపాయమునుగూర్చి చింతించుచు సన్యస్తుఁడై సాధకుఁడై ధ్యానియై,

1. దివాకరాస్తమయము - పు. 4-8.

బుద్ధుఁడై, ప్రబోధకుఁడై లోకకల్యాణమును సాధించిన మహావీరుఁడు. అతనిచిత్త మొక మహాసముద్ర మగుచో నందలి జలము దయ; అందలి అలలు జ్ఞానసాధనోత్సాహప్రవృత్తులు; ఆజ్ఞానతరంగములుబ్బెత్తుగాలేచి ఉన్నత సిద్ధినిపొంది లోకులకు దానిని బోధించి, వారినిఁదరింపఁజేసి మఱల సముద్రములో లీనమైపోవును. అనఁగా దయావీరమునకు, జ్ఞానవీరము దీపక మనిభావము. దయావీర మంగి, జ్ఞానవీర మంగము. అందువలననే కవులు—

"బుద్ధునకుఁ గల యెక్కుండు భూతదయను
గూర్చి మానేర్చుగతి నిట్లు గొంతదనుక
వ్రాసినారము" అని పేర్కొనియున్నారు. —షష్ఠాం. 102.

అశ్వఘోషుఁడు బుద్ధచరితమును ముముక్షుభావోపేతముగాఁ దీర్చి దిద్ది శాంతరసప్రధానమొనర్చినాఁడు. కాని ఆర్నాల్డు బుద్ధదేవునిచరితను దయా ప్రధానముగా దర్శించి తదనుగుణముగా దానిని మలచినాఁడు. అందువలననే బుద్ధచరితమునందులేనివి, బుద్ధుని దయారసపోషకములైనవి యగు. హంసప్రాణరక్షణము, బింబిసారుని యజ్ఞపశువును విశనమునుండి రక్షించుట, మృతబాలుని గూర్చిన కథ మొ॥ ఉపాఖ్యానములు Light of Asia లోఁ జోటుచేసికొనినవి. అశ్వఘోషుని దృష్టి నాయకునియందు విషయవైముఖ్యముతోఁ గూడిన ముముక్షుభావము ప్రదర్శించుట కాగా అర్నాల్డు దృష్టి విశ్వభూతదయామూలకమైన నాయకప్రవృత్తి దయాచోదితమైన జ్ఞానవృత్తి నాశ్రయించి, దయాభావముచేతనే క్రమోన్మీలనము చెంది ఫలించి దయాప్రేరణచే మఱల లోకోద్ధరణ మొనర్చినట్లు గ్రహించుటయైనది. ఆత్మసిద్ధిని పొందుటతో నాఁగక లోకాభ్యున్నతి నభిలషించు బుద్ధునియం దార్నాల్డు అశ్వఘోషుఁడు చూడని దయాభావోన్నతిని దర్శించి యావేశముతో వర్ణించియున్నాఁడు. వీరిలో నొకరు నివృత్తికి ప్రవృత్తి నంగముగా నిల్ప మఱియొకరు ప్రవృత్తికి నివృత్తి నంగముగా నిల్పినారు. ఇద్దఱును వారివారి దృష్టులచే నభినందనీయులే. వీరిద్దరిలో తి. వేం. కవులు రసవిషయమున నార్నాల్డునే యొజ్జబంతిగాఁ బెట్టుకొనినారు.

బుద్ధచరిత్రమందలి యితివృత్తమంతయు Light of Asia ననుసరించియే వ్రాయఁబడినది. ఆశ్వాసవిభజనాదులు కూడ కొన్నిఁట యథాతథముగా నొనర్పబడినవి. Light of Asia 8 అధ్యాయములలో (Books) రచింపఁబడఁగా బుద్ధచరిత్రము 6 ఆశ్వాసములలో ముగింపఁబడినది. కాని మూలమునందలి యే ప్రధానాంశమును ఇందువదలఁబడలేదు. మూలమునందు చిన్నవిగా నున్న ద్వితీయ

తృతీయాధ్యాయములను పంచమ షష్ఠాశ్వాసములను కలిపివైచి ద్వితీయ చతుర్థాశ్వాసములుగా కవులు నిర్మించుటచే నాయాశ్వాససంఖ్యావ్యత్యాసము గోచరించుచున్నది. విషయవిభాగసౌలభ్యము, విభాగమునం దొక స్వయంసమగ్రత గల్పించుట, నాతివైపుల్యము నాతిసంగ్రహమునై యుండుట యనెడిగుణములచే తెలుఁగున నాశ్వాసవిభాగ మౌచిత్యభరితమై యొప్పుచున్నది.

Light of Asia లోని భావములు కాక సంస్కృత బుద్ధచరిత్రమునుండి కవులు దాదాపు పదిచోట్ల అశ్వఘోషుని భావములను అనుసరించి యిందుఁబొందుపఱచినట్లు పరిశీలించినచో తేలుచున్నది. సంస్కృతమునందలి ప్రథమ ద్వితీయ చతుర్థషష్ఠాష్టమైకాదశద్వాదశత్రయోదశాధ్యాయములనుండి రమ్యములైన కథార్థములను గ్రహించినను అష్టమద్వాదశాధ్యాయములను చాలవరకుఁ దెలుఁగునకుఁ దీసికొనివచ్చిరి. సంస్కృతమునుండి యీకావ్యమునఁజేరిన నూతన ఘట్టములు ఈ క్రిందఁ బేర్కొనఁబడుచున్నవి. .1 కావ్యారంభమునందలి నగరవర్ణనము 2. పురోహితనందనుఁడు బుద్ధునికొనర్చు హితబోధ, 3. మహాభినిష్క్రమణానంతరము అంతఃపురజనము బుద్ధవియోగమువలన దుఃఖించుట, 4. సిద్ధార్థుఁడు బింబిసారునితో 'కామనిగర్హణము' గూర్చిచేసిన యుపన్యాసముమొదలగునవి. అంతియగాక అసితఋషిభాషణములు, సర్వార్థసిద్ధునిజన్మసమయమున లోకమునఁ గానఁబడిన శుభలక్షణములవర్ణనము; పుష్పవనవిహారవర్ణనము అనువానిని కవులాంగ్లమూలముకంటెఁ బెంచిరచించిరి. మారవిజయఘట్టము, సిద్ధార్థుని విద్యాభ్యాసవర్ణనము, నగరవిహారసన్నివేశములు, సిద్ధార్థుఁడు మహాభినిష్క్రమణానంతరము చెన్నునికిచ్చు సందేశము, అరాడముని తాత్త్వికోపదేశము, బుద్ధుని ధర్మబోధ- వీనిని కవులు మూలముకంటె సంగ్రహించి రచించిరి.

## 1. కావ్యారంభమునందలి నగర వర్ణనము :

ప్రాచీనగీర్వాణాంధ్రకావ్యములు నగరవర్ణనముతోఁ దఱచు ప్రారంభ మగుట యొక సంప్రదాయము. తత్సంప్రదాయపోషణార్థమై యీవర్ణన మశ్వఘోషుని ననుసరించి యొనర్పఁబడినది. ఇది ఆర్నాల్డులో లేదు. ఇది భావానువాదము: అందు మూలమునందలి భావము గైకొనుచు తద్విరుద్ధముగాఁ దెలుఁగున ననువదించి స్వీయకల్పనాచమత్కృతి ప్రదర్శించుట కుదాహరణము నగరకాంతాసౌందర్య వర్ణనము.

(a) మూలము :

శ్లో. "రామా ముఖేన్దూన్ పరిభూత పద్మాన్
దృష్ట్వాభిమానీ శిశిరాంశురేవ
సంతాప యోగా దివ వారి వేష్టుం
పశ్చాత్సముద్రాభిముఖం ప్రతస్థే." —సం. బు. 1-6.

అనువాదము :

మ. తనపై నేస్తము గల్గు తమ్ములకు సంతాపంబు గావించు వా
రని కాంతాముఖ చంద్రులం జెనక నిత్యంబుం బతంగుండు త
ద్ఘన సౌధంబులు త్రోవఁబోవుచుఁ గడుం గాలించియుం జూచి కా
నని చింతం బడుచుండుఁ బ్రత్యగుదధిం దాఁ గోపరక్తాంగుఁడై. —బుద్ధ. ప్ర. 54.

సంస్కృతమున సంతాపయోగముచే పశ్చిమాంబుధిఁగ్రుంకినది చంద్రుఁడు. తెలుఁగున సూర్యుఁడు. రామాముఖేందుబింబములను గాంచి యీర్ష్యతో చంద్రుడు నరాభూతుఁడైనాఁడనుటవలన స్త్రీముఖ రామణీయకము చంద్రాతిశాయిగాఁ జెప్పఁబడు చున్నది. మూలమున నది యొక్కటేప్రయోజనము. తెలుఁగునఁ జేసిన మార్పువలన బహ్వర్థప్రయోజనములు సాధితములగుచున్నవి. 1. కాంతాముఖములు చంద్రబింబములనుట, 2. స్త్రీ లసూర్యంపశ్యలనుట, 3. భవనరాజములున్నతములనుట, 4. అవమానముచే మొదట చింతించినను కాంతలు కానరాలే దను క్రోధముచే సూర్యుఁడు రక్తాంగుఁడయ్యెనని వర్ణించుట, 5. 'ఘనసౌధంబులత్రోవ' యనుట లోని శ్లేషయందు "మేఘములనెడి భవనములుగలత్రోవ" యని యేర్పడి అకాశ మనెడి యర్థముస్ఫురించుట. మూలాతిశయముగా నాంధ్రీకరించెడి కవులప్రతిభ నీ పద్యము చాటిచెప్పుచున్నది.

(b) మూలభావము నౌచిత్యదృష్టితోఁబెంచి రచించుట కుదాహరణము : నగరహర్మ్యముల వర్ణనము.

మూలము :

"సితోన్నతత్వేన గుణేన హృత్వా
కైలాసశైలస్య యదగ్రశోభాం
భ్రమా దుపేతాన్ వహ దంబువాహాన్
సంభావనాం కిం సఫలీ చకార." —సం. బు. 1—3.

అనువాదము :

చ. అమితసితోన్నతంబు లగు హర్మ్యములం గని వెండికొండ నె
త్తము లను భ్రాంతినొంది జలదంబులు నిచ్చలు విశ్రమించుచున్
బ్రమదమున న్నయంబునఁ బ్రభావమున న్రజతాద్రితోడఁ దు
ల్య మని తలంచు పౌరుల యథార్థమనీషులఁ జేయుఁ దత్పురిన్.
—బుద్ధ. 1-51.

ఇందలి చివరి రెండుపాదము లించుమించు అమూలకములే. మూలమున భవన శిఖరములు సితోన్నతత్వగుణమాత్రముచే కైలాసతుల్యము లగుచుండ తెలుఁగున ప్రమదము, నయము, ప్రభావము అనెడి గుణములు కూడ చేర్పఁబడినవి. మూలమున యథార్థబుద్ధి అచేతనము లగు మేఘములకుఁ గల్గుచున్నది. అందుఁ గల ననౌచిత్యమును తొలఁగించి తెలుఁగునఁ బౌరులకు యథార్థమనీషిత్వము గల్పింపఁబడినది. కవుల యౌచిత్యపోషణ మపారమీ పద్యమున.

## 2. పురోహితనందనుని ప్రబోధము :

సంస్కృత బుద్ధచరితములో నిది చతుర్థాశ్వాసమునఁ గలదు. నగరవిహారమందు సిద్ధార్థుఁడు వృద్ధరోగశవాదులఁ గన్గొని సంవేగమానసుఁడై యున్న తరుణమున నగరోద్యానవనమున స్త్రీవిలాసములఁ జూడఁ బంపఁబడును. అచ్చట విషయసుఖభోగానుకూలప్రబోధము పురోహితుఁడు రెండుపర్యాయము లొనర్చును. దానికి బుద్ధుఁడు సముచిత సమాధాన మిచ్చును. కవు లీపురోహితనందనుని ప్రబోధము ద్వితీయాశ్వాసమున ననుసంధించిరి. ఇం దాతఁడు సిద్ధార్థుని హృదయమును వివాహోన్ముఖముగా నొనర్చుటకు ప్రబోధించెను. ఈపురోహితుని పాత్రకల్పనకు సంస్కృత బుద్ధచరిత్రము మూలమైనను కవులు మూలముకన్న కావ్యార్థముల నధికముగా నాపాత్రవలన సాధింపఁగల్గిరి. మూలమున ప్రబోధము విఫలమై వ్యర్థమగుచుండ తెలుఁగున సఫలమై నాయకుని వివాహమున కొప్పించినది. ఈఘట్టమునందలి కొన్ని యనువాదాంశములు :

(a) ఛాయానువాదము :

శ్లో. అహితాత్ ప్రతిషేధశ్చ హితే చానుప్రవర్తనమ్
వ్యసనే చాపరిత్యాగ స్త్రివిధం మిత్రలక్షణమ్. —సం. బు. 4-64.

క. హితమార్గము గఱపుటయు న
హితమార్గమునందు నడువనీకుంటయు దు
స్థితి గతియును దుర్వ్యసనా
వృత్తియును మరలించుటయు సుహృల్లక్షణముల్. —బు. 2-22.

(b) కొన్నిశ్లోకముల తాత్పర్యభావము నొక్కవృత్తమునఁ దెనిఁగించుట :

శ్లో. కామం పరమితి జ్ఞాత్వా దేవోఽపి హి పురన్దరః
గౌతమస్య మునేఃపత్నీ మహల్యాం చకమేపురా.

శ్లో. అగస్త్యః ప్రార్థయామాస సోమభార్యాం చ రోహిణీం
తస్మాత్తత్సదృశీం లేభే లోపాముద్రా మితి శ్రుతిః.

శ్లో. బృహస్పతే ర్మహిష్యాం చ జుహ్వాత్యాం జుహ్వాతాంవరః
బుధం విబుధ కర్మాణం జనయామాస చంద్రమాః.

శ్లో. ఉతథ్యస్య చ భార్యాయాం మమతాయాం మహాతపః
మారుత్యాం జనయామాస భరద్వాజం బృహస్పతిః.

శ్లో. కాలీం చైవ పురాకన్యాం జలప్రభవసంభవాం
జగామ యమునా తీరే జాతరాగః పరాశరః.

—సం. బు. 4 సర్గ. శ్లో. 72, 73. 74. 75, 76.

సీ. జడదారిసకితోఁడ జతగూడె వేవేలు
వెలఁదులు గలవాఁడు వేల్పుఱేఁడు;
జాబిల్లిపడతితో సరసంబు గావించెఁ
దపసి లోపాముద్రధర్మభర్త;
దైవతగురుని కాంతాలలామము తోడఁ
గవగూడె శిష్యుఁడై కలువఱేఁడు;
ఔతథ్యఋషిపత్ని యగు మరుత్పుత్రితో
సావాస మొనరించె దేవగురుఁడు;

తే. గీ. దాశపుత్త్రికతోడఁ బరాశరుండు
పట్టపవలు నదీతటీభాగమందు
దగులు గావించె; నిన్ని వింతలును దలఁపఁ
గామమును గెల్చువారు లోకమునఁ గలరె ? —బు. ద్వి. 31.

**అంతఃపుర విలాపము :**

"అంతఃపుర విలాపః" అనెడి నామముతో నశ్వఘోషుని బుద్ధచరితమున 87 శ్లోకములుగల అష్టమాధ్యాయము చాలవఱకు తెలుఁగున సంగ్రహముగ ననువదింపఁబడినది. పునస్సమాగమాకాంక్షావిరహితులై శుద్ధోదన యశోధరాదులు సిద్ధార్థుని కొఱకై విలపించుట యిందలి యితివృత్త మగుటచే నిది కరుణరస ప్రధానమైనది. పఠితకు కరుణమిశ్రితమైన దయాభావము పాత్రలయందు స్ఫురించునట్లు చిత్రించుట యిందలి శిల్పము. ఇందు యశోధరా శోక మతిరసవత్తరముగ వర్ణితమై యున్నది. ఉ॥ సర్వార్థసిద్ధుని నరణ్యమున దింపివచ్చిన కంటకాశ్వము నుద్దేశించి విలపించుచు యశోధర యనినమాటలు భావానువాదమునకుఁ జక్కని యుదాహరణములు :

శ్లో. వరం మనుష్యస్య విచక్షణో రిపు
ర్నమిత్ర మప్రాజ్ఞ మయోగపేశలమ్
సుహృద్బ్రువేణ హ్యవిపశ్చితా త్వయా
కుతః కులస్యాస్య మహానుపప్లవః.

శ్లో. ఇమా హి శోచ్యా వ్యవముక్తభూషణాః
ప్రసక్తబాష్పావిలరక్తలోచనాః
స్థితేఽపి పత్యౌ హిమవన్మహీసమే
ప్రనష్టశోభా విధవా ఇవ స్త్రియః.

శ్లో. అనార్యకర్మా భృశ మద్య హేషతే
నరేంద్ర ధిష్ణ్యం ప్రతిపూరయ న్నివ
యదాతు నిర్వాహయతిస్మ మే ప్రియం
తదా హి మూకస్తురగాధమోఽభవత్. —సం. బు; 8-35, 36, 40.

ఆ. వె. తెలివి లేని స్నేహితులు గల్గుటయెకంటెఁ
దెలివి గల్గు శత్రుకులమ మేలు;
మిత్రరూప మైన శత్రువవై శాక్య
వంశ మంతరింప వచ్చి తీవు.

చ. అవిరళబాష్పపాత గమితారుణభావము లైన కన్నులున్
రవణము లుజ్జగించి నునురాణకుఁ బాసిన మేనుఁగల్గునీ

యువిదలు నీకతంబున నలో యని యేడ్చుచు భ_ర్త యుండియున్
ధవుఁడు గతించియుండిన యనాథలచందముఁ బొంది రర్వమా!

చ. మగటిమి లేని యీతెలివిమాలిన కృత్యముఁ జేసి యిప్పుడి
ప్పగిది నరేంద్రసద్మ మద్రువన్ సకిలించిన నేమిలాభ ? మ
మ్మగల విభూషణంబు ధృతిమంతునిఁ దోడ్కొనిపోవువేళ నీ
మొగమున ముల్లునాటెనె ప్రబోధ మొనర్పకపోతి మమ్మలన్.

—బుద్ధ. తృ. 155-156.

4. కామనిగర్హణము :

"కామనిగర్హణః" అనుపేరుతో సంస్కృతమున నేకాదశాశ్వాస మశ్వఘోషునిచే రచింపఁబడెను. సన్యాసియై యున్న సిద్ధార్థునిఁ గాంచి బింబిసారుఁడు జాలిపడి సంసారసుఖములఁ గైకొను మని ప్రబోధించెను. బుద్ధుఁడు కామనిగర్హణాత్మకమైన యుపన్యాస మొనర్చి తన కృతనిశ్చయమును దెల్పెను. ఈసన్నివేశము సిద్ధార్థుని యకుంఠితదీక్ష కొక్కపరీక్ష. కామనిగర్హణముచే నతని సుస్థిరమైన మనస్సంకల్పము ద్యోతమాన మగుట యీసన్నివేశఫలము. జ్ఞానవీర ముజ్జ్వలమై భాసించుట ప్రయోజనము. రుచిరార్థదము లగు సూక్తుల నెన్నుకొని కవులను వదించియుండుట యిందలి ప్రత్యేకత. మచ్చునకు :

శ్లో. అన్ధాయ యశ్చ స్పృహయే దనన్ధో
బుద్ధాయ ముక్తో విధనాయ చాఢ్యః
ఉన్మత్తచిత్తాయ చ కల్య చిత్తః
స్పృహాం స కుర్యా ద్విషయాత్మకాయ. —సం. బు. 11-53.

క. అంధు ననంధుఁడు, నిర్ధను
నిం ధని, యున్మత్తచిత్తునిం దృఢమతియున్
సంధింపని గతి దుర్విష
యాంధులతో మైత్రిఁ జేయ ప్రాజ్ఞుఁడు గలఁడే. —బు. 4-79.

అసితఋషిభాషణములు :

ఆంగ్లమూలమందలి రసార్ద్రములగు వాక్యములను యథాతథముగ ననువదించి, గీర్వాణమునుండి యలంకారవైభవము వెలార్చెడి నాల్గైదు శ్లోకములను

గై కొని యాఘట్టమును కవులు విపులరమణీయముగా నొనర్చి యుండిరి. ఆంగ్లానువాదమున కుదాహరణము :

"...........Thou art Budh
And thou wilt preach the Law and save all flesh
Who learn the Law, though I shall never hear
Dying too soon, who lately longed to die."

Light of Asia I-5p.

క. బుద్ధుఁడ వై జగముల కవి
రుద్ధం బగు జ్ఞాన మిచ్చి ప్రోచుచును నసం
బద్ధపు మతములఁ ద్రుంచుచు
నిద్ధచరిత నెగడఁ బుట్టి తీవు మహాత్మా !

క. ఏ నతివృద్ధుఁడ నగుటన్
జ్ఞానము నీవలనఁ బొందఁగా నోఁచఁగ లే
దై నను జగమెల్లను ని
న్నాని తరించుటకు శంకయుండదు దేవా ! —బు. ప్ర. 108-109.

సంస్కృతానువాదమునకు :

శ్లో. ప్రజ్ఞాంబువేగాం స్థిరశీలవప్రాం
సమాధి శీతాం వ్రతచక్రవాకం
అస్యోత్తమాం ధర్మనదీం ప్రవృత్తాం
తృష్ణార్దితః పశ్యతి జీవలోకః. —సం. బు. 1-71.

ఆంధ్రానువాదము :

క. వ్రతములు చక్రంబులుగాఁ
బ్రతిభ జలంబుగ, సమాధి పారంబులుగా
వితతమగు ధర్మనది నీ
రితఁడే త్రావించువాఁడు తృష్ణార్దితులన్. —బు. 1-113.

రమణీయభావము లేమూలమున నున్న వానిని గ్రహించి గ్రథించెడి కవుల యాశయమే యావిస్తృత రచనకు హేతువై యుండు నని భావింపవచ్చును.

**6. సర్వార్థసిద్ధుని జన్మకాల శుభసూచనములు :**

తిరుపతివేంకటకవు లీఘట్టమున సంస్కృతమునుండి గైకొనిన పెక్కు శ్లోకముల భావములను పరిమితవృత్తములలోనే నిమిడ్చి రచించియుండిరి. ఉదా : సం.బు. లోని 2సర్గలోని1 నుండి 9 శ్లో. భావము-బు.చ. 1 ఆశ్వా. 125 పద్య. సీసపద్యమునందు కుదింపఁబడినది. అంగ్లమున నశుభసూచనల ప్రసక్తి నూచ్య ప్రాయముగా నుండ దానిని సంస్కృతాధారమునఁ బెంపుచేసి ప్రకృతిపై మహాత్ముల ప్రభావము ప్రసరించినట్లు చిత్రించెడి ప్రాచీనకావ్యమర్యాదను నిలువఁబెట్టి రని యిచ్చట చెప్పవచ్చును.

**7. పుష్పవన విహారము :**

ఇది అశ్వఘోషుని కావ్యమునుండి గైకొనిన ఘట్టము. కామవిలాసముల నుత్కటముగా నాయకునిముందు బ్రదర్శింపించి చలింపని ధృతిని యతనియందు వ్యంజింపఁజేయుట యీఘట్టమువలని ప్రయోజనము. మూలమునందు విపులముగా నున్న స్త్రీవిలాస వర్ణనలలోఁ గొన్నిఁటినిఁ గైకొని కవులు ద్వితీయాశ్వాసమున రచించిరి. ఉదా: ఉపమాలంకారము :

శ్లో. అథనారీజనవృతః కుమారో వ్యచర ద్వనమ్
వాసితాయూథసహితః కరీవ హిమవద్వనమ్. —సం. బు.4-27.

క. సరసిఁ గరణీవృతం బగు
కరిపగిది పురస్సహస్ర కాంతలనడుమన్
ధరణీంద్రకుమారుండును
గరము ప్రకాశించెఁ బుష్పకాననమందున్. —బు. ద్వి. 103.

**8. మారవిజయఘట్టము :**

ఆంగ్లగీర్వాణముల ననుసరించి యీభాగము తెలుఁగున నాతివిపుల మయ్యు సారవంతమై యొప్పుచున్నది, మన్మథునిధాటి కెదురొడ్డి నిర్వాణపదము నందుకొనిన బుద్ధుని తపశ్చర్య కిది పోషకమై వరలుచున్నది. శృంగారరౌద్రరసాభాసము లిందు భాసించి అంగిరసమునకుఁ బుష్టి కల్గించుచున్నవి. తపశ్చర్య ఎచ్చట వచ్చినను ఇట్టి మన్మథపరీక్షలు కల్పించుట ప్రాచీనుల తపోవీర పోషణశిల్పమున నొకప్రక్రియ. తద్రహస్య మెఱిఁగి దీనికి కథలో సముచితస్థాన మిచ్చి కవులు పోషించియుండిరి.

9. సిద్ధార్థుని విద్యాభ్యాసము : Light of Asia లో విపులముగా నున్న యీఘట్టము సారవంతముగను, సంగ్రహముగను దెనుఁగునఁ దేఁబడినది.

10. ఇతరములు : తిరుపతివేంకటకవులు మూలమునందు విపులముగా పెక్కంశముల నౌచిత్య మెఱిఁగి సంగ్రహించి తమకావ్యములందు రచించిరి. వానిని పరిశీలకులు గుర్తించుట సులభము.

బుద్ధచరిత్ర మాంగ్లభాషనుండి యనువదింపఁబడినను భాష, భావము, శైలి, స్వతంత్రకావ్యములందువలెనే సహజమై యొప్పారుచున్నది. అన్యభాషాకావ్య తాత్పర్యమును ప్రతిభచే నాకళించుకొని పునస్సృష్టివలె నొనర్చిన కవులు నిజ ముగా నభినందనీయులు. అనువాదముతోపాటు స్వీయకల్పనాశక్తిచే కావ్యమునం దొనర్చిన మార్పులలో, కొన్ని అతిరమణీయములుగా నున్నవి.

1. బుద్ధుఁ డయోనిజుఁ డని అశ్వఘోషుని కావ్యము. యోనిజుఁ డని ఆర్నాల్డు. రెండవమతము ననుసరించి కవులు కథాస్వాభావికత్వమును రక్షించిరి.

2. గర్భిణీస్త్రీలు కాన్పునకుఁ బుట్టింటికిఁ బోవు నాచారము మాయాదేవిపట్ల వర్ణించి లుంబినీవనగమనమునకుఁ జక్కని హేతువును కవులు కల్పించిరి.

3. వసంతఋతువున ప్రకృతి జంతుసంతతిపై వేయు ప్రభావమును వర్ణించుచు కావ్యార్థములకును, కథాగమనమునకును, తోడ్పడునట్లు చేయుట : ప్రథమాశ్వాసమున సర్వార్థసిద్ధుఁడు వసంతశోభను జూచుటకై పురబహిర్భాగములం దలి వనములందు చరింప నిచ్ఛగించెను. తత్కార్యమునకుఁ గారణముగా ఋతు వర్ణనము చేయుట యిందు గమనింపఁదగినది. లేనిచో—

తే. గీ. "పట్టణముకన్నఁ బల్లెయుఁ బల్లెకంటె
నుపవనంబును మఱియు నయ్యుపవనంబు
కంటె వనమును మేటిసౌఖ్యంబు గూర్ప
గలవి యై యొప్పె నామని బలియు కొలఁది."

(బు. ప్ర. 174) అను అమూల్య వర్ణనాంశమునకు స్థాన మెక్కడిది ? కల్పిత కావ్యార్థ సంచయమంతయు నిరర్థకము కాదని యిందు తేలిన సారాంశము.

4. నాయకునియందు ధీరవీరగుణ ముద్దీపించునట్లు సుప్రబుద్ధునిచేఁ గల్పింపఁబడిన స్వయంవర పరీక్షలయందు సిద్ధార్థుని పరాక్రమము రసవంతముగ వర్ణితమైనది.

5. మనోభావ సంఘర్షణకు అమూలకమైన ఉదాహరణము :

మ. ఒకకొం తేగును, సంశయించును; సముద్యుక్తత్వముం జెందు వే
ఱొకకొం తేగు, యథాస్థితిం గను; నిరుద్యోగమ్ము వాటించు; వె
న్కకుఁ దోతెంచుట కిచ్చగించు నఁట; సన్యాసార్థియే యౌనుగా
కకటా! యెవ్వనికేని శక్యమగునా? యర్ధాంగి వర్జించుటల్.

—బు. 3-69.

6. సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనములు కల్పితములై వర్తిల్లుట మఱియొక విశేషము. ఉదా: తృతీయాశ్వాసమునందలి సూర్యాస్తమయ వర్ణనము :

శా. సిద్ధార్థుడిఁక నేటిరాత్రి మొద లాసింపండు సంసార మా
నద్ధజ్ఞానమునం జగం బఖిలము న్సంధింప సన్న్యాసమ
న్పద్ధర్మంబు వహించు నంచుఁ బృథివిం జాటించి యాపైనుద
న్వద్ధామస్థులకు న్వచింపఁ జనె నా వారాశిఁ జేరె న్వడిన్. —బు. 3.15.

"తరుణి ననన్యకాంత" యను పద్యము రచించిన పెద్దన ప్రభావ మిందు స్పష్టము. సిద్ధార్థునికి దివ్యదృష్టి యొదవినపిదప చతుర్థాశ్వాసమున వర్ణితమైన సూర్యోదయ వర్ణనము ప్రకృతిపురుష పరస్పర ప్రభావనిరూపణ సమర్థమై యలరారుచున్నది.

7. బుద్ధధర్మబోధసుధామృతమునందలి క్లిష్టతరము లగు, తాత్త్వికబోధలను Light of Asia ననుసరించి అరటిపం డొలిచి చేతి కిచ్చినయట్లు సరళ సుందరముగా రచించుట కవులసామర్థ్యనకుఁ జక్కని తార్కాణము. కొన్ని యుదాహరణములు :

బుద్ధుఁడు నిర్వాణకాంక్షులకుఁ జెప్పిన నాల్గుతత్త్వములు :
(a) ప్రథమతత్త్వమున నొక్క పద్యము.

"The First Truth is of Sorrow. Be not mocked!
Life which ye prize is long-rawn dagony;

Only its pains abide; its pleasures are
As birds which light and fly." —Book VIII-F 147p.

చ. ప్రతి నరజీవితమ్ముఁ గడుబాములపా లని నమ్ముఁ డుద్భవ
స్థితి మొద లెన్నియో కలుగు జీవునకుం దురవస్థ; లెన్నఁడే
నతితరసౌఖ్య మబ్బినను నయ్యది పక్షివిధమ్మున న్నయో
ద్గతిఁ గనుఁగాని శాశ్వతము గా దది మీ కనుభూతమౌ కదా!
—బు. 6-49.

(b) ద్వితీయతత్త్వమున నొక పద్యము :

"The Second Truth is Sorrow's Cause. What grief
Springs of itself and springs not of Desire ?
Senses and things perceived mingle and light
Passion's quick spark of fire." —(Book VIII-147p.)

తే. గీ. సర్వదుఃఖమ్ములకును దృష్ణయె ప్రధాన
కారణంబు తనంతన కల్గు దుఃఖ
మెయ్యదియు నెందుఁ గావరా దింద్రియమ్మ
లర్థములును మనోవృత్తి నలమఁజేయు. —షష్ఠా. 56.

(c) తృతీయ తత్త్వమున నొక పద్యము :

"Then sorrow ends, for Life and Death have ceased;
How should lamps flicker when their oil is spent ?
The old sad count is clear, the new is clean,
Thus hath a man content" —(Book VIII. 149p,

తే. గీ. స్వచ్ఛముగ వెల్గి దీపంబు చమురుతోడ
న శమియించెడి చందమ్మునఁ గ్రమముగఁ బొ
సంగుఁ గర్మరాహిత్యంబు జన్మరహిత
తయును సమకాలమున నింత తథ్య మరయ. —షష్ఠా. 61.

(d) చతుర్థతత్త్వమైన నిర్వాణపథమునకుఁ గొన్ని సోపానములు చెప్పఁబడినవి. అందు మూఁడవదానిని గూర్చిన పద్యము :

"The Third is Right Discourse. Govern the lips
As they were palace-doors, the King within;
Tranquil and fair and courteous be all words
Which from that presence win." —Book VIII. 150p.

తే. గీ. "భూపతి వసించు కోటతల్పుల విధమునఁ
దమ పెదవు లెల్లపుడు మూయఁ దలఁపవలయు
నెప్పుడేనియునుఁ దెరచిర యేని వచ్చు
పల్కులన్నియు శాంతిమైఁ బరఁగవలయు." —షష్ఠా. 66.

9. తిరుపతివేంకటకవులు ఆయాసమయములం దుచితమైన మనఃప్రవృత్తులను సుస్పష్టముగాఁ జిత్రించి నాయకపాత్రను క్రమోన్మీలితముగాఁ దీర్చిదిద్దిరి.

కపిలవస్తుపురాధీశుఁ డగు శుద్ధోదనుని పట్టమహిషి దైవసంకల్పమున గాంచిన స్వప్నము బుద్ధభగవానుని యవతారమునకు నాంది నాలపించినది. స్వాప్నికఫల దర్శకులు తదర్థ వివరణము సేయుచు, నిట్లు వ్రాక్రుచ్చిరి :

"ఆ పుణ్యాత్ముఁడు సార్వభౌమ పదవిం బ్రాపించి సామంతభూ
మీపాలు ర్దనుఁ గొల్వ నెల్లరును మేల్మేలంచు శ్లాఘింప నా
శాపాలేశుని భంగి యీ భువనము న్పాసించుఁ గాదేని వి
ద్యాపూర్ణుం డయి సర్వలోకులకు నిత్యానంద మిచ్చున్ గృపన్."—ప్ర.77

అం దెట్టివాఁడైనను సిద్ధార్థుఁడు ప్రసిద్ధుఁడే యగును. మహారాజును, ప్రజలును, అతఁడు సమ్రాట్టు కావలె నని ఆశించిరి; దేవతలును, తపస్వులు నాతఁడు జ్ఞాని కావలె నని వాంఛించిరి. మహాయోగి యగు అసితుఁడు బుద్ధుని జన్మము విని కపిల వస్తుపురమునకు వచ్చి బాలుని దర్శించి—

"బుద్ధుఁడవై జగముల కవిరుద్ధం బగు జ్ఞాన మిచ్చి ప్రోచుచును నసం
బద్ధపు మతములఁ ద్రుంచుచు నిద్ధచరిత నెగడఁ బుట్టి తీవు మహాత్మా !"
—ప్ర. 108;

అని అతని జన్మహేతువును నిరూపించి తెల్పినాఁడు.

సిద్ధార్థునకు పుట్టుకతోడనే సూక్ష్మమైనబుద్ధియు, నిశితపరిశీలనా పాటవమును, శీలసంపదయు, దయామయత్వమును నైజముగా నుదయించినవి. సర్వవిద్యా

విశారదుఁడయి సర్వభూతదయామయుఁడై చరించినాఁడు. మహారాజునకు గారాబపు బిడ్డఁ డగుటచే కష్టమనునది లేశమైన నెఱుఁగఁడు.

"శోకము బాధయుఁ గన్నీ
రాఁకలి యను శబ్దములన యతఁ డెఱుఁగుం; ద
ద్వ్యాకులత యించుకేనియు
నా కరుణాకరున కెఱుక యనఁదగ దొకటన్." —ప్ర. 144.

సిద్ధార్థుఁ డొకనాఁడు మిత్రులగు దేవదత్తాదులతో హిమవత్పర్వత పాదమున విహరించుచుండెను. ఆకసమున నంచలబారులు రమ్యముగా ధవళతోరణములవలె నొప్పారుచు నెగురుచుండెను. దేవదత్తుఁ డొక యంచను బాణమునఁ గొట్టెను. అది విలవిలఁ దన్నికొనుచు సిద్ధార్థునిముందు పడెను. దానిని గాంచిన తోడనే సిద్ధార్థుని హృదయమున వాసనామయముగా నున్న దయ మేల్కాంచినది.

"గిలగిల గొట్టికొనఁగ న
య్యలఘుం డిది యేల యిట్టు లార్తింగను ? న
మ్మలికిం బుచ్ఛితిగాఁదే
కలిగెనె వేఱెద్దియేనిఁ గారణ మనుచున్."

"తన కాయమునం దయ్యలుఁ
గును గ్రుచ్చియుఁ బుచ్చియును బుగుల్కొను నార్తిన్
దనలో నెఱింగి యనుభవ
మునకుం దెచ్చుకొని మిగుల మొనసిన కరుణిన్."
—ప్ర. 151, 152,

అరటి పూరేకులవంటి ఆ యంచ రెక్కలను నేర్పుతో నిమురుచు, వనౌషధులఁ బూసి దాని బాధను కొంత యుపశమింపఁజేసెను. లౌకిక విభావములఁ గాంచిన తోడనే తాదాత్మ్యవస్థ నొంది ద్రవీభూతుఁడగు సిద్ధార్థుఁ డసమానదయామయుఁడు, రసార్ద్ర హృదయుఁడు, ఉత్తమ సంస్కారి.

దేవదత్తుఁడు కర్కశుఁడై పక్కి నడిగినాఁడు; తనదని వాదించినాఁడు. దానికి సిద్ధార్థుఁడు "మృగయావినోదంబునం బాణహతం బగు ప్రాణి యేదేనియుఁ

ప్రాణి యున్నంత దనుక నాహతకునిది కా'' దను న్యాయముచే నాతని వాదమును ఖండించుచు :

> "దైవవిహితమైన దయకల్మి నాకు నీ
> యంచ బ్రతుకఁజేయు నంతపాటి
> యవసరంబు గల్గె, నకార్యకారణమున నా
> యదియె యిద్ది యొరుల దగుట యెట్లు ?"

అని దయా ప్రేరితమైన యుత్సాహమును బ్రకటించెను. న్యాయాధినేతయు నట్టి ధర్మమే నిర్ణయించి ప్రకటించినాఁడు. ఈ ఘట్టము సిద్ధార్థుని జీవితములో లోతైన అనుభవమును దెచ్చిపెట్టి జీవకారుణ్యము నందలి గాంభీర్యమును అతనియందు సంతరించి పెట్టినది.

తండ్రి పంపున పట్టణ దర్శనార్థ మేగిన సిద్ధార్థునకు ప్రకృతిలోని హింసాత్మక ప్రవృత్తి గోచరించినది. అది యతనిలోని అహింసాతత్వమును ప్రబోధించి పటిష్ఠ మొనర్చినది. ఆతనికి విభావము లయిన దృశ్యములు :

> "అతితికాయలు గాయ నవని దున్నుచుఁ గష్ట
> పడుచుండు కాసరద్వయము నొకటఁ
> జెన్నుగా దున్నిన చేలలో విత్తుల
> వైచుచుండెడు కాపువాండ్ర నొకట
> ఫలపుష్ప వితతులఁ దులఁదూఁగి నేలకు
> నంటుచున్నట్టి వృక్షాళి నొకట
> వాని ఫలంబుల భక్షించి సుఖియించు
> కీరాదిక పతత్రివార మొకటఁ
> బట్టి చీమల మ్రింగెడి బల్లిని, మఱి
> దాని మ్రింగెడు పాము, నద్దాని మ్రింగు
> వైనతేయునిఁ, జిన్న చేఁపలను మ్రింగు
> పెద్ద చేఁపలఁ దిను పక్షిబృంద మొకట;"

> "వానిఁ బట్టి భక్షించెడి శ్యేనములను
> నొకట వేఱొక్క యెడ మనుష్యులను దిను న, మోరులను........"

—ప్ర. 195, 196.

జూచుటచే నాతనికి లోకమంతయు హింసాప్రవృత్తి ప్రధాన మనియే స్ఫురించినది. దయాహృదయమున నిర్వేదము జనించినది. అది జ్ఞానమార్గము నావిష్కరించి నది. వెంటనే తీవ్రవిచారముద్రను వహించి ప్రక్కనున్న నేరెడు చెట్టుక్రింద కూర్చుండి యతఁడు ధ్యాననిశ్చలుఁ డయ్యెను. ధ్యానవిఘ్నము నాపాదింప యత్నించు నతని మిత్రులఁ గాంచి అంబరవాణి :

"ఈతఁడు పర సంరక్షణ
కై తా జన్మంబు నెత్తి నట్టిఁడు సుగుణా
న్వీతుఁడు మహానుభావుఁడు
చేతమ్మునఁ గరుణఁ దక్కఁ జేర్పఁ డితరమున్." —ప్ర. 200.

అని అతనియందు సంపూర్ణదశ నొందిన దయాభావమును నిరూపించి చెప్పినది. అది యతనికి పై మెట్టున కధికారము సంతరించినది. అతని చిత్తము తత్త్వ జ్ఞానా ర్జన కున్ముఖమైనది. కన్యాబహుమాన ప్రదానోత్సవమునకుఁ ప్రబోధించు పురో హిత సుతునితో నతఁడు—

"పరిణయ మొల్లక నే న
స్థిర మగు సంసార మనెడు తెరువునఁ బడ కాం
తరమగు తత్త్వ జ్ఞానాం
తరమునఁ జరియింతు" నని పల్కినాఁడు. —ద్వి. 24.

సిద్ధార్థుఁడు ప్రకృతి విద్యార్థి. అతఁడు జీవితములోఁ బొందిన అనుభూతు లన్నిఁటిని నొక్క జ్ఞానమునుదప్ప - ప్రకృతినుండియే గ్రహించినాఁడు. జీవితము నాత్మోన్నత్యమునకును పరహితార్థమునకు నెట్లు వినియోగము చేయవలెనో స్వయ ముగా జ్ఞానవంతుఁడై నిశ్చయించుకొని అట్లే నడచి చూపి లోకమున కాదర్శవంతుఁ డైనాఁడు.

అతని బ్రతుకుబాటను వెలుఁగుబాటకుఁ ద్రిప్పిన నిశితానుభూతులు మఱియు మూఁడు కలవు. అవి యాతఁడు కపిలవస్తు నగరమున నొంటిగా రథారూఢుఁడై వెడలుచుఁ గాంచిన వృద్ధరోగశవ దర్శనములు. అని యతని హృదయమును వికలపఱిచి విరక్తి పథమును బట్టించినవి. దానికిఁదోడు మరునాఁ డాతఁడు వేటకు వెడలి యొక కొండగుహలో నొక సన్యాసినిఁ గాంచి, అతని వలన—

"అవని మోక్షేచ్ఛ గల వా రఖిలబంధు
పుత్ర మిత్ర కళత్రంబు పూరితమగు
సంసరణవార్ధిఁ బడకయే చనఁగవలయు
నుగ్రకాంతారములవంక కూరు విడిచి"

అని ప్రబోధముఁ బడయుటచే జ్ఞానేచ్ఛాగ్నికి సన్యాస మారుతము తోడైనదైనది. సతీవిలాస విషయాసక్తము లగు నింద్రియముల నతఁడు నిగ్రహించి వెనుకకు మర లించినాఁడు. అంతరముగా దైవప్రబోధము రింగున నతని చెవులలో మ్రోఁగినది. యశోధరకు వచ్చిన కల అతని మార్గమును స్థిరీకరించినది. కాల మాసన్న మైనది. మోహపాశంబులఁ ద్రెంచి, భార్యను వదలి, చెన్నునికిఁ దన యాశయముఁ దెల్పి, కంటకము నెక్కి నిష్కంటకముగా నతఁడు తపోవనముఁ జేరినాఁడు. రాజ గృహనగర ప్రాంతములో సన్యాసివేషమున సత్యజిజ్ఞాసలో మునిఁగి భైక్షుకవృత్తితో తపోనిష్ఠతో జీవించినాఁడు. ఆతని నిష్ఠను గాంచి జనులతఁడు సర్వసిద్ధుఁడని భావిం చిరి. కాని తానొక సాధకుఁడనని వినయముతోఁ బ్రతివారితోడను దెల్పెడివాఁడు సిద్ధార్థుఁడు. పుత్త్రశోకార్త యగు నొక తల్లికి దుఃఖావృతమగు లోక స్వభావమును నిదర్శనాత్మకముగా నిరూపించి చెప్పి—

"మరణంబు సర్వసామాన్యంబు దుఃఖంబు
గాంచని వారు లోకమున లేరు
నిజ మిది యనుమాట నీయంత నీకు గో
చరముగా నీయుక్తి సలిపినాఁడ
నీదృశ దారుణ ఖేదమ్ములకుఁ గత
మెద్దియో తెలియఁగ నెంచి నేను
దిరుగుచున్నాఁడఁ దెలియుటకై ప్రాణ
మైనను విడుచు సాహసము కలదు." —చతు. 28.

అని తన జ్ఞానసాధనౌత్సుక్యమును బ్రదర్శించినాఁడు. జ్ఞానదీక్షను బూని సాధ కునిగా ప్రాణత్యాగమునకైన నుత్సహించు సిద్ధార్థుఁడు జ్ఞానదయావీరుఁడు.

యజ్ఞపశువులు సవనమున హననము చేయఁబడుట మొదటిసారి చూచిన సిద్ధార్థుని యెదంద యేరై పోయినది. బింబిసారనృపతి చేయు యజ్ఞమును గాంచిన గౌతముఁడు ఋత్విజులతో—

"ప్రాణహననంబు గడు సులభంబు గాని
ప్రాణ మిచ్చుట మనకు సాధ్యంబు కాదు
ప్రాణరక్షణకై పాటుపడనివారు,
ప్రాణిపైఁ బ్రేమలేని వారలును గలరె."

"జీవములయాత్ర సంపూర్తి చేయకుండఁ
జంపువారికిఁ బాపంబు సంభవించు
జీవహింస యొనర్చెడి చేఁత సేయు
వారలకుఁ బాపముక్తి చేకూర దెపుడు." --చతు. 51. 52.

అని ప్రబోధించి జంతుసంహారము మాన్పించి అహింసను స్థాపించెను. బింబిసారునకు తన జ్ఞానపిపాసను గూర్చి తెల్పినాఁడు సిద్ధార్థుఁడు. అతనితోఁ గలిసి అరాడుఁడను మునిం జేరి మోక్షమార్గముఁ దెలిసికొనినాఁడు. ఆత్మ సాక్షాత్కార సాధనోత్సాహముతో ప్రయాగక్షేత్రమునకు నడచి పోయినాఁడు. నిత్యోపవాసాదులతో దేహముఁ గృశింపఁ జేసినాఁడు; జ్ఞానసాధనలోఁ దీవ్రతపస్సునకు గడఁగినాఁడు. శుష్క దేహము జ్ఞానసాధనపటువు కాలేదు. ఈసత్య మాతఁడు వారాంగనా వాక్యము వలన గ్రహించినాఁడు.

"బిగువుగ సారించితివేఁ
దెగుఁ దంత్రులు, వదలు చేసితేనిన్ సరిగాఁ
దగదు శ్రుతిగాన సమముగఁ
దగుగతి సారింపు మీ చితారు లతాంగీ." —చతు. 114.

అనునవి ఆమె పల్కులు. అవి సిద్ధార్థుని చెవులఁ బడినవి. జ్ఞానవాసనలు నిండిన అతని హృదయము నీరసములైన అప్పలుకులనుండి మహత్తరగంభీరార్థమును సారవంతముగా నూహింపఁ గల్గినది.

"నీచులనుండియుం దగిన నీతులు కొన్ని గ్రహింప వచ్చుఁ దం
త్రీచయముల్ బిగించి తెగఁ దీసినచో శ్రుతి వోవు భంగిఁ గా
ర్శ్యాచరణంబు దేహమున కబ్బినవేళలఁ దత్త్వచింతయుం
దోఁచునె ? యే నెఱుంగ కిటు తోరముగా మెయిఁ జిక్కఁజేసితిన్"
—చతు. 117.

అని వితర్కించి సుజాత దైవదత్తముగాఁ దన కిచ్చిన క్షీరాదులను గ్రహించి తనువును జ్ఞానసాధనపటిష్ఠముగా నొనర్చుకొనెను. సుజాత యిచ్చిన క్షీరసారమునుండి అతఁడు నేర్చుకొనిన పాఠ మిది :

"క్రమముగా నైకజంతుసారంబు కతన
నీపదార్థంబు రుచ్యమై యెసఁగినట్లు
నైకజన్మంబు లెత్తి యనంతరంబ
జీవుఁడును ముక్తి యను ఘన స్థితికి వచ్చు." —చతు. 139.

నని. అతని కంటఁ గానఁబడిన ప్రతి లౌకిక సన్నివేశమును జ్ఞాన ప్రవృత్తికి విభావమై లోని సంస్కారములను బలీయ మొనర్చినది; అతని భావోత్కర్ష స్థితి జ్ఞానోదయాధికారము నందుకొని పండి పలించినది.

బుద్ధగయలో బోధివృక్షమునీడ సిద్ధార్థుఁడు బుద్ధుఁడైనాఁడు. తాను పొందిన జ్ఞానానుభూతిని బింబిసారాది ప్రముఖుల కమృతోపన్యాసములఁ బ్రబోధించినాఁడు. శిష్యు లసంఖ్యాకులైరి. చివర కతని భార్యాదులు కూడ శిష్యత్వము స్వీకరించినారు. అతఁ డమరజీవియు, జ్ఞానవీర జ్యోతియు నయి భరతఖండమును వెలుఁగుల నింపి విషయ దుఃఖితుల కఖండానంద మార్గమును జూపించినాఁడు.

10. నాయక పాత్రపోషణతోపాటు మిగిలిన పాత్రలను గూడ నత్యంత శ్రద్ధతో కవులు తీర్చిదిద్దిరి. ఉదా : శుద్ధోదనుని పాత్రను గైకొందము. అతఁడు పుత్త్రుని విషయాసక్తునిగా నొనర్చి చక్రవర్తిగాఁ జూడవలె నని సమస్త పురుష కారము వెచ్చించి యత్నించినవాఁడు. యోగిగా మారు సూచనలు తనయునియందు తలయెత్తినప్పుడెల్ల అతని హృదయ క్షోభ అంతయింత యనుటకు వీలులేదు. తత్సంఘర్షణ నాయువుపట్టుగాఁ జిత్రించి యా పాత్రకు కవులు జీవము పోసినారు. మూలమునందుకన్న తెలుఁగున నీ పాత్ర సజీవమై సుస్పష్ట రేఖలతో శోభిల్లుచున్నది. ఇట్లే యశోధర పాత్రయు. ఉత్తమక్షత్రియవంశజగా, సుగుణ ఖనిగా, సౌమ్యమూర్తిగా, భార్యగా, తల్లిగా, విరహోత్కంఠితగా, బౌద్ధ భిక్షుకిగా కవులు పఠితల చిత్తముల కెక్కునట్లాపాత్రను చిత్రించి యున్నారు.

బుద్ధ చరిత్రము ననుసరించుటలో తి. వేం. కవులు మూలమునందున్న కథాంశములఁ గొన్నింటిని వ్యత్యస్తము లొనర్చుటయు, కొన్నింటిని వదలివేయు

టయు నొనర్చి యుండిరి. వాని నట్లే యాంధ్రీకరించినచో నీ కావ్య మింకను రస వత్తరముగా నుండెడి దనుటలో సంశయము లేదు. అట్టి వానిని గొన్నింటినిఁ బేర్కొందును.

1. సిద్ధార్థుని నగరయాత్రకు హేతువు లగు దేవతా ప్రబోధము, చిత్ర యను దాసి సంగీతము అనునవి మూలమున విపులముగా వర్ణితములై యుండ కవులు తెలుఁగున సూచించి మాత్రమే వదలిపెట్టిరి. ప్రథమనగరయాత్రయందు సిద్ధార్థుఁడు – "పూర్ణ రతోత్సవ మొప్ప నేఁగి కాంచెన్నరులందుఁ గల్గెడు విశేష ముల నృది కెక్కునట్లుగన్." ఇట్లు కొంతవడి వీక్షించి మరలి స్వస్థానంబున కరిగి సుఖంబుండె" నని కవులు వర్ణించిరి. ద్వితీయ నగరయాత్ర యందుఁ గ్రమ ముగా రోగిని – శవమును – వృద్ధుని – గాంచినట్లు సంగ్రహముగా రచించి ముగించిరి. మూలముతోఁ బోల్చి చూచుచో నీ కథా ఘట్టములు నీరసములై యున్న వనుటలో విప్రతిపత్తిలేదు. మూలమున ఆర్నాల్డు కవిత్వావేశముతో నీ ఘట్టము లను వర్ణించి యున్నాఁడు. ప్రాకారత్రయావృత మైన సుందరప్రాసాదమున నివసించు రాజకుమారుఁడు నగరి వెడలి నగరమునం దడుగిడుటకు బలమైన హేతువులే కావలయును. అందు దేవతాప్రబోధ మొకటి. సిద్ధార్థుని చెవులలో సుర దివ్యవాణు లెల్లప్పుడు మారుమ్రోఁగు చుండెడివఁట! ఇది దాదాపు 50 పంక్తు లలో మూలమున నుండ, తెలుఁగున నిస్సారమైన యొక పద్యమై నిలిచినది. ఆంగ్లపంక్తు లెంత రసవత్తరములో కొన్నింటిని చూడుడు:

"O Maya's son! because we roam the earth
Moan we upon these strings; we make no mirth,
So many woes we see in many lands,
So many streaming eyes and wringing hands".

"Yet mock we while we wail, for, could they know,
This life they cling to is but empty show;
'T were all as well to bid a cloud to stand,
Or hold a running river with the hand".

"But thou that art to save, thine hour is nigh!
The sad world waiteth in its misery,

The blind world stumbleth on its round of pain;
Rise, Maya's child ! wake ! slumber not again !".

"We are the voices of the wandering wind:
Wander thou, too, O Prince, thy rest to find;
Leave love for love of lovers; for woe's sake
Quit state for sorrow, and deliverance make".

(Book III - 34 p.)

ఇందులో కనీసము ద్వితీయ చతుర్థపద్యములనైనను కవులు అనువదించినచో బాగుండెడిది.

2. ఇఁక రెండవది చిత్రాగానము : మూలమున చిత్ర ఒక వైణిక. ఆమె సిద్ధార్థుని విలాసమందిరములో గానమాధుర్యముతో వీణపై - ప్రేమ, మాయాశ్వము, సుదూర విచిత్రాద్భుత దేవలోకములు, అస్త్రాద్రి, సూర్యుడు సముద్రములో మునుఁగు దృశ్యములు మొ॥ వానిని స్ఫురింపఁజేయు గానకల్పన మొనర్చి ఆలపించును. తత్ గానగాథాశ్రవణము సిద్ధార్థునిలో లోకవైచిత్రిని చూడవలెనను కోర్కెను రేకెత్తించినది. అట్టి విశిష్టకథాఘట్టము తెలుఁగున వదలఁబడినది. బుద్ధుని హృదయమునఁ గల్గిన వితర్క మెంత మధురముగా వర్ణితమైనదో Light of Asia లోని ఈ క్రింది పంక్తులను గాంచుడు :

"Then spake he, sighing, - 'Chitra brings me back
The wind's song in the strings with that fairy tale:
Give her, Yasodhara, thy pearl for thanks. ..........
There must be many we should love—how else ?.......
O Chitra ! you that know of fairy land !
Where tether they that swift steed of thy tale ?
My palace for one day upon his back,
To ride and ride and see the spread of the earth;
Nay, if I had yon callow vulture's plumes—
The carrion heir of wider realms than mine-
How would I stretch for topmost Himalay,

Light where the rose-gleam lingers on those snows,
And strain my gaze with searching what is round !
Why have I never seen and never sought ?
Tell me what lies beyond our brazen gates ?"

(Book III - 35-36 P.)

3. బుద్ధుని ప్రథమనగరయాత్రలో నొక వృద్ధుని దర్శనమైనట్లును, ఆ రాత్రి వార్థకముగూర్చి బుద్ధుఁడు క్షుభితుఁడైనట్లును మూలమున వర్ణితమైయున్నది. శుద్ధోదనుని యేర్పాట్లలో లోపము సూచింప కుండుటకై కవులు వీనిని తీసివైచి రేమో కాని ఆ రాత్రి రాజునకు స్వప్నము వచ్చుటకు తగిన హేతువు గల్పింపలేక పోయిరి. దానిని వదలుటవలన కార్యకారణ పటిష్ఠములైన కావ్యార్థములు బల హీనము లగుచున్నవి. వృద్ధ దర్శనము శవ దర్శనానంతరము సూచించుటలో తెలుఁగు కవు లంత యౌచిత్యము పాటింపలే దని స్ఫురించుచున్నది.

4. ద్వితీయనగరయాత్రకు సిద్ధార్థుఁడు రాజానుమతిని గైకొని రాత్రివేళ సార్థవాహుల వేషమున నగరమున సంచరించినట్లు మూలమున నుండ తి. వేం. కవు లా రమణీయకథాకల్పన మేలనో విడిచివైచిరి.

5. ద్వితీయ నగరయాత్రలో మూలములోవలెనే సిద్ధార్థుఁడు వృద్ధుని, శవమును, గాంచినట్లు కవులు వర్ణించిరి గాని మూలమునందున్న రమణీయతను తీసికొని రాజాలక పోయిరి.

కవులు వదలిన కమనీయ భావములు కొన్ని—

(a) వార్ధక నిరూపణము :

"This is no other than an aged man;
Some fourscore years ago his back was straight,
His eye bright, and his body goodly : now
The thievish years have sucked his sap away,
Pillaged his strength and filched his will and wit;
His lamp has lost its oil; the wick burns black;

What life he keeps is one poor lingering spark
Which flickers for the finish : such is age."

L. O. A. Book III Page 39.

(b) వ్యాధులు మానవులను బాధించు విధము వర్ణించుట :

"And channa said, 'Like the sly snake they come,
That stings unseen; like the striped murderer,
Who waits to spring from the Karunda bush,
Hiding beside the jungle path; or like
The lightning, striking these and sparing those'
As chance may send."

L. O. A. Book III Page 48.

(c) సిద్ధార్థుని మనస్సంక్షోభము :

"Me too this lure hath cheated, so it seemed
Lovely to live and life a sunlit stream
For ever flowing in a changeless peace;
Whereas the foolish ripple of the flood
Dances so lightly down by bloom and lawn
Only to pour its crystal quicklier
Into the foul salt sea". ...........

L. O. A. Book III — Page 51.

వీనిలో నున్న భావౌన్నత్యము, అలంకారశోభ, శిల్ప విన్యాసము, రమణీయ దర్శనము, రసావేశము తెలుఁగుకావ్యమున నదృశ్యములైనవి.

ఒక్కొకసారి ఒక భాషలో నున్న సున్నితమైన వాక్శిల్పము, భావతీవ్రత, వ్యంగ్యగౌరవము, పలుకుబడి సొంపు, సంస్కారవిశేషము మఱియొక భాషలోనికిఁ దెచ్చుట కష్టమగును. కావున నట్టి కారణముచే కొన్ని రమణీయ భావములను ఆర్నాల్డు కవిత్వమునుండి కవు లనువదింప లేకపోయిరి.

ఉదా : ప్రథమాశ్వాసాంతమున జంబూవృక్షమునుండి వెలువడిన మాటలు—

"Let be the king's son ! till the shadow goes
Forth from his heart my shadow will not shift."
L. O. A. Book I—Page 15.

ఈ పలుకులు తెలుఁగులో కథగా చెప్పఁబడినవి—

క. జంబూ వృక్షము రవి కిర
ణంబులు పయి సోఁకకుండ నరనాథ తనూ
జుం బేర్మిఁ గాచుచుండె; సు
ఖంబులు తమయంతఁ గల్గుఁగా జ్ఞానులకున్." (1-202)

2. దుస్స్వప్నభీత యైన యశోధర నూరార్చు సిద్ధార్థుఁడు పల్కిన పల్కులు—

"But then take comfort; and, if sorrow falls,
Take comfort still in deeming if there may be
A way to peace on earth by woes of ours;
And have with this embrace what faithful love
Can think of thanks or frame for benison—
Too little, seeing love's strong self is weak....
Yet kiss me on the mouth and drink these words
From heart to heart therewith, that thou mayst know—

What others will not-that I loved thee most
Because I loved so well all living souls."
L. O. A. Book, IV—Page 60,

ఈ మాటలు తెలుఁగులో పేలవములైనవి. ఆర్నాల్డు కవిత్వము భావావేశముతో నిస్సీమమగు లాస్య మొనర్చుచుండ కవులకవిత్వము నిగ్రహాత్మకమైన నడకతో

పరిమిత భావపరిధిలో పచారులు చేసినది. ఇట్లగుటకు కారణము మూలము పర దేశభాషలో నుండియుండుట యనియే నా భావము.

ప్రాచీన లాక్షణిక సంస్కార హృదయులైన తి. వేం. కవులు పాశ్చాత్య కవి సమయములు రుచింపక వదలిన భావములు కొన్ని యున్నవి. సిద్ధార్థుని చూపును ఆర్నాల్డు వర్ణించిన విధము—

.... .... .... .... .... .... .... .... .... .... .... "Soft
As the last smile of sunset was the look
Siddhartha bent upon his weeping wife."
L. O. A. Book IV P. 59.

ఈ భావమును కవులు వదలిరి. చూపులను సాయంసంధ్యతోఁ బోల్చుట భారతీయ కవి సంప్రదాయము కాదు. ఇట్టివి పెక్కులు.

ఇట్లు చర్చించుచు పోవుచో వ్యాసము పెరిగి పోవును. మొత్తమునకు కవుల స్వభావభేదముచే కావ్యరచనలయందు భేదము కానవచ్చుచున్నది. ఆర్నాల్డులో వీరశైవ కవుల కవిత్వావేశము కాననగును. అతని కవిత్వము చదువునప్పుడు పఠిత కొక రసావేశము కలిగిన యనుభవము కలుగును. ఆనందావేశములకు సంగమస్థానము ఆర్నాల్డు కవిత్వము. అశ్వఘోషుని కావ్యము శాంత రససాగరము. అతని కవిత్వమునందు రసనిర్భరత్వము, మతాభినివేశము, తాత్త్విత భావౌన్న త్యము అడుగడుగున ప్రత్యక్షమగును. ఏదో ఒక మానవాతీతమైన దైవికశక్తి కావ్యమంతయు నావరించి కథ నడపించుచున్న దను 'మిస్టిక్' భావము కల్గి పఠిత నాశ్చర్యమగ్ను నొనర్చును. తిరుపతి వేంకట కవులు బుద్ధచరిత్రమును ప్రసన్న మధురమైన శైలిలో రచించి యుండిరి. ఆర్నాల్డు ఆవేశముగాని, అశ్వఘోషుని తాత్త్వికౌన్నత్యము గాని తిరుపతి వేంకట కవుల కవితలో కానరాదు. కాని కవి త్వమునందలి సహజప్రసాదగుణముచేతను, వస్తువులోని సహజ పటుత్వము చేతను తి. వేం. కవుల బుద్ధ చరిత్రము తెలుఁగున నొక రమణీయ కావ్యమై రాజించుచున్నది. మూలములు చదివిన సహృదయులకు మాత్రము తి. వేం. కవుల కావ్యము సంతృప్తిని గల్గించుట కష్టము! అయినను తి. వేం. కవుల కావ్య మవతరించి మూలములను జదువవలసిన యావశ్యకతను ఆంధ్రావళిచే మర పింపఁజేసినది. ఆకవులకవిత్వశక్తిపై నాంధ్రుల కున్న యాదర మంతగొప్పది!

తెలుఁగున వెలసిన బుద్ధచరిత్రలలో తిరుపతివేంకటకవుల కృతిని మించిన కావ్యము కానరాదు ! కావున తెలుఁగున నీ కావ్యమున కేర్పడిన గౌరవము సార్థక మగుచున్నది.

బుద్ధదేవుని చరిత్ర రచనకుఁ బరోక్షముగా సమకాలీన దేశ పరిస్థితులు ప్రేరకములై యుండవచ్చును. జాతిపిత బాపూజీ నాయకత్వమున భారతదేశము స్వాతంత్ర్య శాంతి సమరమునకు సిద్ధమైనట్టి తరుణ మది. ప్రతి భారతీయుఁడును బాపూజీని బుద్ధదేవునిగా భావించి యుత్తేజము వహించినాఁడు. దానికిఁ దోడు ప్రాచీన భారత చరిత్రను త్రవ్వి, పూర్వవీరులపౌరుషము లెంచి యుత్సాహముఁ బెంచుకొనినాఁడు. ఇట్టి జాగృతి కలిగిన సమయమున నీ కావ్యము జన్మించి "ఆసియా జ్యోతి"ని ఆంధ్రుల ముందుంచి, అతని ప్రజాహితైకతత్పరత్వ మును, దయాపారమ్యమును, అకుంఠితజ్ఞానసాధనదీక్షను వర్ణించి, ఆత్మాభ్యు న్నతితోపాటు సంఘాభ్యున్నతి యవసర మనెడి ప్రబోధము చాటి చెప్పినది. జాతి చైతన్యము ఈ కావ్యజన్మహేతువులలో ముఖ్యమైనది.

ఈ యుగములో వెలసిన వగు దొరసానయ్యగారి గౌతమబుద్ధచరిత్ర చిలకమర్తివారి సిద్ధార్థచరిత్ర, పానుగంటివారి బుద్ధబోధసుధ, సన్నిధానమువారి జాతకథాగుచ్ఛము. దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి బుద్ధపురాణము, మొ॥ కావ్య ములలో నిది మేలుబంతి. పింగళి కాటూరిగారల "సౌందర నందము" – జంధ్యా పాపయ్యశాస్త్రిగారి "కరుణశ్రీ" – బుద్ధచరిత్ర కల్పించిన చైతన్య ప్రాభవముచేత వెలుగొందిన కళాజ్యోతులు. తిరుపతి వేంకట కవులు కావ్యకళాజ్ఞానసిద్ధులై, తత్కవిత్వధారామాధుర్యమును దయాబుద్ధితో దేశస్థులకుఁ బంచిపెట్టిన మహితా త్ములు ! జ్ఞానసిద్ధిని గడించి, భూతదయతో దివ్య జ్ఞానామృతమును లోకమునకుఁ బంచిపెట్టిన బుద్ధదేవునిచరిత్రను కావ్యముగా తిరుపతి వేంకట కవులు రచించుట కంటె పరమ సార్థక్యము మఱియేమి కలదు ! 'ఆసియా జ్ఞానజ్యోతి' యగు బుద్ధుని దయాచరిత్రమును తెలుఁగున వెలుఁగుల జాలుగా వెలువరించిన రససిద్ధులు తిరుపతి వేంకట కవులు !

---